శ్రీః

మహాకవి శ్రీ కాళిదాస విరచితమ్

# కుమార సమ్భవ మహాకావ్యమ్

రామోరావిరచిత **మృణాళినీవ్యాఖ్యా**

వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా సముల్లసితమ్

## ద్వితీయః సర్గః



**రావి మోహనరావు** **M.Sc., M.A. (Sanskrit)**
లెక్చరర్
వి.ఆర్.యస్. & వై.ఆర్.యన్. కాలేజి, చీరాల.



శ్రీః
మహాకవి శ్రీ కాళిదాస విరచితమ్
కుమార సమ్భవ మహాకావ్యమ్
రామోరావిరచిత మృణాళినీవ్యాఖ్యా
వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా సముల్లసితమ్
ద్వితీయః సర్గః

ప్రథమముద్రణ : **11-12-2010**
ప్రతులు : **500**
పేజీలు : **184**
వెల రూ. : **100/-**



Lecturer, V.R.S. & Y.R.N. College, Chirala - 523 157

**Residence:**
4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, CHIRALA.
Cell : **94401 15411**

D.T.P.:-
**J.RAJA**
Ganesh Graphics,
CHIRALA.
Cell : **9848390564**

Printed at:-
**KARSHAK ART PRINTERS,**
HYDERABAD



# మధురానుభూతి

సంస్కృత కావ్యనందనోద్యానంలో అమృత ఫలప్రసవాలైన కావ్య కల్పకాలు ఎన్నో ఉన్నా, వాటిలో కాళిదాసు రచించిన శ్రవ్యకావ్యత్రయికిగల స్థానము అత్యున్నతం. **మేఘసందేశం, కుమారసంభవం, రఘువంశం** అనే క్రమంలో ఈ మూడు కావ్యాల రచన సాగిందని సాహిత్య విమర్శకుల అభిప్రాయం. సంస్కృత భాషను అధ్యయనం చేసే ప్రతి విద్యార్థి ఈ మూడు కావ్యాలలో ఎంతోకొంత భాగాన్ని తప్పక చదవడం వీటి ప్రశస్తిని, గౌరవాన్ని చాటుతున్నాయి.

**"విశ్వశ్రేయః కావ్యమ్"** అని అంటూ నన్నయ భట్టారకుడు కావ్యాన్ని నిర్వచించాడు. లోక కల్యాణాన్ని ఉద్దేశించి ఒక మహత్తర సందేశాన్ని కాంతాసంమిత ప్రక్రియలో అందించే కావ్యమే సత్కావ్యం. అటువంటి కావ్యాలను వెలయించిన కవులే మహాకవులనబడతారు.

**"మహాకవీనాం గణనా ప్రసంగే కనిష్ఠికాధిష్ఠ"**తుడైన కాళిదాసు తాను రచించిన కుమారసంభవ కావ్యంలో ఇటువంటి ఏ మహనీయమైన సందేశాన్ని అందించాడు? అనే ప్రశ్న కల్గకమానదు. కేవలం కుమారస్వామి జన్మవృత్తాంతాన్ని వర్ణించడం కోసంగా అయితే అతడీ కావ్యరచనను చేయవలసిన పనిలేదు. మత్స్యపురాణాదులలో ఈ కథ తెలుపబడింది కదా! అందువల్ల కాళిదాసు ఏదో





ఒక గొప్ప తత్త్వాన్ని ఆవిష్కరించడం కోసమే ఈ ఆఖ్యానాన్ని రమణీయమైన కావ్యంగా మలిచి ఉంటాడు అన్నది నిశ్చయం. అయితే ఈ తత్త్వం ఏమి? అన్నది గమనించ వలసిన అంశం.

కాళిదాసు మహాకవి, కుమారసంభవ కావ్యంలోని మొదటి అయిదు సర్గలలో అక్కడక్కడ చేసిన పదప్రయోగాలను గమనిస్తే అతడు ఈ కావ్యంలో అందించదలచిన తత్త్వం ఏది? అన్నది స్పష్టపడుతుంది. ఈశ్వరుని పరిణయమాడగోరిన పార్వతిని శివుని పరిచర్యచేసి, అతని అనుగ్రహాన్ని పొందడం కోసం శివుని ఆశ్రమానికి పంపించాడు హిమవంతుడు. ఆ విధంగానే హరుని సేవకోసం పార్వతి చెలికత్తెలతో పాటు శివునివద్దకుపోయి నమస్కరించి అతనికి తామరపూసలమాలను అందించింది. ఆ మాలను తీసికొన్న శివుడు పార్వతి అతిలోక సౌందర్యాన్ని చూచి ఒక్క క్షణకాలం **"కించిత్పరిలుప్తధైర్యుడ"**య్యాడు. ఆమె బింబాధరాలపైతన చూపును ప్రసరింపజేశాడు. కాని, యోగులలో మహాయోగి అయిన శివునకు కల్గిన ఆ వికారం క్షణం మాత్రమే. మఱు క్షణంలో తన ఇంద్రియ క్షోభాన్ని నిగ్రహించుకొని, తన మనోవికారానికి హేతుభూతుడైన మన్మథుని భస్మసాత్కృతుణ్ణి చేశాడు. అక్కడ నుండి అంతర్ధానమయ్యాడు.

పార్వతి హతాశయై, శివునకు అర్పించదలచిన తన అందం నిష్ఫలమైనదని చాలావగచింది. **"నినిందరూపం"** అన్నట్లు మనస్సులో తన సౌందర్యాన్ని నిందించు కొన్నది. తనను **"అవంధ్యరూప"**గా చేసికోవాలని అనుకొన్న పార్వతి దానికి తగిన ఉపాయం తపశ్చరణమేనని నిశ్చయించుకొన్నది. తీవ్రమైన తపస్సును శివుని ఉద్దేశించి చేసింది. ఆమె తపస్సు మునుల తపస్సును సైతం మించింది.

పార్వతి రూపసౌందర్యానికి వశుడు కాకపోయినా, హరుడు ఆమె దృఢమైన అనురాగాన్ని, దీక్షను గమనించి, పరీక్షించడం కోసం బ్రహ్మచారి వేషంలో ఆమె ఆశ్రమానికి వచ్చాడు. ఆమె తపస్సు చేయడానికిగల కారణాన్ని ప్రశ్నించాడు హరుడు. అపుడు పార్వతి చెలికత్తె బదులు పల్కుతూ ... **"మదనస్య నిగ్రహాత్ అరూపహార్యం పినాకపాణిం పతిమాప్తు మిచ్ఛతి"** అని అన్నది. ఆ తరువాత బ్రహ్మచారి చేసిన శివనిందను ఖండిస్తూ పార్వతి తగిన సమాధానాన్ని పల్కింది. ఇంకా ఏదో చెప్పబోయే బ్రహ్మచారి వద్దనుండి దూరంగా తొలగిపోవాలని పైకి లేచింది. అపుడు పరమశివుడు నిజరూపంలో ఆమె ముందు సాక్షాత్కరించి, ఆమెను అనుగ్రహిస్తూ– **"అద్యప్రభృత్యవ నతాంగి తవాస్మిదాసః, క్రీతస్తపోభిః"** అని అన్నాడు.

ఈ వృత్తాంత కథనంలో మహాకవి చేసిన పద ప్రయోగాలను గమనించినపుడు అతడు ఈ కావ్యంలో ఉపదేశించదలచిన తత్త్వమేమో సులభంగా వ్యక్తమౌతుంది. పరమాత్మ ఆత్మసౌందర్యానికి వశుడు అవుతాడు తప్ప, నశ్వరమైన దేహసౌందర్యాన్ని మెచ్చడు. అందువల్ల – ఆత్మ సౌందర్యమే గొప్పది అనే పరమార్థాన్ని కాళిదాస మహాకవి ఈ కావ్యంలో ప్రధానంగా వ్యక్తం చేశాడన్నది స్పష్టపడుతుంది. భక్తి క్రీతుడు కదా పరమాత్మ. **"భక్త్యా త్వనన్యయా శక్యః"** అని గీతాచార్యుని సూక్తి.

ఇటువంటి మహాకావ్యం కుమారసంభవానికి గల వ్యాఖ్యలలో మల్లినాథసూరి రచించిన సంజీవనీవ్యాఖ్య సుప్రసిద్ధం. ఇదేకాక, వల్లభదేవుడు రచించిన పంజికా మొదలైన వ్యాఖ్యలు ఇంకా ఎన్నో ఉన్నాయి. తెలుగులో కూడా ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలతో కూడిన వివరణలు కూడా చాలా వచ్చాయి. అయితే ఇపుడు మిత్రులు, చీరాల వాస్తవ్యులు శ్రీ రావి మోహనరావుగారు స్వయంగా రచించి, ప్రచురిస్తున్న మృణాళినీ వ్యాఖ్య పలురీతులలో విశిష్టమైనది. కనుక ఈ వ్యాఖ్య పండిత పామర రంజకం అనడం అతిశయోక్తి కాదు. ఏ కార్యాన్ని చేసినా చిత్తశుద్ధితో, అకుంఠితదీక్షతో చేయటం శ్రీ మోహనరావుగారి అలవాటు. అది ఈ వ్యాఖ్యారచనలో అడుగడుగునా గోచరిస్తుంది. తాము సంస్కృత భాషాధ్యయనం చేసేటపుడు అనుభవించిన క్లేశాన్ని దృష్టిలో పెట్టుకొని, ఈ కావ్యాన్ని అధ్యయనంచేయదలచిన వారికి ఏ క్లేశం కలుగరాదనే భావంతో శ్లోకాలకు సమగ్రమైన వివరణను మోహనరావు గారు సమకూర్చారు. ఈ ప్రయత్నంలో ఎన్నో గ్రంథాలను పరామర్శించి, ప్రమాణాలను ఉట్టంకించారు. వృత్తిరీత్యా భూగర్భశాస్త్రాన్ని అధ్యాపనం చేసే మోహనరావు గారు సంస్కృత భాషాధ్యయనంలో ప్రచారంలోగల ఆసక్తి, ఆదరం ఎటువంటి వారికైనా ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి. వీరి ఈ ఆసక్తి, శ్రద్ధ ద్విగుణీకృతంకావాలని, వీరు ఇదేరీతిలో కుమారసంభవాన్ని పూర్ణంగా వ్యాఖ్యానించగల శక్తియుక్తులను భగవానుడు అనుగ్రహించాలని కోరుతున్నాను. ఈ మహత్కార్యాన్ని చేపట్టిన వీరిని హార్దంగా అభినందిస్తూ, వీరు సంతరించిన విస్తృతమైన మృణాళినీ వ్యాఖ్య నాకు కల్గించిన మధురానుభూతిని వ్యక్తం చేయడానికి అవకాశాన్ని నాకు కల్గించిన సహృదయ మిత్రవర్యులు మోహనరావు గారికి కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను.

***కుమారసంభవవ్యాఖ్యా మోహనరాయనిర్మితా।***
***మృణాళినీ భవేన్నూనం సంస్కృతాధ్యేతృకల్పకా॥***

— *డా॥ **ఈ.ఏ. శింగరాచార్యులు,** తిరుపతి.*





శ్రీః

ఓం కుమార శ్రీగురవే నమః



**మృణాళినీ వ్యాఖ్యానమున**

ఉదహరింపబడిన విషయములకు సంబంధించిన
ఆయా గ్రంథ రచయితలకు, వ్యాఖ్యానకారులకు నమస్సుమాంజలులు.



ఇట సహకరించిన డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావుగారు,
డి. పాపిరెడ్డిగారు, సి. సుబ్బారావుగారు, మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
గరిమెళ్ళ సోమయాజులుశర్మగారు, డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రిగారు,
మహామహోపాధ్యాయ శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గార్లకు మరియు అడిగిన
వెంటనే "మధురానుభూతి" అందించిన
డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు, తిరుపతివారికి,



పితృతుల్యులు శ్రీ దోర్బల విశ్వనాథశర్మ, రామాయంపేట వారికి



నా ఆరాధ్యదైవమైన
మహాయోగి శ్రీ అరవిందభగవానుడు,
వారి అర్ధభాగమైన మృణాళినీదేవికి నమస్కరిస్తూ...



శ్లో॥ నాహం మన్యే సువేదేతి – నో న వేదేతి వేద చ।
యో నస్ తద్వేద తద్వేద – నో న వేదేతి వేద చ॥

– కేనోపనిషత్ –10

ఓం శాన్తిశ్ శాన్తిశ్ శాన్తిః

**- రా మో రా**

శ్రీః

# కుమారసమ్భవమహాకావ్యమ్

## 'బ్రహ్మసాక్షాత్కారో నామ ద్వితీయః సర్గః

**అవతారికా** : తారకవిప్రకృతైః దేవైః కృతా బ్రహ్మస్తుతిః –
తారకునకు భయపడిన దేవతలు బ్రహ్మను స్తుతించుట

శ్లో ॥ **తస్మిన్ విప్రకృతాః కాలే**
**తారకేణ దివౌకసః ।**
**తురాసాహం పురోధాయ**
**ధామ స్వాయమ్భువం యయుః ॥** 1

**పదవిభాగము:–** తస్మిన్, విప్రకృతాః, కాలే, తారకేణ, దివౌకసః, తురాసాహమ్, పురోధాయ, ధామ, స్వాయమ్భువమ్, యయుః ।

**అన్వయక్రమము:–** తస్మిన్ కాలే తారకేణ విప్రకృతాః దివౌకసః తురాసాహమ్ పురోధాయ స్వాయంభువమ్ ధామ యయుః ।

**ప్రతిపదార్థము:–** తస్మిన్ కాలే – పార్వతీదేవి శివుని సేవించుకాలమందు, తారకేణ – తారకాసురునిచేత, విప్రకృతాః – పీడితులైన, దివౌకసః (పృషోదరాదీని యథోపదిష్టమ్' ఇతి సాధుత్వమ్) – దేవతలు, తురాసాహమ్ – ఇంద్రుని, పురోధాయ – ముందుంచుకొని, స్వాయంభువమ్ – బ్రహ్మదేవునిదైన, ధామ – సత్యలోకమును గూర్చి, యయుః – పోయిరి.

**తాత్పర్యము:–** పార్వతీదేవి శివుని సేవించుకాలమందు తారకాసురునిచేత పీడితులైన దేవతలు ఇంద్రుని ముందుంచుకొని బ్రహ్మదేవునిదైన సత్యలోకమునుగూర్చి పోయిరి.

**విభక్తులు/క్రియలు:–** 1. తస్మిన్ – **తస్మిన్** ,తయోః, తేషు; దకారాన్తపుంలింగ తచ్ఛబ్దము. సప్తమీ విభక్తి ఏకవచనము. 2. కాలే – **కాలే,** కాలయోః, కాలేషు; అకారాన్తపుంలింగ కాల శబ్దము. సప్తమీవిభక్తి ఏకవచనము. 3. తారకేణ – **తారకేణ,** తారాకాభ్యామ్, తారకైః; అకారాన్త పుంలింగ తారకశబ్దము. తృతీయావిభక్తి ఏకవచనము. 4. విప్రకృతాః – విప్రకృతః, విప్రకృతౌ, విప్రకృతాః ; అకారాన్త పుంలింగ విప్రకృత శబ్దము. ప్రథమావిభక్తి బహువచనము. 5. దివౌకసః – దివౌకాః, దివౌకసౌ, **దివౌకసః,** సకారాన్త పుంలింగ దివౌకశ్శబ్దము. ప్రథమావిభక్తి బహువచనము, (దివ్+ఓకస్) లేదా ద్యు+ఓకస్); 'ద్యు' కు దివ్ ఆదేశము 6. తురాసాహమ్ – **తురాసాహమ్,** తురాసాహౌ, తురాసాహాన్; హకారాన్తపుంలింగ తురాషాహ్ శబ్దము. ద్వితీయ విభక్తి ఏకవచనము. 7. పురోధాయ – అవ్యయము,



(పురస్+ధా+క్త్వా) (ల్యబన్తము) 8. స్వాయంభువమ్ – **స్వాయంభువమ్,** స్వాయంభువే, స్వాయంభువాని; అకారాన్తనపుంలింగ స్వాయంభువశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9. ధామ – ధామ, ధామ్నీ –ధామనీ, ధామాని; నకారాన్త నపుంసకలింగ ధామన్శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము 10. యయుః – క్రియ

**సమాసాలు:–**

1) దివౌకసః – ద్యౌః ఓకః యేషామ్ (బహువ్రీహి)తే.
ఓకః యేషామ్ (బహువ్రీహి) తే.

2) తురాసాహమ్ – తురం సాహయతీతి (ఉపపదతత్పురుష)

3) స్వాయంభువమ్ – స్వయంభువ ఇదం స్వాయంభువమ్, తత్.

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు.**

**1. తురాసాహమ్** 1. తురం వేగవన్తం సాహయతి అభిభవతీతి.

2. తుర్+సహ+ణిచ్+క్విప్

3. హకారాన్త పుంలింగము. తురాషాట్ శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము.

4. 'ఛందసి సహః' (3–2–63) ణ్విః స్యాత్ తురం వేగం సహత ఇతి తురాషాడింద్రః। ణ్విః। యద్వా సహతేర్ణిచికృతే సాహయతేః క్విప్। 'అన్యేషామపి దృశ్యత' (6–3–137) ఇతి పూర్వపదస్య దీర్ఘః। సహేః సాడః సః (9–3–56) ఇతి సాడభూతస్య సహేః షత్వవిధానాద్ ద్వితీయాయాం షత్వం నాస్తి

5. శ్లో॥ తమభ్యమనన్దత్ ప్రణతం లవణాన్తకమగ్రజః ।
కాలనేమివధాత్ **ప్రీతస్తురాషాడివ** శార్ఙ్గిణమ్॥ర.వం. 15–40

'కాలనేమి' అను రాక్షసుని సంహరించి వచ్చిన ఉపేంద్రుని, ఇంద్రుడెంత మెచ్చుకొనెనో అంతగా లవణుని చంపి వచ్చిన శత్రుఘ్నుని మెచ్చుకొని సంతసించెను.

6. శ్లో॥ **తురాషాడపి** తచ్ఛ్రుత్వా క్రోధయుక్తో బభూవ హ।
సేనోద్యోగం తథా చక్రే సాహాయ్యార్థం గురోర్విభుః ॥
దేవీభాగవతే –1–11–63

7. శ్లో॥ ఇంద్రో దుశ్చ్యవనో హరిః సురపతిః సఙ్క్రన్దనో వాసవో
వృత్రారిర్బలసూదనః శతమఖో వృద్ధశ్రవాః కౌశికః ।
జిష్ణుర్వజ్రధరః సహస్రనయనో వాస్తోష్పతిర్గోపతిః
పర్జన్యో మఘవా వృషా హరిహయః ప్రాచీనబర్హిః స్మృతః॥ 52

శ్లో॥ పురుహూతః **పృతనాషాట్** పురందరః పూర్వదిక్పతిః స్వారాట్ ।
ఆఖణ్డల **స్తురాషాట్** సుత్రామా గోత్రభిత్సునాసీరః ॥ 53

శ్లో॥ శక్రః స్యాదుగ్రధన్వా చ హరివాన్పాకశాసనః ।
దివస్పతిర్భిడౌజాశ్చ మరుత్వాన్మేఘవాహనః ॥ 54

అని హలాయుధకోశము 'తురాషాట్'కు 39 నామములందించినది.

ఈ శ్లోకమునకు సాదృశ్యమున్న (రఘువంశము 10-5) శ్లోకమును గాంచుడు.

శ్లో॥ **తస్మిన్నవసరే దేవాః** పౌలస్త్యోపప్లుతా హరిమ్।
**అభిజగ్ము** ర్నిదాఘార్తాః ఛాయావృక్షమివాధ్వగాః ॥

"ఆ పుత్రకామేష్టిని యాజ్ఞికులు ప్రారంభించిన సమయమునందే, పులస్త్యుని వంశజుడగు రావణాసురునిచే పీడింపబడినవారై, వేసవితాపమును భరింపలేక ఆర్తులయిన బాటసారులు, మంచి నీడనిచ్చు చెట్టునాశ్రయించునట్లు, దేవతలు విష్ణువును చేరి శరణుచొచ్చిరి". ఇచట 'అర్థాన్తరన్యాసాలంకార' మున్నది. (1-63) తారకాసురగాథకై మత్స్యపురాణమునందు 146 అధ్యాయమునుండి ఉన్న భాగమును ఇచట అనుసంధానము చేసికొనదగును.

**ఛందస్సు :-** ఈ సర్గయందు శ్లోకములన్నియు (1-63) అనుష్టుభ్‌కు చెందినవి. 64వ శ్లోకము సర్గాంతశ్లోకము - **మాలినీ** వృత్తమునకు చెందినది.

**'అనుష్టుభ్' లక్షణము:-** శ్లో॥ శ్లోకే షష్ఠం గురు జ్ఞేయం సర్వత్ర లఘు పంచమమ్।
ద్విచతుః పాదయోర్హ్రస్వం సప్తమం దీర్ఘమన్యయోః॥

ఇందు ప్రతిపాదమున '8' అక్షరములుండును.

**క్రియాదర్శము:- యయుః** :- యా ప్రాపణే (పొందుట, వెళ్లుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్, ప్రథమపురుషబహువచనమ్.

ప్రథమపురుషరూపాలు :- యయౌ - యయతుః - **యయుః**

శ్లో॥ అపనీతశిరస్త్రాణా శేషాస్తిం శరణం **యయుః** ।
ప్రణిపాతప్రతీకారః సంరంభో హి మహాత్మనామ్ ॥

"....ఆ రఘు మహారాజును శరణుచొచ్చిరి, మహాత్ములు శత్రువుల గర్వమణచుట యందే దృష్టిగలవారు కాని వారు నమ్రులయిన చంపవలెననెడి క్రోధము కలవారు కారు గదా !'

**అలంకారములు:-** ఇట 'అనుప్రాస' చెప్పదగును.

---





**శ్లో ॥ తేషామావిరభూద్బ్రహ్మా
పరిమ్లానముఖశ్రియామ్ ।
సరసాం సుప్తపద్మానాం
ప్రాతర్దీధితిమానివ ॥ 2**

**పదవిభాగము:-** తేషామ్, ఆవిరభూత్, బ్రహ్మా, పరిమ్లానముఖశ్రియామ్, సరసామ్, సుప్తపద్మానామ్, ప్రాతః, దీధితిమాన్, ఇవ ॥

**అన్వయక్రమము:-** పరిమ్లానముఖశ్రియామ్ తేషామ్ బ్రహ్మా సుప్తపద్మానామ్ సరసామ్ ప్రాతః దీధితిమాన్ ఇవ ఆవిరభూత్.

**ప్రతిపదార్థము:-** పరియ్లాముఖశ్రియామ్ - వాడిన మోముల కళగల, తేషామ్ - ఆ దేవతలకు, బ్రహ్మా - బ్రహ్మదేవుడు, సుప్తపద్మానామ్ - ముకుళించిన పద్మములుగల, సరసామ్ - సరోవరములకు, ప్రాతః - వేకువజామున, దీధితిమాన్ ఇవ - సూర్యుడో యన, ఆవిరభూత్ - ప్రత్యక్షమాయెను.

**తాత్పర్యము:-** వాడిన మోముల కళగల ఆ దేవతలకు బ్రహ్మదేవుడు ముకుళించిన పద్మములు గల సరోవరములకు వేకువజామున సూర్యుడో యన ప్రత్యక్షమాయెను.

**విభక్తులు / క్రియలు :-** 1. పరిమ్లానముఖశ్రియామ్ - ముఖశ్రియః, ముఖశ్రియోః **ముఖశ్రియామ్,** ఈకారాన్తపుంలింగ ముఖశ్రీ శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము, సుశ్రీః శబ్దవత్. 2. తేషామ్ - తస్య, తయోః, **తేషామ్** ; దకారాన్తపుంలింగతచ్ఛబ్దము. షష్ఠీవిభక్తి బహువచనము 3. బ్రహ్మా - **బ్రహ్మా,** బ్రహ్మాణౌ, బ్రహ్మాణః, నకారాన్త పుంలింగ బ్రహ్మన్‌శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 4. సుప్తపద్మానామ్ - సుప్తపద్మస్య, సుప్తపద్మయోః, **సుప్తపద్మానామ్,** అకారాన్త నపుంసకలింగ సుప్తపద్మశబ్దము. షష్ఠీ విభక్తి బహువచనము. 5. సరసామ్ - సరసః, సరసోః, **సరసామ్;** సకారాన్త నపుంసకలింగసరశ్శబ్దము. షష్ఠీవిభక్తి బహువచనము. 6. ప్రాతః - అవ్యయము 7. దీధితమాన్ - దీధితిమాన్, దీధితిమన్తౌ, దీధితిమన్తః తకారాన్తపుంలింగ దీధితిమత్ శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము (దీధితిః అస్మిన్ అస్తి - దీధితి+మత్ - దీధితిమాన్) 8. ఇవ - అవ్యయము. 9. ఆవిరభూత్ - క్రియః

**సమాసాలు:-**

1. పరిమ్లానముఖశ్రియామ్ - ముఖస్య శ్రీః (ష.త.) ముఖశ్రీః, పరిమ్లానా ముఖశ్రీః యేషామ్ (బహువ్రీహి) తే, తేషామ్.
2. సుప్తపద్మానామ్ - సుప్తాని పద్మాని యేషు (బహువ్రీహి) తాని సుప్తపద్మాని, తేషామ్.

**సంధులు:-**

1. ఆవిరభూత్ + బ్రహ్మా - ఆవిరభూద్బ్రహ్మా- జశ్త్వసన్ధిః, **ఝలాం జశోఽన్తే**
2. ప్రాతః+దీధితిమాన్ - ప్రాతర్దీధితిమాన్ - విసర్గసన్ధిః
3. ఆవిః+ అభూత్ - ఆవిరభూత్ - విసర్గసన్ధిః

**పదవ్యుత్పత్తి - నిఘంటు ప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. బ్రహ్మా** 1. నకారాన్త పుంలింగ 'బ్రహ్మన్' శబ్దః (బ్రహ్మా)

ప్రథమావిభక్తి రూపాలు :- బ్రహ్మా - బ్రహ్మాణౌ - బ్రహ్మాణః -కర్తా

2. బ్రహ్మా - 'వృహి వృద్ధౌ' ఇత్యస్మాత్ సర్వధాతుభ్యో మనిన్ ఇత్యుణాది - సూత్రేణ మనిని 'వృహేర్నోచ్చ' ఇతి ఇదిత్వాన్నుమా నిష్పన్నస్య నకారస్య అకారో ఋకారస్య యణాదేశే బ్రహ్మన్‌శబ్దః। 'బ్రహ్మ తత్వం తపో దేవో బ్రహ్మా విప్రః ప్రజాపతిః ఇత్యమరః ।
3. ఇది 'కుమారసమ్భవమహాకావ్యము' ఇట రఘువంశమునందలి (5-36) శ్లోకమును ముచ్చటించుకొనుట కడు రమణీయముగ నుండును.

శ్లో॥ బ్రాహ్మే ముహూర్తే కిల తస్య దేవీ
**కుమార** కల్పం సుషవే **కుమారమ్** ।
అతః పితా **బ్రహ్మణ** ఏవ నామ్నా
తమాత్మజన్మానమజం చకార ॥

"బ్రహ్మ ముహూర్తము (అనగా అజమనుపేరుగల యరుణోదయకాలమునందు) రఘుమహారాజుయొక్క పట్టపుభార్య **కుమారస్వామిని** బోలిన కుమారుని గనెను. అందువలన తండ్రియైన రఘుమహారాజు **బ్రహ్మ**యొక్క పేరైన **అజు**డనెడి నామధేయమును అతనికి బెట్టెను. - వావిళ్ల 'రఘువంశమహాకావ్యే'

4. బ్రహ్మన్పుంసి చ। అయం బ్రహ్మా। ఇదం బ్రహ్మ-లింగానుశాసన ప్రకరణమ్.
5. శ్లో॥ ద్రుహిణో విరిఞ్చిర్ద్రుఘణో విరిఞ్చః
పరమేష్ఠ్యజోఽష్టశ్రవణః స్వయంభూః ।
కమనః కవిః సాత్త్వికవేదగర్భౌ స్థవిరః
శతానందపితామహౌ కః॥ 125

శ్లో॥ ధాతా విధాతా విధివేధసౌ ధ్రువః పురాణగో హంసగవిశ్వరేతసౌ ।
ప్రజాపతిర్బ్రహ్మా చతుర్ముఖౌ భవాన్తకృజ్జగత్కర్తృసరోరుహాసనౌ॥126





శ్లో॥ శమ్భుః శతధృతిః స్రష్టా సురజ్యేష్ఠో విరిఞ్చినః।
హిరణ్యగర్భో లోకేశో నాభిపద్మాత్మభూరపి ॥ 127
శేషశ్చాత్ర - బ్రహ్మా తు క్షేత్రజ్ఞః పురుషః సనత్ ।

అని 'బ్రహ్మ' నకు 40 నామములను 'అభిధానచిన్తామణి' పేర్కొన్నది.

**క్రియాదర్శము:- ఆవిరభూత్,** అభూత్ - భూ సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, **భూతే లుఙ్** ప్రథమపురుషైకవచనమ్.

ప్రథమపురుష రూపాలు :- **ఆవిరభూత్,** ఆవిరభూతామ్, ఆవిరభూవన్, ఆవిరభూత్ - ప్రకాశోఽభూత్ ఇత్యర్థః । "ప్రకాశే ప్రాదురావిః స్యాత్" ఇత్యమరః।

**అలంకారములు:-** 'ఇట' ఉపమాలంకార'మున్నదని చెప్పదగును. వాడిన మోములు కళగల దేవతలకు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమగుటను ముకుళించిన పద్మములు గల సరోవరములకు వేకువజామున సూర్యుడో యనునట్లు వర్ణింపబడుటచే నిది ' ఉపమాలంకార'మని చెప్పదగును.

**లక్షణము:-** "స్వతస్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః ।
సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకదోపమా ॥"

సూర్యోపమానము దేవతాముఖవికాసము కలిగినదని సూచించడమైనది.

---

**శ్లో ॥ అథ సర్వస్య ధాతారం తే**
**సర్వే సర్వతోముఖమ్।**
**వాగీశం వాగ్భిరర్థ్యాభిః**
**ప్రణిపత్యోపతస్థిరే ॥** 3

**పదవిభాగము:-** అథ, సర్వస్య, ధాతారమ్, తే, సర్వే, సర్వతోముఖమ్, వాగీశమ్, వాగ్భిః, అర్థ్యాభిః, ప్రణిపత్య, ఉపతస్థిరే ।

**అన్వయక్రమము :-** అథ సర్వే తే సర్వతోముఖం వాగీశం సర్వస్య ధాతారమ్ ప్రణిపత్య అర్థ్యాభిః వాగ్భిః ఉపతస్థిరే ।

**ప్రతిపదార్థము :-** అథ - (దేవతల యెదుట బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైన) పిమ్మట, సర్వే - ఆ(దేవతలు) అందఱు, సర్వతోముఖమ్- నాలుగుదిశలయందును మోములు గలవాడును, వాగీశమ్ - విద్యలకు దొరయును, సర్వస్య - ఎల్లలోకములకు,

ధాతారమ్ – స్రష్టను, (బ్రహ్మదేవుని) గూర్చి, ప్రణిపత్య – నమస్కరించి, అర్థ్యాభిః – అర్థయుక్తములు అగు, వాగ్భిః – పలుకులతో, ఉపతస్థిరే – స్తుతించిరి.

**తాత్పర్యము:–** పిమ్మట, ఆ దేవతలందఱు, నాలుగుదిశలయందును మోములు గలవాడును, విద్యలకు దొరయును, ఎల్లలోకములకు స్రష్టయును అగు బ్రహ్మదేవుని గూర్చి నమస్కరించి, అర్థయుక్తములగు పలుకులతో స్తుతించిరి.

**విభక్తులు / క్రియలు :–** 1. అథ – అవ్యయము, 2. తే – సః, తౌ, **తే**; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్రథమావిభక్తి బహువచనము, 3. సర్వే – సర్వః, సర్వౌ, **సర్వే** ; అకారాన్త పుంలింగ సర్వశబ్దము, 4. సర్వతోముఖమ్ – **సర్వతోముఖమ్,** సర్వతోముఖౌ, సర్వతోముఖాన్, అకారాన్త పుంలింగ సర్వతోముఖ శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 5. వాగీశమ్ – **వాగీశమ్** , వాగీశౌ, వాగీశాన్ ; అకారాన్త పుంలింగ వాగీశశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము 6. సర్వస్య – సర్వస్య, సర్వయోః, సర్వేషామ్, అకారాన్త పుంలింగ సర్వశబ్దము షష్ఠీవిభక్తి ఏకవచనము. 7. ధాతారమ్ – **ధాతారమ్,** ధాతారౌ, ధాతౄన్; అకారాన్త పుంలింగ ధాతృ శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 8. ప్రణిపత్య – (ప్ర+ని+పత్+ క్త్వా) ల్యబన్తము – అవ్యయము. 9. అర్థ్యాభిః – అర్థ్యయా, అర్థ్యాభ్యామ్, **అర్థ్యాభిః;** ఆకారాన్త స్త్రీలింగ అర్థ్యా శబ్దము. తృతీయావిభక్తి బహువచనము. 10. వాగ్భిః – వాచా, వాగ్భ్యామ్, వాగ్భిః ; చకారాన్త స్త్రీలింగ 'వాచ్' శబ్దము. తృతీయావిభక్తి బహువచనము. 11. ఉపతస్థిరే – ఉప+స్థా, లిట్, ప్రథమపురుషబహువచనమ్.

**సమాసాలు:–**

1. సర్వతోముఖమ్ – సర్వతః ముఖాని యస్య (బహువ్రీహి) సః, తమ్.
2. వాగీశమ్ – వాచామ్ ఈశః (ష.త.) తమ్.

**సంధులు :–** 1. ప్రణిపత్య + ఉపతస్థిరే – ప్రణిపత్యోపతస్థిరే – గుణసన్ధిః, **ఆద్గుణః**

**పదవ్యుత్పత్తి – నిఘంటువులు :– కావ్యప్రయోగాలు :**

1. **అర్థ్యాభిః –** 1. 'ధర్మపథ్యర్థన్యాయాదనపేతే' (సూ. 4–4. 92) ఇతి యత్ప్రత్యయః
ధర్మాదనపేతం ధర్మ్యమ్, పథ్యమ్, అర్థ్యమ్, న్యాయ్యమ్ ।
2. శ్లో॥ పరికల్పితసాన్నిధ్యా కాలే కాలే చ వన్దిషు ।
స్తుత్యం స్తుతిభి **రర్థ్యాభిరుపతస్థే** సరస్వతీ॥ రఘువంశమ్ 4–6

"సరస్వతీదేవి కూడా సమయమునెఱిగి సందర్భోచితముగ వందిమాగధుల నాలుకలయందు నిలిచి, ఆ రఘుమహారాజును **సార్థకమైన** స్తోత్రములతో సేవించినది"

**క్రియాదర్శము :–** ఎ) ఉపతస్థిరే – 'ఉపాద్దేవపూజా సంగతికరణ మిత్రకరణ పథిష్వితి వక్తవ్యమ్' ఇత్యాత్మనేపదమ్





బి) ష్ఠా (స్థా) గతినివృత్తౌ (నిలుచుట) భ్వాదిప్రకరణమ్, అనిట్ కర్తరిభూతే లిట్, ప్రథమపురుషరూపాలు; **ఉపతస్థే** – ఉపతస్థాతే – **ఉపతస్థిరే.**

సి) ఈ శ్లోకవ్యాఖ్యాన భాగములో 1.బి చూడగలరు.

**అలంకారములు:–** ఇట 'అనుప్రాస' చెప్పదగును.

---

**అవతారికా:–** ద్వాదశభిః శ్లోకైః స్తువన్తి–12 శ్లోకములచే (బ్రహ్మను) స్తుతించు చున్నారు.

**శ్లో॥ నమస్త్రిమూర్తయే తుభ్యం**
**ప్రాక్సృష్టేః కేవలాత్మనే ।**
**గుణత్రయవిభాగాయ**
**పశ్చాద్భేదముపేయుషే ॥ 4**

**పదవిభాగము:–** నమః త్రిమూర్తయే, తుభ్యమ్, ప్రాక్, సృష్టేః, కేవలాత్మనే, గుణత్రయవిభాగాయ, పశ్చాత్, భేదమ్, ఉపేయుషే ।

**అన్వయక్రమము:–** (హే భగవన్) సృష్టేః ప్రాక్ కేవలాత్మనే పశ్చాత్ గుణత్రయ విభాగాయ భేదమ్ ఉపేయుషే త్రిమూర్తయే తుభ్యం నమః ।

**ప్రతిపదార్థము:–** (హే భగవన్ – ఓ దేవదేవా ! ఓ బ్రహ్మదేవా !), సృష్టేః – సృష్టికి ప్రాక్ – పూర్వము, కేవలాత్మనే– ఒకే స్వరూపము గల వాడవును, పశ్చాత్ – తరువాత, గుణత్రయవిభాగాయ – గుణత్రయమనెడు భేదకారణము కలవాడవై, భేదమ్ – సృష్ట్యాద్యుపాధిని, ఉపేయుషే – పొందినవాడవును, త్రిమూర్తయే – బ్రాహ్మీశక్తిస్వరూపుడవగు, తుభ్యమ్ – నీ కొఱకు, నమః – ప్రణామము.

**తాత్పర్యము :–** (ఓ బ్రహ్మదేవా!) సృష్టికి పూర్వము ఒకే స్వరూపముగలవాడవును, సృష్టికి పిదప గుణత్రయమనెడు భేదకారణము కలవాడవై సృష్ట్యాద్యుపాధిని పొందినవాడవును, బ్రాహ్మీశక్తి స్వరూపుడవగు నీకు ప్రణామము.

**విభక్తులు / క్రియలు:–** 1. సృష్టేః – **సృష్టేః,** సృష్ట్యోః, సృష్టీనామ్; ఇకారాన్త స్త్రీలింగ సృష్టిశబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2. ప్రాక్, పశ్చాత్ – అవ్యయాలు. 3. కేవలాత్మనే – **కేవలాత్మనే,** కేవలాత్మభ్యామ్, కేవలాత్మభ్యః, నకారాన్త పుంలింగ కేవలాత్మన్ శబ్దము. చతుర్థీవిభక్తి ఏకవచనము. 4. గుణత్రయవిభాగాయ – **విభాగాయ,** విభాగాభ్యామ్, విభాగేభ్యః, అకారాన్త పుంలింగ విభాగ శబ్దము

చతుర్థీవిభక్తి ఏకవచనము. 5. భేదమ్ – **భేదమ్,** భేదౌ, భేదాన్; అకారాన్త పుంలింగ భేదశబ్దము ; ద్వితీయావిభక్తి ఏకవచనము. 6. ఉపేయుషే – **ఉపేయుషే,** ఉపేయివద్భ్యామ్, ఉపేయివద్భ్యః సకారాన్త పుంలింగ ఉపేయివచ్ఛబ్దము చతుర్థీవిభక్తి ఏకవచనము. 7. త్రిమూర్తయే – **త్రిమూర్తయే,** త్రిమూర్తిభ్యామ్, త్రిమూర్తిభ్యః ; **ఇకారాన్త పుంలింగ త్రిమూర్తి శబ్దము** చతుర్థీవిభక్తి ఏకవచనము. 8. తుభ్యమ్ – **తుభ్యమ్ / తే ,** యువాభ్యామ్ /వామ్, యుష్మభ్యమ్ / వః ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, చతుర్థీవిభక్తి ఏకవచనము. 9. నమః – అవ్యయము / నామవాచకము. సకారాన్త నపుంసకలింగ నమశ్శబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము . నమః, నమసీ, నమాంసి.

+ యత్ర పుంలింగ శబ్దప్రయోగస్తత్ర విష్ణుర్విశేష్యః, యత్ర స్త్రీ లింగశబ్దస్తత్రదేవతా విశేష్యతే, యత్ర నపుంసకలిఙ్గ శబ్దస్తత్ర బ్రహ్మేతి విశేష్యతే । బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్ (ముం.ఉ.2-2-11). ఈ సమస్త జగత్తు బ్రహ్మయే. భగవన్నామములతో పుంలింగ శబ్ద ప్రయోగమున్న స్థలమున విష్ణువు విశేష్యము, స్త్రీలింగ శబ్దము ప్రయుక్తమయినపుడు దేవత విశేష్యము, నపుంసకలింగశబ్దము ప్రయుక్తమయినపుడు బ్రహ్మ విశేష్యము అని గ్రహింపవలెను. – శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రమ్ – శఙ్కరభాష్యమ్.

**సమాసాలు :–**

1. కేవలాత్మనే – కేవలః ఆత్మా యస్య (బహువ్రీహి) సః, తస్మై.
2. గుణత్రయమ్ – గుణానాం త్రయమ్ (ష.త) గుణత్రయమ్,
3. త్రిమూర్తయే– తిస్రః మూర్తయః యస్య (బహువ్రీహి) సః, త్రిమూర్తిః, తస్మై

**సంధులు:–** 1. పశ్చాత్+భేదమ్ – పశ్చాద్భేదమ్ – జశ్త్వసంధిః

**పాఠాంతరాలు :–** 1. నమస్త్రిమూర్తయే – నమోస్త్వమూర్తయే

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు :**

**1. నమః** ఎ) నమః– స్వస్తి – స్వాహా– స్వధాలం – వషడ్యోగాచ్చ (సూ. 2-3-16) "ఏభిర్యోగే చతుర్థీ. హరయే నమః, ప్రజాభ్యః స్వస్తి. అగ్నయే స్వాహా.

పితృభ్యః స్వధా. అలమితి పర్యాప్త్యర్థగ్రహణమ్, తేన దైత్యేభ్యో హరిరలం, ప్రభుః సమర్థః, శక్తః " ఇత్యాది. (ఇంద్రాయ వషట్). **నమః, స్వస్తి, స్వాహా, స్వధా, అలం, వషట్ అనుపదములతో సంబంధమున్నప్పుడు వాటితో సంబంధించిన శబ్దమునకు చతుర్థి వచ్చును.** హరయే నమః – విష్ణువునకు నమస్కారము. 'నమః' అనుదానితో సంబంధించిన హరిశబ్దమునకు చతుర్థివచ్చినది. ఇట్లే మిగిలినవి.

'ప్రజాభ్యః స్వస్తి'– ప్రజలకు క్షేమమగుగాక. 'అగ్నయే స్వాహా' – అగ్నికి సమర్పించుచున్నాను. 'పితృభ్యః స్వధా' – పితృదేవతలకు సమర్పించుచున్నాను.



దేవతలకు సమర్పించునపుడు 'స్వాహా' పదము; పితృదేవతలకు సమర్పించునపుడు 'స్వధా' పదము ప్రయోగించబడును. 'దైత్యేభ్యో హరిరలమ్' – హరి దైత్యులకు చాలును.

ఇంద్రాయ వషట్ – ఇంద్రునికొఱకు హవిస్సును సమర్పించుచున్నాను.

బి) ఉపపదవిభక్తి కంటె కారకవిభక్తి బలీయమైనది. ఉదా : నమస్కరోతి దేవాన్. ఇచట క్రియాపద ప్రయోగముండుటచే క్రియాజన్య ఫలాశ్రయమైనది కర్మయగును. ఇందు కర్మవాచక 'దేవ' శబ్దమునకు ద్వితీయవచ్చును. ఇది కారకవిభక్తి. నమః శబ్ద ప్రయోగముచే వచ్చు 'నమః దేవేభ్యః' చతుర్థి ఉపపద విభక్తి . ఇచట ఉపపద విభక్తిని బాధించి కారక విభక్తియే వచ్చును. – సంస్కృత వ్యాకరణము

సి) 'నమస్' – (చా.సా), అవ్యయకోశము (457)

1. నమనమస్కార్థః। 'నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై ।
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః ॥
రామాయణమ్ – సుం.కా. 13-59

అత్ర 'నమః స్వస్తి....' (2-3-16) ఇతి చతుర్థీ ।

'నారాయణం నమస్కృత్య' ఇత్యాదిషు తు కృధాతోరేవ నమనమర్థః । నమశ్శబ్దస్తు తదర్థద్యోతకః ; తేన ద్వితీయేతి బోధ్యమ్. 'విష్ణవే దీపో నమః । దీపం నివేదయామిత్యర్థః । ఇతి **తిలకః ।** విస్తరస్తు శబ్దశక్తి – ప్రకాశికాయాం ద్రష్టవ్యః। అస్య సాక్షాత్ ప్రభృతి త్వాత్ కృఞో యోగే గతి సంజ్ఞాయాం సమాసే, ల్యపి నమస్కృత్య ఇతి సిద్ధ్యతి. 'నమస్పురసోర్గత్యోః' (8-3-40) ఇతి విసర్గస్య సకారః

"ప్రణామం యేఽపి కుర్వన్తి తేషామపి నమో నమః ।" భారత –శాన్తి 46-136. ఇత్యాదిషు ఆర్షత్వాత్ షష్ఠీతి జ్ఞేయమ్. అత్ర ఇదమవధేయమ్– 'యః సమిధా య ఆహుతీ యో వేదేన దదాశ మర్తో అగ్రయే యో **నమసా స్వధ్వరః'** (ఋక్. 8-1-95) ;'విధేమ చాస్మై **నమసా సహ** త్వయా –' భాగవతే (3-4-18) ఇత్యాది ప్రయోగదర్శనాత్ నమశ్శబ్దః క్లీబలింగేఽపి వర్తతే। అత ఏవ **'నమాంసి** భూయాంసి' ; **'నమసా** యోఽకరోద్ దేవే స సధ్వర ఇతీరితః' (అహిర్బుధ్న్యసంహితా 37-37) ఇత్యాది ప్రయోగాః సంగతాః । అర్థశ్చ తుల్యః । ఇతి । అత ఏవ 'మన్త్ర బ్రహ్మణి మధ్యమేన **నమసా'** ఇత్యష్టశ్లోక్యాం పరాశరభట్టారకైరపి ప్రయుక్తమ్ ।

త్యాగరుతయోః (ఉణాదికోశః), అన్నే వజ్రేచ ( నిఘంటుః 2-7,29) 'ఏనా వో అగ్రిం నమసోర్జో నపాతమ్ ఆహువే' (ఋక్ 7-16-1) ఇత్యత్ర స్తోత్రే ఇతి శబ్దకల్పద్రుమః ।

డి) 'రుద్రసూక్తము' ఇట అనుసంధానము చేసికొనదగును.

**2) కేవలాత్మనే -** ఎ) కేవల, కేవలత్వం, కేవలరూప.

1. కేవల - 'కేవల ఆప్తకాయః...' శ్వే. 1-11
 'శివ ఏవ కేవలః...' 4.18
 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ...' 6.11
 'విమలః కేవలః ప్రభుః...' నాద -20
 'ఆకాశవత్ సూక్ష్మః కేవలః...' సర్వో - 4
 'స జీవః కేవలః శివః...' స్కన్ద - 6
 'శరీరం కేవలం కర్మ...' భగవద్గీత 4.21
 'కేవలైరిన్ద్రియైరపి...' భగవద్గీత 5.10
 'కర్తారమాత్మానం కేవలం...' భగవద్గీత 18.16
2. కేవలత్వ - 'కేవలత్వం లభతా ఇతి...' - మైత్రి 6.21
3. కేవలరూప - 'స్వయం కేవలరూపతః...' - ముక్తి 2.64

బి) ఆత్మన్ - 1. ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ ....ఐత 1.1
2. ఆత్మా భూతస్య భూతస్య త్వమాత్మాసి...కౌషి. 1.6
3. ఆత్మా దేవానాం జనితా ప్రజానామ్... చాం. 4.3.7
4. ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః...బృ 4.5.6
5. యోగ ఆత్మా... తై 2-4.1
6. యథాధర్మే తథాత్మని... కఠో 6.5

**ప్రస్థానత్రయము** ఇట అనుసంధానము చేసికొనదగును.

3) **ఉపేయుషే -** 'ఉపేయివాననాశ్వాననూచానశ్చ' (3-2-109)

ఏతే నిపాత్యన్తే ఉపపూర్వాదిణే భాషాయామపి భూతమాత్రే లిడ్వా ।

తస్య నిత్యం క్వసుః । **ఉపేయివాన్** । 'ఉపేయుషః స్వామపి మూర్తిమగ్ర్యమ్' । ఉపేయుషీ । ఉపేత్యవివక్షితమ్ ।**ఈయివాన్** । సమీయివాన్ । నఞ్పూర్వాదశ్నాతేః క్వసురిడభావశ్చ । 'ధృతజయధృతేరనాశుషః' ఇతి అనుపూర్వాద్వచేః కర్తరి కానచ్ వేదస్యానువచనం కృతవాననూచానః ।





శ్లో॥ నివృత్తే భరతే ధీమానత్రే రామస్తపోవనమ్।
ప్రపేదే పూజితస్తస్మిన్ దణ్డకారణ్యమీయివాన్ ॥ భట్టికావ్యే 4-1

ఈయివాన్ ప్రాప్తః । ఉపేయివానితి క్వస్వన్తనిపాతనే ఉపోపసర్గాభ్యాస - స్యాతన్త్రత్వాత్ అన్యోపసృష్టోఽ నుపసృష్టో వా సాధురేవ.- పాణినిసూత్రవ్యాఖ్యా

**అలంకారములు :-** ఇట 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును. సృష్టికి పూర్వము కేవలుడు, పిదప గుణత్రయభేద(సత్త్వ - రజః - తమః) కారణుడవై సృష్ట్యాద్యుపాధిని (బ్రహ్మ - విష్ణువు - శివ) పొందినవాడవు అని సాభిప్రాయవిశేషణములతో బ్రహ్మదేవుడు వర్ణింపబడుటచే నిట 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును.

**లక్షణము:- విశేషణైర్యత్సాకూతైరుక్తిః పరికరస్తు సః ।**
అభిప్రాయగర్భితాలైన విశేషణాలను ఉపయోగించి విశేష్యముతో ఒకవిధమైన వైశిష్ట్యాన్ని సూచించుట పరికరాలంకారము.

---

**శ్లో॥ యదమోఘమపామన్త -**
**రుప్తం బీజమజ ! త్వయా ।**
**అతశ్చరాచరం విశ్వం**
**ప్రభవస్తస్య గీయసే ॥ 5**

**పదవిభాగము :-** యత్, అమోఘమ్, అపామ్, అన్తః, ఉప్తమ్, బీజమ్, అజ! త్వయా, అతః, చరాచరమ్, విశ్వమ్, ప్రభవః, తస్య, గీయసే ।

**అన్వయక్రమము:-** హే అజ! త్వయా అపామ్ అన్తః యత్ అమోఘమ్ బీజమ్ ఉప్తమ్ అతః చరాచరం విశ్వం తస్య ప్రభవః గీయసే ।

**ప్రతిపదార్థము:-** హే అజ! - ఓ పుట్టుకలేనివాడా !, త్వయా - నీ చేత, అపామ్ - నీళ్లయొక్క, అన్తః - లోపల, యత్ - ఏ, అమోఘమ్ - సార్థకమగు, బీజమ్ - విత్తనము, ఉప్తమ్ - వేయబడినదో, అతః - ఆ విత్తనమునుండి, చరాచరమ్ - జంగమస్థావరాత్మకమగు, విశ్వమ్ - ప్రపంచము, (జాతమ్ = ఉద్భవించినది), తస్య - ఆ ప్రపంచమునకు, ప్రభవః - కారణమైనవాడవుగా, గీయసే - కొనియాడబడుచున్నావు.

**తాత్పర్యము :–** ఓ పుట్టువులేనివాడా! నీచేత నీళ్లలోపల ఏ సార్థకమగు విత్తనము వేయబడినదో, దాని నుండి జంగమస్థావరాత్మకమగు ప్రపంచము (ఉద్భవించినది) ఆ ప్రపంచమునకు కారణమైనవాడవుగా కొనియాడబడుచున్నావు.

**విభక్తులు / క్రియలు:–** 1. అజ – హే **అజ,** హే అజౌ, హే అజాః! – అకారాన్త పుంలింగ అజశబ్దము. సంబోధన ప్రథమావిభక్తి ఏకవచనము. 2. త్వయా – **త్వయా,** యువాభ్యామ్, యుష్మాభిః ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 3. అపామ్ – 'పాన్తః స్త్రీలింగః 'అప్' శబ్దో నిత్యం బహువచనాంతః', ప్రథమావిభక్తి – ఆపః ; పంచమీ విభక్తి – అద్భ్యః, ద్వితీయా విభక్తి – అపః ; షష్ఠీవిభక్తి – **అపామ్,** తృతీయా విభక్తి – అద్భిః ; సప్తమీ విభక్తి – అప్సు, చతుర్థీవిభక్తి – అద్భ్యః ; సంబోధన ప్ర.వి – హే ఆపః ! **ఆపః** – 'ఆప్నోతేర్హ్రస్వశ్చ' ఇత్యుణాదిసూత్రేణ హ్రస్వః చకారాత్, క్విపి 'అప్' శబ్దః । తస్మాజ్జసి 'అప్తృన్ని'తి దీర్ఘే రుత్వవిసర్గౌ।, అద్భిః – 'అపో భి' ఇతి పకారస్య తకారో జశ్త్వమ్. 4. అన్తః – **అన్తః,** అన్తౌ, అన్తాః – అకారాన్త పుంలింగ అన్తశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 5. యత్ – **యత్,** యే, యాని, – దకారాన్త నపుంసకలింగ యచ్ఛబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 6. అమోఘమ్ – **అమోఘమ్**, అమోఘే, అమోఘాని ; అకారాన్త నపుంసకలింగ అమోఘశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము, 7. బీజమ్ – **బీజమ్** , బీజే, బీజాని ; అకారాన్త నపుంసకలింగ బీజశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము, 8. ఉప్తమ్ – **ఉప్తమ్,** ఉప్తే, ఉప్తాని ; అకారాన్త నపుంసకలింగ ఉప్తశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9. అతః – అవ్యయము, 10. చరాచరమ్ – **చరాచరమ్,** చరాచరే, చరాచరాణి; అకారాన్త నపుంసకలింగ చరాచరశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము 11. విశ్వమ్ – **విశ్వమ్,** విశ్వే, విశ్వాని ; అకారాన్త నపుంసకలింగ విశ్వశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 12. తస్య – **తస్య,** తయోః, తేషామ్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము, 13. ప్రభవః – ప్రభవః, ప్రభవౌ, ప్రభవాః అకారాన్త పుంలింగ ప్రభవ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము 14. గీయసే – క్రియ (గై (కర్మణి) + య+ లట్ +) మధ్యమపురుషైకవచనమ్.

**సమాసాలు:–**

1. అమోఘమ్–న మోఘః (నఞ్తత్పురుష ) అమోఘః, తత్.
2. చరాచరమ్–చరాశ్చ అచరాశ్చ తేషాం సమాహారః (సమాహారద్వంద్వ) చరాచరమ్ తత్

**సంధులు :–**

1. అన్తః + ఉప్తమ్ – అన్తరుప్తమ్ – విసర్గసన్ధిః
2. అతః + చరాచరమ్ – అతశ్చరాచరమ్ – శ్చుత్వసన్ధిః, స్తోః శ్చునాశ్చుః (8–4–39)
3. ప్రభవః + తస్య – ప్రభవస్తస్య – విసర్గసన్ధిః





**పాఠాన్తరాలు :–** 1. **'అత** శ్చరాచరం విశ్వం **ప్రభవస్త స్యగీయసే'** ।– అదశ్చరాచరం విశ్వం **ప్రభావ స్తస్య గీయతే ।**

2. ఉప్తమ్ – ముక్తమ్

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. **ఉప్తం బీజమ్ అమోఘమ్, అపామన్తః** – ఎ) **అత్ర మనుః** (1–8,9)

శ్లో॥ సోఽభిధ్యాయ శరీరాత్ స్వాత్సిసృక్షుర్వివిధాః ప్రజాః ।
ఆప ఏవ ససర్జాదౌ తాసు **బీదమవాసృజత్** ॥ 8

శ్లో॥ తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్ ।
తస్మిన్ జజ్ఞే స్వయం **బ్రహ్మ** సర్వలోకపితామహః ॥ 9

ఆ పరమాత్మ తన శరీరమునుండి వివిధ ప్రాణికోట్లను సృష్టింపదలచి, ముందుగ **జలమును** సృష్టించెను. తరువాత ఆ జలమున మహదాది సృష్టికి కారణభూతమైన తన బీజమును ఉంచెను. ఆ బీజమే పరమాత్మయొక్క ఇచ్ఛాశక్తి ననుసరించి పరిశుద్ధమైన బ్రహ్మాండమయ్యెను. ఆ బ్రహ్మాండమున సమస్తలోకసృష్టికి కారకుడైన బ్రహ్మదేవుడుద్భవించెను.

బి) యతో వా ఇమాని భూతాని జాయంతే । యేన జాతాని జీవన్తి . యత్ప్రయతంత్యభిసంవిశంతి. తద్విజిజ్ఞాసస్వ. తద్బ్రహ్మేతి – **తైత్తిరీయ భృగువల్లి** 'ఏచటనుండి ఈ భూతములు పుట్టునో, పుట్టిన భూతములెల్ల ఏ ఆధారమున జీవించుచున్నావో, మఱియు దేనియందు లయమగునో దానిని తెలిసికొనుము. అదే బ్రహ్మము'.

సి) మత్స్య మహాపురాణమునందు (2–25) గల ఈ శ్లోకభాగాలను ఇచట అనుసంధానము చేసికొనదగును. సృష్టిక్రమము చెప్పబడుచున్నది.

**మత్స్య ఉవాచ –**

శ్లో॥ మహాప్రలయకాలాన్త ఏతదాసీత్ తమోమయమ్ ।
ప్రసుప్తమివ చాతర్క్యప్రజ్ఞాతమలక్షణమ్ ॥ 25

శ్లో॥ అవిజ్ఞేయమవిజ్ఞాతం జగత్ స్థాస్ను చరిష్ణు చ।
తతః **స్వయమ్భూరవ్యక్తః** ప్రభవః పుణ్యకర్మణామ్ ॥ 26

శ్లో॥ వ్యంజయన్నేతదఖిలం ప్రాదురాసీత్ తమోనుదః ।
యోఽతీన్ద్రియః పరో వ్యక్తాదణుర్జ్యాయాన్ సనాతనః ।

శ్లో॥ యః శరీరాదభిధ్యాయ సిసృక్షుర్వివిధం జగత్ ।
**అప** ఏవ ససర్జాదౌ తాసు **బీజ** మవాసృజత్॥ 28

శ్లో॥ తదేవాణ్డం సమభవద్ధేమరూప్యమయం మహత్।
సంవత్సరసహస్రేణ సూర్యాయుతసమప్రభమ్॥ 29

శ్లో॥ ప్రవిశ్యాన్తర్మహాతేజాః స్వయమేవాత్మసమ్భవః।
ప్రభావాదపి తద్వ్యాప్త్యా విష్ణుత్వమగమత్ పునః ॥ 30

శ్లో॥ తదన్తర్భగవానేష సూర్యః సమభవత్ పూరా ।
ఆదిత్యశ్చాదిభూతత్వాద్ **బ్రహ్మా** బ్రహ్మ పఠన్నభూత్ ॥ 31

శ్లో॥ దివం భూమిం సమకరోత్ తదణ్డశకలద్వయమ్ ।
స చాకరోద్దిశః సర్వా మధ్యే వ్యోమ చ శాశ్వతమ్ ॥ 32

శ్లో॥ **జరాయుర్మేరు**ముఖ్యాశ్చ శైలాస్తస్యాభవంస్తదా ।
యదుల్బం తదభూన్మేఘస్తడిత్సఙ్ఘాతమణ్డలమ్ ॥ 33

శ్లో॥ సద్యోఽఉణ్డనామ్నః సమ్భూతాః పితరో మనవస్తథా ।

**క్రియాదర్శము :- గీయసే** –గై – శబ్దే (శబ్దించుట), భ్వాదిప్రకరణమ్, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. ఇది కర్మణి ప్రయోగము. లట్.
మధ్యమపురుషరూపాలు :- **గీయసే** – గీయేథే – గీయధ్వే

---

**శ్లో॥ తిసృభిస్త్వమవస్థాభి–**
**ర్మహిమానముదీరయన్ ।**
**ప్రళయస్థితిసర్గాణా–**
**మేకః కారణతాం గతః ॥ 6**

**పదవిభాగము:-** తిసృభిః, త్వమ్, అవస్థాభిః, మహిమానమ్, ఉదీరయన్, ప్రళయస్థితిసర్గాణామ్, ఏకః, కారణతామ్, గతః ।

**అన్వయక్రమము:-** ఏకః త్వం తిసృభిః అవస్థాభిః మహిమానమ్ ఉదీరయన్ ప్రళయస్థితిసర్గాణామ్ కారణతాం గతః ।

**ప్రతిపదార్థము:-** ఏకః – ఒక్కడవే యై యున్న, త్వమ్ – నీవు, తిసృభిః – మూడగు, అవస్థాభిః – దశలచేత, మహిమానమ్ – (నీ) సామర్థ్యమును, ఉదీరయన్





– ప్రకటించుచు, ప్రళయస్థితిసర్గాణామ్ – లయమునకును, రక్షణమునకును, సృష్టికిని, కారణతామ్ – హేతుత్వమును, గతః – పొందినవాడవై (అసి= ఉన్నావు)

**తాత్పర్యము:-** (ఓ బ్రహ్మదేవా !) ఒక్కడవేయైయుయున్న నీవు మూడగు సత్త్వరజస్తమోమయములగు హరివిధిహరులను అవస్థలచే (నీ) సామర్థ్యమును ప్రకటించుచు సృష్టి స్థితి సంహారములకు హేతుత్వమును పొందినవాడవైతివి.

**విభక్తులు / క్రియలు :-** 1. (ఏకః– **ఏకః**; ఏకౌ, ఏకే; అకారాన్త పుంలింగ ఏకశబ్దము) ప్రథమా విభక్తి ఏకవచనము. ఏకః నిత్యఏకవచనము – ఒక్కడు అనునర్థములో 2. త్వమ్ – **త్వమ్,** యువామ్, యూయమ్; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 3. తిసృభిః – తిస్రా, తిసృభ్యామ్, **తిసృభిః;** ఋకారాన్త స్త్రీలింగతిసృశబ్దము – తృతీయావిభక్తి బహువచనము. 4. అవస్థాభిః – అవస్థయా, అవస్థాభ్యామ్, **అవస్థాభిః** ; ఆకారాన్త స్త్రీలింగ అవస్థాశబ్దము. తృతీయావిభక్తి బహువచనము. 5. మహిమానమ్ – **మహిమానమ్**, మహిమానౌ, మహిమానః ; నకారాన్త పుంలింగమహిమన్ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 6. ఉదీరయన్ – ఉదీరయన్, ఉదీరయన్తౌ, ఉదీరయన్తః ; శత్రన్తో 'ఉదీరయత్' హలన్త పుంలింగ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7. ప్రళయస్థితిసర్గాణామ్ – సర్గస్య, సర్గయోః, **సర్గాణామ్,** అకారాన్తపుంలింగ... సర్గశబ్దము. షష్ఠీవిభక్తి బహువచనము. 8. కారణతామ్ – **కారణతామ్,** కారణతే, కారణతాః ; ఆకారాన్త స్త్రీలింగ కారణతాశబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 9. గతః – గతః, గతౌ, గతాః, అకారాన్త పుంలింగ గత శబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :-**

1. ప్రళయస్థితిసర్గాణామ్ – ప్రలయశ్చ స్థితిశ్చ సర్గశ్చ ఇతి ప్రలయస్థితిసర్గాః (ద్వంద్వ) తేషామ్.

**సంధులు:-**

1. తిసృభిః+త్వమ్ – తిసృభిస్త్వమ్ – విసర్గసన్ధిః,
2. అవస్థాభిః+ మహిమానమ్ – అవస్థాభిర్మహిమానమ్ – విసర్గసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

1. ఏకః – 1. ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ । ఐత 1.1
2. ఏకమేవాద్వితీయమ్। ఛాం. 6.2.1
3. స ఏకః పిత్రాణాం జితలోకానామానన్దః । బృహ. 5.5.1
4. ఏకో వా రుద్రో న ద్వితీయాయ తస్థః । శ్వేతా. 3.2

....ప్రస్థానత్రయమును ఇట అనుసంధానము చేసికొనదగును.

5. ఏకో దేవః సర్వభూతేషు గూఢః ।
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ॥ శ్రుతి

---

**అవతారికా :–** భూత సృష్టికర్తృత్వముక్త్వా మిథున సృష్ట్యర్థం మూర్తిమతో బ్రహ్మణో భేదమాహ । భూతసృష్టికర్తృత్వమును ప్రస్తావించి మిథునసృష్టికొఱకే బ్రహ్మమూర్తి యొక్క స్త్రీ పురుష విభాగమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్త్రీపుంసావాత్మభాగౌ తే**
**భిన్నమూర్తేస్సిసృక్షయా ।**
**ప్రసూతిభాజస్సర్గస్య**
**తావేవ పితరౌ స్మృతౌ ॥** 7

**పదవిభాగము :–** స్త్రీపుంసౌ, ఆత్మభాగౌ, తే, భిన్నమూర్తేః, సిసృక్షయా, ప్రసూతిభాజః , సర్గస్య, తౌ, ఏవ, పితరౌ, స్మృతౌ.

**అన్వయక్రమము :–** స్త్రీపుంసౌ సిసృక్షయా భిన్నమూర్తేః తే ఆత్మభాగౌ (స్తః) తౌ ఏవ ప్రసూతిభాజః సర్గస్య పితరౌ స్మృతౌ ।

**ప్రతిపదార్థము :–** స్త్రీపుంసౌ – స్త్రీ పురుషులు, సిసృక్షయా – సృజించు కోరికచే భిన్నమూర్తేః – రెండుగా చేయబడిన, తే – నీయొక్క, ఆత్మభాగౌ(స్తః) – దేహము, యొక్క పాళ్లు, తౌ ఏవ –అవియే, ప్రసూతిభాజః – ఉత్పత్తిని పొందియున్న, సర్గస్య – సృష్టికి, పితరౌ – తల్లిదండ్రులుగా, స్మృతౌ – చెప్పబడినవి.

**తాత్పర్యము :–** స్త్రీ పురుషులు సృజించుకోరికచే రెండుగా చేయబడిన నీ దేహము యొక్క పాళ్లు. అవియే ఉత్పత్తిని పొందియున్న సృష్టికి తల్లిదండ్రులుగా చెప్పబడినవి.

**విభక్తులు / క్రియలు:–** 1. స్త్రీపుంసౌ – స్త్రీపుంసౌ అకారాన్త పుంలింగ స్త్రీ పుంస శబ్దము నిత్య ద్వివచనము ప్రథమావిభక్తి ద్వివచనము. 2. సిసృక్షయా – **సిసృక్షయా,** సిసృక్షాభ్యామ్, సిసృక్షాభిః ; ఆకారాన్త స్త్రీలింగ 'సిసృక్షా' శబ్దము. తృతీయావిభక్తి ఏకవచనము. 3. భిన్నమూర్తేః – **భిన్నమూర్తేః,** భిన్నమూర్త్యోః, భిన్నమూర్తీణామ్, ఇకారాన్త పుంలింగ భిన్నమూర్తిశబ్దము. షష్ఠీవిభక్తి ఏకవచనము. 4. తే – **తవ / తే** , యువయోః / వామ్, యుష్మాకమ్ / వః; దకారాన్త పుంలింగ యుష్మత్ శబ్దము. షష్ఠీవిభక్తి ఏకవచనము. 5. ఆత్మభాగౌ – ఆత్మభాగః, **ఆత్మభాగౌ**, ఆత్మభాగాః ; అకారాన్త పుంలింగ ఆత్మభాగశబ్దము ప్రథమావిభక్తి ద్వివచనము. 6. తౌ – సః, **తౌ, తే;** దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము.





ప్రథమావిభక్తి ద్వివచనము 7. ఏవ – అవ్యయము. 8. ప్రసూతిభాజః **ప్రసూతిభాజః**, ప్రసూతిభాజోః ప్రసూతిభాజామ్, జకారాన్త పుంలింగ ప్రసూతిభాజ్ శబ్దము. షష్ఠీవిభక్తి ఏకవచనము. 9. సర్గస్య – **సర్గస్య**, సర్గయోః, సర్గాణామ్; అకారాన్త పుంలింగ సర్గశబ్దము షష్ఠీవిభక్తి ఏకవచనము. 10. పితరౌ – పితా, **పితరౌ**, పితరః, ఋకారాన్త పుంలింగ పితృశబ్దము ప్రథమావిభక్తి ద్వివచనము. 11. స్మృతౌ – స్మృతః, **స్మృతౌ**, స్మృతాః, అకారాన్త పుంలింగ స్మృతశబ్దము ప్రథమావిభక్తి ద్వివచనము.

**సమాసాలు :–**

1. స్త్రీ పుంసౌ – స్త్రీ చ పుమాన్ చ (ద్వంద్వ) తౌ।
2. భిన్నమూర్తేః – భిన్నా మూర్తి ః యస్య (బహువ్రీహి) సః, తస్య।
3. ఆత్మభాగౌ – ఆత్మానః భాగః (ష.త) ఆత్మభాగః, తౌ।
4. ప్రసూతిభాజః – ప్రసూతిం భజత ఇతి, ప్రసూతిభాక్ (ఉపపదతత్పురుష సమాసము), తస్య ।
5. పితరౌ – మాతా చ పితా చ (ఏకశేషద్వంద్వ) తౌ ।

**సంధులు :–**

1. స్త్రీపుంసౌ + ఆత్మభాగౌ – స్త్రీ పుంసావాత్మభాగౌ – అవాన్తాదేశసన్ధిః
2. భిన్నమూర్తేః + సిసృక్షయా – భిన్నమూర్తే స్సిసృక్షయా – విసర్గసన్ధిః
3. ప్రసూతిభాజః + సర్గస్య – ప్రసూతిభాజస్సర్గస్య – విసర్గసన్ధిః
4. తౌ+ ఏవ – తావేవ – అవాన్తాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటువు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1.స్త్రీ పుంసౌ :–** స్త్రీ చ పుమాన్ చ – స్త్రీ పుంసౌ (ద్వంద్వ సమాసము)

సమాసాన్తప్రకరణమ్:– సమాసములకు చివర చేరు ప్రత్యయమును సమాసాన్తమని పిలుతురు. ఇది పరముగా నుండగా పూర్వపదాంతమునకు ముందున్న అకార ఇకారములు లోపించును. మఱియు 'టి' భాగములైన అన్, ఇన్, అత్ మున్నగునవి లోపించును.

(సూ. 5–4–77) :– అచతుర – విచతుర – సుచతుర – **స్త్రీపుంస** – ధేన్వడుహర్ (ఋ) క్సామ – వాఙ్మనసాక్షి భ్రువ – దారగవో – ర్వష్ఠీవ – పదష్ఠీవ – నక్తన్దివ – రాత్రిన్దివాహర్దివ – సరజస – నిశ్శ్రేయస – పురుషాయుష – ద్వ్యాయుష– త్ర్యాయుషర్ (ఋ)గ్యజుష – జాతోక్ష – మహోక్ష – వృద్ధోక్షోపశున – గోష్ఠశ్వాః ఏతే పంచవింశతిరజన్తా నిపాత్యన్తే.

ఈ సమాసములన్నియు సమాసాన్తములు చేసి నిపతింపబడినవి. 1.అవిద్యమానాని చత్వారి యస్య సః – అచతురః (బహువ్రీహి) 2.విగతానిచత్వారి యస్మాత్ సః – విచతురః । (బహువ్రీహి) 3. శోభనాని చత్వారి యస్య సః – సుచతురః (బహువ్రీహి) 4. స్త్రీ చ పుమాన్ చ – స్త్రీ పుంసౌ (ద్వంద్వ) ఇతి అచ్ ప్రత్యయాన్తో నిపాతః ।

శ్లో॥ **స్త్రీపుంసయో** ర్భావనటౌ మిథో యౌ
పూర్వస్తయో ర్వ్రీడతిరః పటేన ।
చిరాయతే సృష్టయితుం స్వరూపం
పరస్తు తన్నోత్సహతేఽనుమన్తుమ్ ॥ చంపూభారతే 6–61

2) **పితరౌ** – మాతా చ పితా చ – పితరౌ

**ఏకశేషవృత్తి :–** అనేక పదములు సమాసముగ నేర్పడునపుడు ఒక్కొక్కసారి ఒకపదమే శేషించును (మిగులును) దీనిని ఏకశేషవృత్తి అందురు. మాతా చ పితా చ – పితరౌ. ఇచట రెండు పదములు సమసించి ఒకపదమే మిగిలినది. ఇది ద్విపద ద్వంద్వ సమాసమునకు వ్యతిరిక్తము. ఇచట పితృశబ్దము మాతృశబ్దముతో చెప్పబడినది. **పితామాత్రా 1–2–70** సూత్రముచే మాతృ శబ్దము లోపించి పితృశబ్దము శేషించినది. 'యః శిష్యతే స లుప్యమానార్థాభిధాయీ' (శేషించినది లుప్తమైనదాని అర్థమును కూడా తెలుపును) అను నియమమును అనుసరించి శేషించిన పితృశబ్దము మాతృశబ్దమును కూడా బోధించును. అందుచే ఇది ద్వివచనమునందు ప్రయుక్తమైనది.

3) **మనుస్మృతి** 1–32 శ్లోకాన్ని ఇట అనుసంధానము చేసికొనదగును.

శ్లో॥ ద్విధా కృత్వాత్మనో దేహమర్ధేన పురుషోఽభవత్ ।
అర్ధేన నారీ తస్యాం స విరాజమసృజత్ప్రభుః ॥ 32

ఆ బ్రహ్మదేవుడు తన దేహాన్ని రెండుగా విభజించుకొని ఒక భాగమును స్త్రీ స్వరూపంగా, రెండవ భాగమును పురుషుడుగా ఏర్పరచుకొని ఆ స్త్రీయందు విరాట్ సంజ్ఞగల పురుషునికి జన్మనిచ్చాడు.

---



శ్లో॥ **స్వకాలపరిమాణేన**
**వ్యక్తరాత్రిన్దివస్య తే ।**
**యౌ తు స్వప్నావబోధౌ తౌ**
**భూతానాం ప్రలయోదయౌ ॥** **8**

**పదవిభాగము:–** స్వకాలపరిమాణేన, వ్యక్తరాత్రిన్దివస్య, తే, యౌ, తు, స్వప్నావబోధౌ, తౌ, భూతానామ్, ప్రలయోదయౌ (స్తః) ।

**అన్వయక్రమము:–** స్వకాలపరిమాణేన వ్యక్తరాత్రిన్దివస్య తే యౌ తు స్వప్నావబోధౌ తౌ (ఏవ) భూతానామ్ ప్రలయోదయౌ (స్తః) ।

**ప్రతిపదార్థము :–** స్వకాలపరిమాణేన – నీ కాల పరిమాణముచే, వ్యక్తరాత్రిన్దివస్య – విభజించబడిన రాత్రియును పగలును గల, తే – నీకు, యౌ తు – ఏవి, స్వప్నావబోధౌ – నిద్రయు, మెలకవయునో, తౌ (ఏవ) – అవియే, భూతానామ్ – నీ సృష్టికి, ప్రలయోదయౌ – సంహారసృష్టులు, (భవతః) (స్తః) అగుచున్నవి.

**తాత్పర్యము :–** నీ కాలపరిమాణముచే విభజించబడిన రాత్రియును పగలునుగల నీకు ఏవి నిద్రయు మెలకువయునో, అవియే నీ సృష్టికి సంహార సృష్టులు అగుచున్నవి.

**విభక్తులు / క్రియలు: –** 1. స్వకాలపరిమాణేన – పరిమాణేన , పరిమాణాభ్యామ్, పరిమాణైః అకారాన్త నపుంసకలింగ పరిమాణ శబ్దము తృతీయావిభక్తి ఏకవచనము. 2. వ్యక్తరాత్రిన్దివస్య – **దివస్య**, దివయోః, దివానామ్; అకారాన్త నపుంసకలింగరాత్రిన్దివశబ్దము, షష్ఠీ విభక్తి ఏకవచనము. 3. తే – తవ /తే, యువయోః / వామ్, యుష్మాకమ్ / వః ; దకారాన్త పుంలింగయుష్మచ్ఛబ్దము. షష్ఠీవిభక్తి ఏకవచనము. 4. తు – అవ్యయము. 5. యౌ – యః, **యౌ** ,యే ; దకారాన్త పుంలింగయచ్ఛబ్దము. ప్రథమావిభక్తి ద్వివచనము. 6. స్వప్నావబోధౌ – స్వప్నావబోధః, **స్వప్నావబోధౌ**, స్వప్నావబోధాః ; అకారాన్త పుంలింగ స్వప్నావబోధ శబ్దము. ప్రథమావిభక్తి ద్వివచనము. 7. తౌ – సః, **తౌ**, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము ప్రథమావిభక్తి ద్వివచనము. 8. భూతానామ్ – భూతస్య, భూతయోః , భూతానామ్ ; అకారాన్త పుంలింగ భూతశబ్దము షష్ఠీవిభక్తి ఏకవచనము. 9. ప్రలయోదయౌ; అకారాన్త పుంలింగ ప్రలయోదయ శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము నిత్య ద్వివచనము.

**సమాసాలు:–**

1. స్వకాలపరిమాణేన – స్వస్య కాలః (ష.త) స్వకాలః, స్వకాలస్య పరిమాణమ్ (ష.త) తేన.

2. వ్యక్తరాత్రిన్దివస్య – రాత్రౌ చ దివా చ (సమాసాన్త) రాత్రిన్దివమ్ । వ్యక్తం రాత్రిన్దివం యస్య (బహువ్రీహి) సః, తస్య

3. స్వప్నావబోధౌ – స్వప్నశ్చ అవబోధశ్చ (ద్వన్ద్వ) తౌ.

4. ప్రలయోదయౌ – ప్రలయశ్చ ఉదయశ్చ (ద్వంద్వ) తౌ.

**పాఠాన్తరాలు : –** యౌ తు స్వప్నావబోధౌ – యావేవ స్వప్నప్రబోధౌ

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు: –**

**1. స్వకాలపరిమాణేన – స్వప్నావబోధౌ : –**

ఎ) శ్లో॥ చతుర్యుగసహస్రాణి – బ్రహ్మణో దినముచ్యతే
బ్రహ్మదేవునకు చతుర్యుగసహస్రములు – దినమని చెప్పబడినది.

బి) శ్లో॥ నిఃశ్వసితమస్య వేదా వీక్షితమేతస్య పంచ భూతాని ।
స్మృతమేతస్య చరాచరమస్య చ సుప్తం మహాప్రలయః ॥ ఇతి

శ్లో॥ యదా స దేవో జాగర్తి తదైవ చేష్టతే జగత్ ।
యదా స్వపితి శాన్తాత్మా తదా సర్వం ప్రలీయతే ॥
ఇతిమనుస్మృతి 1–52

ఆ బ్రహ్మదేవుడు మేల్కొని యున్నంతవఱకు ఈ ప్రపంచము మేల్కొని యుంటుంది. శాంతస్వరూపుడైన ఆ దేవుడు నిద్రపోయినపుడు ఈ జగమంతా లయం చెందుతున్నది.

డి) శ్లో॥ అహోరాత్రే విభజతే సూర్యో మానుషదైవికే ।
రాత్రిస్స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణామహః ॥ 1–65

సూర్యుడు ఈ రాత్రింబగళ్లను కల్పిస్తున్నాడు. పగటి కాలమున భూతగణమంతా తమ తమ కార్యాలను చేసికొనుచు రాత్రికాలమున నిద్రించుచున్నది.

శ్లో॥ పిత్రే రాత్ర్యహనీ మాసః ప్రవిభాగస్తు పక్షయోః ।
కర్మచేష్టాస్వహః కృష్ణః శుక్లస్స్వప్నాయ శర్వరీ ॥ 66

శ్లో॥ దైవే రాత్ర్యహనీ వర్షం ప్రవిభాగస్తయోః పునః ।
అహస్తత్రోదగయనం రాత్రిః స్యాద్దక్షిణాయనమ్ ॥ 67

ఈ విధముగా మనుధర్మశాస్త్రమున – 'కాలవిభజన' – మానవులకు, పితృదేవతలకు, దేవతలకు చెప్పబడుటను – చూడగలరు.

శ్లో॥ బ్రహ్మస్య తు క్షపాహస్య యత్ప్రమాణం సమాసతః ।
ఏకైకశో యుగానాం తు క్రమశస్తన్నిబోధత ॥ 68





శ్లో॥ చత్వార్యాహుస్సహస్రాణి వర్షాణాం తు కృతం యుగమ్ ।
తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః ॥ 69..73

1. కృతయుగము – 4000 దేవతా సంవత్సరాలు + దాని ప్రభావము మరో 800 సంవత్సరాలు = మొత్తంమీద 4800 సంవత్సరాలు. 2. త్రేతాయుగము – 3600. 3. ద్వాపరయుగము – 2400. 4. కలియుగము – 1200. మొత్తం 12000 సంవత్సరాలు. ఈ లెక్కన బ్రహ్మదేవుని 1 రోజుకు 4,320,000,000 మానవ సంవత్సరాలుగా చెప్పబడినది. బ్రహ్మయొక్క రాత్రింబగళ్లు కాలమును చక్కగా తెలిసిన వానిని **అహోరాత్రవిదుడని** పండితులంటారు.

శ్లో॥ తద్వై యుగసహస్రాంతం బ్రాహ్మం పుణ్యమహర్విదుః ।
రాత్రిం చ తావతీమేవ తేఽ**హోరాత్రవిదో** జనాః ॥ మను. 1–73

---

**శ్లో ॥ జగద్యోనిరయోనిస్త్వం**
**జగదన్తో నిరన్తకః ।**
**జగదాదిరనాదిస్త్వం**
**జగదీశో నిరీశ్వరః ॥** **9**

**పదవిభాగము :–** జగద్యోనిః, అయోనిః, త్వమ్, జగదన్తః, నిరన్తకః, జగదాదిః, అనాదిః, త్వమ్, జగదీశః, నిరీశ్వరః ।

**అన్వయక్రమము:–** (హే భగవన్) త్వమ్ జగద్యోనిః అయోనిః జగదన్తః నిరన్తకః త్వ జగదాదిః అనాదిః జగదీశః నిరీశ్వరః ।

**ప్రతిపదార్థము :–** (హే భగవన్! – ఓ భగవంతుడా!), త్వమ్ – నీవు, జగద్యోనిః – జగమునకు కారణుడవు, అయోనిః – కారణములేనివాడవు, (త్వమ్–నీవు,) జగదన్తః – లోకసంహారకుడవు, నిరన్తకః – (నీకు) సంహారకులు లేనివాడవు, త్వమ్ – నీవు, జగదాదిః – లోకములకు మొదటివాడవు, అనాదిః – ఆదిలేనివాడవు, (త్వమ్ – నీవు,) జగదీశః – జగత్ప్రభువవు, నిరీశ్వరః – ప్రభువులేనివాడవు.

**తాత్పర్యము :–** జగములకు నీవు కారణుడవు, (నీకు) కారణము లేదు; నీవు లోకసంహారకుడవు, (నిన్ను) సంహరించువాడులేడు; నీవు లోకములకు

మొదటివాడవు, (నీకు) పూర్వము ఎవ్వడును లేదు; నీవు జగత్ప్రభువు, (నీకు) ప్రభువెవ్వడును లేడు.

**విభక్తులు / క్రియలు:–** 1. త్వమ్ – **త్వమ్,** యువామ్, యూయమ్; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 2. జగద్యోనిః – **జగద్యోనిః**, జగద్యోనీ, జగద్యోనయః ఇకారాన్త పుంలింగ జగత్‌యోనిశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 3. అయోనిః – **అయోనిః**, అయోనీ, అయోనయః ; ఇకారాన్త పుంలింగ అయోనిశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 4. జగదన్త ః – **జగదన్తః**, జగదన్తౌ, జగదన్తాః ;అకారాన్త పుంలింగ జగదన్త శబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 5. నిరన్తకః – **నిరన్తకః**, నిరన్తకౌ, నిరన్తకాః ;అకారాన్త పుంలింగ నిరన్తక శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 6. జగదాదిః– **జగదాదిః**, జగదాదీ, జగదాదయః ; ఇకారాన్త పుంలింగ జగదాది శబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము 7. అనాదిః – **అనాదిః**, అనాదీ, అనాదయః ; ఇకారాన్త పుంలింగ అనాదిశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 8. జగదీశః – **జగదీశః**, జగదీశౌ, జగదీశాః అకారాన్త పుంలింగ జగదీశశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 9. నిరీశ్వరః – **నిరీశ్వరః**, నిరీశ్వరౌ, నిరీశ్వరాః ; అకారాన్త పుంలింగ నిరీశ్వర శబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1. జగద్యోనిః – జగతః యోనిః (ష.త)
2. అయోనిః – అవిద్యమానః యోనిః యస్య (బహుప్రీహి) సః ।
3. జగదన్తః – జగతః అన్తః (ష.త)
4. నిరన్తకః – నిర్గతః అన్తః యస్మాత్ (బహుప్రీహి) సః ।
5. జగదాదిః – జగతామ్ ఆదిః (ష.త)
6. అనాదిః – అవిద్యమానః ఆదిః యస్య (బహుప్రీహి) సః ।
7. జగదీశః – జగతామ్ ఈశః (ష.త)
8. నిరీశ్వరః – నిర్గతః ఈశ్వరః యస్మాత్ (బహుప్రీహి) సః ।

**సంధులు :–**

1. జగత్ + యోనిః – జగద్యోనిః – జశ్త్వసన్ధిః – ఝలాం జశోఽన్తే
2. జగత్ + అన్తః – జగదన్తః –జశ్త్వసన్ధిః
3. జగత్ + ఆదిః – జగదాదిః – జశ్త్వసన్ధిః
4. జగత్ + ఈశః – జగదీశః – జశ్త్వసన్ధిః
5. జగద్యోనిః + అయోనిః – జగద్యోనిరయోనిః – విసర్గసన్ధిః
6. జగదన్తః + నిరన్తకః – జగదన్తో నిరన్తకః – ఉత్వాదేశసన్ధిః (అతోరోరప్లుతాదప్లుతే (6–1–109)





7. జగదాదిః + అనాదిః – జగదాదిరనాదిః – విసర్గసన్ధిః
8. జగదీశః + నిరీశ్వరః – జగదీశో నిరీశ్వరః – ఉత్వాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. అనాదిః – జగదాదిః –**

ఎ) శ్లో॥ యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్। భ.10–3
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే।

ఎవడు మోహము లేనివాడై నన్ను **పుట్టువులేనివానిగను, సనాతనునిగను** సర్వేశ్వరునిగను తెలిసికొనుచున్నాడో...'

బి) "అన్యాదనంతం మహతః పరం ధ్రువమ్" కఠో 1–3–15

ఈ ఆత్మ.... **ఆద్యంతరహితము**, మహత్తత్వాతీతము. సత్యము.........

సి) 'యతో వా ఇమాని భూతాని జాయన్తే' – ఇచట తైత్తిరీయోపనిషత్తునందు గల భృగువల్లిని అనుసంధానము చేసికొందురుగాక.

**అలంకారములు :–** అత్ర 'అయోనిః' ఇత్యాదౌ నఞ్‌తత్పురుషాశ్రయణే విరోధః, బహుప్రీహిణా తు తత్పరిహార ఇతి 'విరోధాభాసాలంకారః'। యథాహుః – **'విరోధాభాసత్వే విరోధః**' ఇతి సంజీవనీ వ్యాఖ్యా.

---

**అవతారికా:–** తవతు న ప్రపంచస్యేవ జన్మతిరోధానజ్ఞానేషు పరాపేక్షేత్యాహ. ప్రపంచము యొక్క సృష్ట్యంతముల జ్ఞానమును తెలిసికొనుటకు ఇతరులవలె పరాపేక్ష నీకు లేదు అను విషయము ప్రస్తావించుచున్నారు.

**శ్లో॥ ఆత్మానమాత్మనా వేత్సి**
**సృజస్యాత్మానమాత్మనా ।**
**ఆత్మనా కృతినా చ త్వ –**
**మాత్మన్యేవ ప్రలీయసే ॥ 10**

**పదవిభాగము:–** ఆత్మానమ్, ఆత్మనా, వేత్సి, సృజసి, ఆత్మానమ్, ఆత్మనా, ఆత్మనా, కృతినా, చ, త్వమ్, ఆత్మని, ఏవ, ప్రలీయసే.

**అన్వయక్రమము:–** (హే – భగవన్!) త్వమ్ ఆత్మానమ్ ఆత్మనా వేత్సి ఆత్మానమ్ ఆత్మనా సృజసి చ కృతినా ఆత్మనా ఆత్మని+ఏవ ప్రలీయసే.

**ప్రతిపదార్థము:–** హే భగవన్ – ఓ బ్రహ్మదేవా!, త్వమ్ – నీవు, ఆత్మానమ్ – నిన్ను, ఆత్మనా – నీ చేతనే, వేత్సి – తెలిసికొనుచున్నావు, ఆత్మానమ్ – నిన్నును, ఆత్మనా – నీ చేతనే, సృజసి – సృష్టించుకొనుచున్నావు, చ – అట్లే, కృతినా – సమర్థుడవగు, ఆత్మనా – నీ చేతనే, ఆత్మన్యేవ – నీ యందే, ప్రలీయసే – లయ మొందుదువు.

**తాత్పర్యము:–** (ఓ బ్రహ్మదేవా !) నీవు నిన్ను నీ చేతనే తెలిసికొనుచున్నావు. నిన్నును నీ చేతనే సృష్టించుకొనుచున్నావు. సమర్థుడవగు నీ చేతనే నీ యందే లయ మొందుదువు.

**విభక్తులు/క్రియలు:–** 1. త్వమ్ – **త్వమ్**, యువామ్, యూయమ్; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 2. ఆత్మానమ్ – **ఆత్మానమ్**, ఆత్మానౌ, ఆత్మనః ; నకారాన్త పుంలింగ ఆత్మన్ శబ్దము ద్వితీయావిభక్తి ఏకవచనము. 3. ఆత్మనా – **ఆత్మనా,** ఆత్మభ్యామ్, ఆత్మభిః ; నకారాన్త పుంలింగ ఆత్మన్ శబ్దము తృతీయావిభక్తి ఏకవచనము. 4. వేత్సి – క్రియ (విద్ + లట్, మధ్యమ పురుషైక వచనమ్). 5. సృజసి – క్రియ (సృజ్ + లట్, మధ్యమ పురుషైక వచనమ్). 6. ప్రలీయసే – క్రియ (ప్ర + లట్, మధ్యమ పురుషైక వచనమ్). 7. చ, ఏవ – అవ్యయాలు. 8. కృతినా – **కృతినా**, కృతిభ్యామ్, కృతిభిః ; ఇకారాన్త పుంలింగ కృతిశబ్దము తృతీయావిభక్తి ఏకవచనము.

**సంధులు:–**

1. సృజసి + ఆత్మానమ్ – సృజస్యాత్మానమ్ – యణాదేశసన్ధిః
2. ఆత్మని + ఏవ – ఆత్మన్యేవ – యణాదేశసన్ధిః **ఇకో యణచి**

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ఆత్మనా –** ఎ) సర్వత్రాత్మనా ఇతి తృతీయా – సంజీవనీవ్యాఖ్యా

బి) 'స్వేన' ఇత్యర్థే విభక్తి ప్రతిరూపకమవ్యయమేతత్। "గోప్యః పునర్జాతమివాత్మనైవ ప్రైక్షన్త సమ్మోదపయోధిమగ్నాః ॥" (యాదవాభ్యుదయే 8–78) ఇత్యత్రతు "ఆత్మనేతి ప్రకృత్యాదిత్వాత్ వా. 2–3–18 తృతీయా, సుబన్తప్రతిరూపకమవ్యయమితి కేచిత్ ఆహుః" ఇతి అప్పయ్యదీక్షితాః । – అవ్యయకోశః (163)

**2. చ– అవ్యయకోషః (338) –** "అన్వాచయ – సమాహార – ఇతరేతరయోగ– సముచ్చయ – వినియోగ– తుల్యయోగితా – అవధారణ – హేతు – పాదపూరణ – యద్యర్థాదిషు వర్తతేఽయమ్ ।"

1. అన్వాచయే – 'భిక్షామట గాం చ ఆనయ' ।





2. సమాహారే – పాణీ చ పాదౌ చ పాణిపాదమ్ ।
3. ఇతరేతరయోగే – 'పచతి చ పఠతి చ చైత్రః' ।
4. సముచ్చయే – 'అహం చ త్వం చ పుత్ర గచ్ఛావః' ।
9. పాదపూరణే – 'భీష్మః పార్థస్తథైవ చ' ।
10. యద్యర్థే – త్వం చ గమిష్యసి, ఫలిష్యతి నః కామః ।

3. శ్లో॥ఏవం సర్వం స సృష్ట్వేదం మాం చాచిన్త్యపరాక్రమః ।
ఆత్మన్యన్తర్దధే భూయః కాలం కాలేన పీడయన్ ॥ మనుస్మృతి 1–51

(బ్రహ్మదేవుడు ఇట్లు సమస్తచరాచరప్రపంచమును సృష్టించి కొంతకాలము తరువాత దానిని నశింపజేయుచు తాను కూడా శరీరత్యాగము చేయును.)

4. 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా' – బృహ 3. 7–23 ఇది అద్వైతసారము.

**క్రియాదర్శము:–** 1. **వేత్సి** – విద (విద్) జ్ఞాన్ (తెలియుట) అదాది ప్రకరణమ్, సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్

మధ్యమపురుషరూపాలు–ఎ) **వేత్సి** – విత్థః – విత్థ. బి) వేత్థ – విదథుః – విద

2. **సృజసి** – సృజ (సృజ్) విసర్గే, తుదాది ప్రకరణమ్ (6) పరస్మైపదీ, సకర్మకమ్, అనిట్, లట్ మధ్యమపురుషైకవచనమ్

మధ్యమపురుషరూపాలు – **సృజసి** – సృజథః – సృజథ

(సృజ –విసర్గే, దివాదిప్రకరణమ్, ఆత్మనేపదీ, అకర్మకమ్, అనిట్ – ప్రథమపురుష ఏకవచనరూపము – సృజ్యతే)

3. **ప్రలీయసే** – ప్ర+లీఙ్ (లీ) శ్లేషణే (లీనమగుట) దివాది ప్రకరణమ్ (4) అకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ – లట్ – మధ్యమపురుష ఏకవచనము

రూపాలు – **ప్ర+లీయసే,** ప్ర+లీయేథే, ప్ర+లీయధ్వే, ప్ర – ఉపసర్గ.

**అలంకారము:** – ఇట 'అనుప్రాస' చెప్పదగును.

---

**శ్లో॥ ద్రవస్సఙ్ఘాతకఠినః స్థూల –**
**స్సూక్ష్మో లఘుర్గురుః ।**
**వ్యక్తో వ్యక్తేతరశ్చాసి**
**ప్రాకామ్యం తే విభూతిషు ॥ 11**

**పదవిభాగము:–** ద్రవః, సంఘాతకఠినః, స్థూలః, సూక్ష్మః, లఘుః, గురుః,వ్యక్తః వ్యక్తేతరః, చ, అసి, ప్రాకామ్యమ్, తే, విభూతిషు ।

**అన్వయక్రమము:–** (త్వమ్) ద్రవః సంఘాతకఠినః స్థూలః సూక్ష్మః లఘుః గురుః వ్యక్తః వ్యక్తేతరః చ అసి విభూతిషుతేప్రాకామ్యమ్ ।

**ప్రతిపదార్థము:–** ద్రవః – రసాత్మకుడవు, సంఘాతకఠినః – సంఘాతముచేత కఠినమైనవాడవు, స్థూలః – లావయినవాడవు, సూక్ష్మః – ఇంద్రియములకు గోచరింపనివాడవు, లఘుః – తేలికయినవాడవు, గురుః – బరువయినవాడవు, వ్యక్తః – కార్యస్వరూపుడవు, వ్యక్తేతరః చ – అవ్యక్తుడవు, అసి – అగుచున్నావు, విభూతిషు– అణిమాది ఐశ్వర్యములయందు, తే – నీకు, ప్రాకామ్యమ్ – యథేచ్ఛత్వము (అస్తి – కలదు).

**తాత్పర్యము:–** నీవు రసస్వరూపుడవు, కఠినుడవు, లావయినవాడవు, ఇంద్రియములకు గోచరింపనివాడవు, తేలికయినవాడవు, బరువయినవాడవు, కార్యస్వరూపుడవు, అవ్యక్తుడవు, అగుచున్నావు. అణిమాది ఐశ్వర్యములయందు నీకు యథేచ్ఛత్వము కలదు.

**విభక్తులు / క్రియలు:–** 1. ద్రవః – **ద్రవః**, ద్రవౌ, ద్రవాః ; అకారాన్త పుంలింగ ద్రవశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 2. సంఘాతకఠినః – **కఠినః**, కఠినౌ, కఠినాః; అకారాన్త పుంలింగ కఠిన శబ్దముప్రథమావిభక్తి ఏకవచనము. 3. స్థూలః – **స్థూలః**, స్థూలౌ, స్థూలాః, అకారాన్త పుంలింగ స్థూల శబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 4. సూక్ష్మః – **సూక్ష్మః**, సూక్ష్మౌ, సూక్ష్మాః, ; అకారాన్త పుంలింగ సూక్ష్మశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 5. లఘుః – **లఘుః**, లఘూ, లఘవః; ఉకారాన్త పుంలింగ లఘుశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 6. గురుః – **గురుః**, గురూ, గురవః ఉకారాన్త పుంలింగ గురుశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 7. వ్యక్తః – **వ్యక్తః**, వ్యక్తౌ, వ్యక్తాః ; అకారాన్త పుంలింగ వ్యక్తశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 8. వ్యక్తేతరః – **వ్యక్తేతరః**, వ్యక్తేతరౌ, వ్యక్తేతరాః;అకారాన్త పుంలింగ వ్యక్తేతరశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము. 9. చ, అసి – అవ్యయములు. 10. విభూతిషు – **విభూతౌ**, విభూత్యోః, విభూతిషు ; ఇకారాన్త స్త్రీంలింగ విభూతిశబ్దము సప్తమీవిభక్తి బహువచనము. 11. తే – **తే/తవ,** యువయోః / వామ్, యుష్మాకమ్ /వః ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము షష్ఠీవిభక్తి ఏకవచనము. 12. ప్రాకామ్యమ్ – **ప్రాకామ్యమ్**, ప్రాకామ్యే, ప్రాకామ్యాని ; అకారాన్త నపుంసకలింగ ప్రాకామ్యశబ్దము ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు: –**

1. సంఘాతకఠినః – సంఘాతేన కఠినః (తృ.త)
2. వ్యక్తేతరః – వ్యక్తాత్ ఇతరః (పంచమీ.త)





**సంధులు: –**

1. వ్యక్త+ఇతరః – వ్యక్తేతరః – గుణసంధిః, **ఆద్గుణః**
2. స్థూలః+సూక్ష్మః – స్థూలస్సూక్ష్మః – విసర్గసన్ధిః
3. సూక్ష్మః+లఘుః–సూక్ష్మో లఘుః – ఉత్వాదేశసన్ధిః
4. లఘుః+గురుః – లఘుర్గురుః – విసర్గసన్ధిః
5. వ్యక్తః+వ్యక్తేతరః–వ్యక్తో వ్యక్తేతరః – ఉత్వాదేశసన్ధిః
6. చ+అసి–చాసి–సవర్ణదీర్ఘసంధిః
7. వ్యక్తేతరః+చ – వ్యక్తేతరశ్చ – శ్చుత్వసన్ధిః

**పదవ్యుత్పత్తి– నిఘంటు ప్రమాణాలు, కావ్యప్రయోగాలు**

**1. అవ్యక్తః – వ్యక్తేతరః – సూక్ష్మః....**

శ్లో॥ అమేయో మితలోకస్త్వమనర్థీ ప్రార్థనావహః।
అజితో జిష్ణురత్యన్తమవ్యక్తో వ్యక్తకారణమ్ ॥ ర.వం.10–18

రావణవధకై దేవతలు విష్ణువును ప్రార్థించు సందర్భమున... నీవు ఇంద్రియములకు గోచరింపని మిక్కిలి సూక్ష్మరూపుడవు. అవ్యక్తుడవు అయినను వ్యక్తకారణమవు, నీవు అచింత్యావ్యక్త స్వరూపుడైన మహానుభావుడవు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః।
పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్॥ – భ.గీ.7–24

నేను అవ్యక్తుడనైనను (మనస్సునకు నింద్రియములకు అతీతుడనైనను) మూఢులు నన్ను వ్యక్తుడనుగ భావించుచున్నారు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం న విదుః కామమోహితాః।
నాహం ప్రకాశతాం యామి అజ్ఞానాం పాపకర్మణామ్॥

జగత్సృష్టికి పూర్వము సూక్ష్మరూపుడను, సృష్టికి పిదప స్థూలరూపుడను నగు నన్ను కామమోహితులు తెలిసికొనజాలకున్నారు.....

శ్లో॥ యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ కేన.ఉ.

ఏది మనస్సుచేత తలచుటనలవి కాదో, దేనిచేత మనస్సు వ్యవహరించు చున్నదో దానిని బ్రహ్మమని యెఱుంగుము... అన్యమైన దెద్దియు బ్రహ్మము కానేరదు.

**2. విభూతిషు తే ప్రాకామ్యమ్**

ఎ) విభూతి– A gloriano manifestation or manifestation is general

of the highest. The idea is that the highest can assume any from he likes. He has absolute power to do anything - Karmankur.

బి) శ్లో॥ అణిమా లఘిమా ప్రాప్తిః ప్రాకామ్యం మహిమా తథా।
ఈశిత్వం చ వశిత్వం చ తథా కామావసాయితా॥

సి) శ్లో॥ అణిమా మహిమా చైవ లఘుమా గరిమా తథా।
ప్రాప్తిః ప్రాకామ్యమీశిత్వం వశిత్వం చాష్ట సిద్ధయః ॥

'కుమారసంభవమహాకావ్య' ప్రథమసర్గ – 5వ శ్లోకవ్యాఖ్య చూడగలరు.

**3. అసి – అవ్యయము (తిజంత ప్రతిరూపకమ్) అవ్యయకోషః (131) . 'త్వమ్ ' ఇత్యర్థే, వాక్యాలంకారే చైతదవ్యయం. చాదిషు ద్రష్టవ్యమ్।**

'అస భువి' ఇత్యత్ర **ధాతోర్లటి** మధ్యమపురుషైకవచనే 'అసి' ఇతి సమ్పద్యతే। తస్య ప్రతిరూపకమేతదితి బోధమ్। భోజస్తు 'యుష్మదర్థానువాదే' ఇత్యాహ। త్వమర్థే 'బాల్యాదమిత్రమస్యాసి'। అత్ర 'అసి' ఇతి త్వమర్థే ప్రయుక్తమ్। వాక్యాలంకారే – 'వేత్స్యసి పార్థివ। త్వమసి సత్యమభ్యథాః' ఇతి। అత్ర 'త్వమ్' ఇతి ప్రయుక్తత్వాత్ పునరసి ఇతి వాక్యాలంకార ఏవ। వాక్యాలంకారత్వం నామ–క్షోదే కృతేఽర్థశూన్యత్వమేవ। 'శూరోఽసి కృతవిద్యోఽసి దర్శనీయోఽసి పుత్రక ।' ఇత్యత్ర తు కథంచిద్యుష్మదర్థకత్వమ్॥ కేచిత్ ఏకేన 'అసి' ఇతి ప్రయోగేనైవ త్వమిత్యర్థే, అథవా క్రియాయాశ్చ లాభే సమమతి, 'అసి' ఇతి త్రిః ప్రయోగోఽత్రాపి వాక్యాలంకార ఏవేత్యాహుః ।

**అలంకారములు:–** ఇట 'పరికరాలంకార' మున్నదని చెప్పదగును.

కా: **విశేషణైర్యత్సాకూతైరుక్తిః పరికరస్తు సః ।**

అభిప్రాయగర్భితాలైన విశేషణాలను ఉపయోగించి విశేష్యంలో ఒక విధమైన వైశిష్ట్యాన్ని సూచించడం పరికరాలంకారము. నీకు విభూతులయందు యథేచ్ఛత్వము కలదని చెప్పి నీవు రసాత్మకుడవు...ఆదిగా గల విశేషణములు ఇట చెప్పబడుటచే నిది 'పరికరాలంకార' మని చెప్పదగును.

---

**శ్లో॥ ఉద్ఘాతః ప్రణవో యాసాం**
**న్యాయైస్త్రిభిరుదీరణమ్।**
**కర్మ యజ్ఞః ఫలం స్వర్గ–**
**స్తాసాం త్వం ప్రభవో గిరామ్॥ 12**





**పదవిభాగము:–** ఉద్ఘాతః, ప్రణవః, యాసామ్, న్యాయైః, త్రిభిః, ఉదీరణమ్, కర్మ యజ్ఞః, ఫలమ్, స్వర్గః, తాసామ్, త్వమ్, ప్రభవః, గిరామ్

**అన్వయక్రమము:–** యాసాం గిరామ్, ఉద్ఘాతః ప్రణవః, (యాసాం) త్రిభిః న్యాయైః ఉదీరణం, యాసాం కర్మ యజ్ఞః ఫలం స్వర్గః త్వం తాసాం గిరాం ప్రభవః (అసి)

**ప్రతిపదార్థము:–** యాసామ్ గిరామ్ – ఏ వాక్కులకు, ఉద్ఘాతః – ఆరంభము, ప్రణవః – ఓంకారమో, త్రిభిః న్యాయైః – మూడు స్వరములతో (ఉదాత్తానుదాత్త స్వరితములతో), ఉదీరణమ్ – ఉచ్చారణమో, కర్మ – పని, యజ్ఞః – యజ్ఞమో, ఫలమ్ – ఫలము, స్వర్గః – స్వర్గమో, తాసామ్ గిరామ్ – ఆ వాక్కులకు, త్వమ్ – నీవు, ప్రభవః – కారణమవు, (అసి–అయితివి).

**తాత్పర్యము:–** ఏ వాక్కులకు ఆరంభము ఓంకారమో, మూడు స్వరములతో ఉచ్చారణమో, పని యజ్ఞమో, ఫలము స్వర్గమో, ఆ వాక్కులకు నీవు కారణమవు (అయితివి)

**విభక్తులు/క్రియలు:–** 1. యాసామ్–యస్యాః, యయోః, యాసామ్, దకారాన్త స్త్రీలింగ యచ్ఛబ్దము. షష్ఠీ విభక్తి ఏకవచనము. 2. గిరామ్ – గిరః, గిరోః, **గిరామ్**, రేఫాన్త స్త్రీలింగ 'గీర్' శబ్దము. ష.బ. 3. ఉద్ఘాతః – **ఉద్ఘాతః**, ఉద్ఘాతౌ, ఉద్ఘాతాః, అకారాన్త పుంలింగ ఉద్ఘాత శబ్దము. ప్ర.ఏ. 4. ప్రణవః – **ప్రణవః**, ప్రణవౌ, ప్రణవాః, అకారాన్త పుంలింగ ప్రణవ శబ్దము. ప్ర.ఏ. 5. త్రిభిః – ఇకారాన్త పుంలింగో నిత్యం బహువచనాంతః, త్రిశబ్దః, తృతీయా. 6. న్యాయైః – న్యాయేన, న్యాయాభ్యామ్, **న్యాయైః**, అకారాన్తపుంలింగన్యాయశబ్దము. తృ.బ. 7. ఉదీరణమ్ – **ఉదీరణమ్,** ఉదీరణే, ఉదీరణాని, అకారాన్తనపుంసకలింగ ఉదీరణ శబ్దము .ప్ర.ఏ. 8. కర్మ – **కర్మ**, కర్మణీ, కర్మాణి, నకారాన్తనపుంసకలింగ కర్మన్ శబ్దము. ప్ర.ఏ. 9. యజ్ఞః – **యజ్ఞః**, యజ్ఞౌ, యజ్ఞాః,అకారాన్త పుంలింగ యజ్ఞశబ్దము. ప్ర.ఏ. 10. ఫలమ్ – **ఫలమ్**, ఫలే, ఫలాని, అకారాన్త నపుంసకలింగ ఫలశబ్దము. ప్ర.ఏ. 11. స్వర్గః – **స్వర్గః**, స్వర్గౌ, స్వర్గాః, అకారాన్త పుంలింగ స్వర్గ శబ్దము. ప్ర.ఏ. 12. తాసామ్ – తస్యాః, తయోః, **తాసామ్**, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ష.ఏ. 13. ప్రభవః – **ప్రభవః**, ప్రభవౌ, ప్రభవాః అకారాన్త పుంలింగ ప్రభవశబ్దము, ప్ర.ఏ.

**సంధులు:–**

1. ప్రణవః + యాసామ్ – ప్రణవో యాసామ్ –ఉత్వాదేశసన్ధి.
2. న్యాయైః + త్రిభిః – న్యాయైస్త్రిభిః – విసర్గసన్ధిః
3. త్రిభిః + ఉదీరణమ్ – త్రిభిరుదీరణమ్ – విసర్గసన్ధిః
4. స్వర్గః + తాసామ్ – స్వర్గస్తాసామ్ – విసర్గసన్ధిః
5. ప్రభవః + గిరామ్ – ప్రభవో గిరామ్ – ఉత్వాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంట ప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ప్రణవః** – ఎ) ప్రకర్షేణ నూయతే స్తూయతే ఆత్మా స్వేష్టదేవతా వానేనేతి.

బి) ప్ర+ణు స్తుతౌ+ 'ఋదోరప్' ఇతి అప్, 'ఉపసర్గాదసమాసేఽపి ణోపదేశస్య' ఇతి ణత్వమ్। యద్వా బ్రహ్మ విష్ణు మహేశరూపత్వాత్ ప్రణమ్యతే ఇతి।

సి) ప్ర+ణమ్+కర్మణి ఘఞ్, సంజ్ఞా పూర్వకత్వాత్ వృద్ధ్యభావః, పుషోదరాదిత్వాత్ మస్య వః

డి) శ్లో॥ ఓంకారః ప్రణవస్తారో వేదాదిర్వర్తులో ధ్రువః।
త్రైగుణ్యం త్రిగుణో బ్రహ్మ సత్యో మంత్రాదిరవ్యయః॥
బ్రహ్మబీజం త్రితత్త్వం చ పంచరశ్మిస్త్రిదైవతః।
–ఇతి బీజవర్ణాభిధానమ్

ఇ) 1. య ఉద్గీథః స **ప్రణవో** యః **ప్రణవః** స ఉద్గీథః, ఛాం 1.5.1
2. అసౌ వా ఆదిత్య ఉద్గీథ ఏష **ప్రణవః**

యఫ్) శ్లో॥ రసోఽహమప్సు కౌంతేయ। ప్రభాస్మి శశిసూర్యయోః।
**ప్రణవః** సర్వవేదేషు। శబ్దః ఖే పౌరుషం నృషు॥ భ.గీ. 7.8
...... సర్వవేదముల యందు ఓంకారము నేను.....

జి) శ్లో॥ బ్రహ్మణః **ప్రణవం** కుర్యాదాదావన్తే చ సర్వతః।
దహత్యేనః కృతం పూర్వం పరస్తాచ్చ విశేషతః॥
ఇతి నిరుక్త పరిశిష్టయోర్యాస్కః

హెచ్) శ్లో॥ బ్రహ్మణః ప్రణవం కుర్యాదాదావన్తే చ సర్వదా।
స్రవత్యనోంకృతం పూర్వం పరస్తా చ్చ విశీర్యతే॥ మనుస్మృతి ॥–74

...శిష్యుడు వేదాధ్యయన ప్రారంభంలో మరియు అవసానంలో **ఓంకారము**ను ఉచ్చరించాలి.

ఐ) శ్లో॥ ఏకాక్షరం పరం బ్రహ్మ.... ॥–83
ఏకాక్షరమైన ఓంకారమే పరబ్రహ్మము

జె) శ్లో॥ వైవస్వతో మనుర్నామ మాననీయో మనీషిణామ్।
ఆసీన్మహీక్షితామాద్యః **ప్రణవ**శ్ఛందసామివ ॥ ర.వం.।–॥

విద్వాంసులకు కూడ మాననీయుడును, **వేదములకు ఓంకారము** వలె, రాజులందఱిలో ప్రథమగణ్యుడునగు, వివస్వంతుని కుమారుడైన వైవస్వతుడు అను మనువు ఉండెడివాడు.





**2. న్యాయాః** ఎ) నీయన్తే ఏభిరర్థవిశేషా ఇతి న్యాయాః స్వరాః – సంజీవనీవ్యాఖ్యా

బి) స్వయం రాజన్త ఇతి స్వరాః (మహాభాష్యము) – వేని ఉచ్చారణము ఇతర వర్ణముల సహాయము లేక జరుగునో అవి స్వరములు. అచ్చు **హ్రస్వము, దీర్ఘము, ప్లుతము** అని మూడు విధములు 'ఊకాలో ఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః' సూ.(1–2–27)

ఒక చిటిక కాలములో ఉచ్చరింపబడు అచ్చు హ్రస్వము (అ,ఇ,ఉ,ఋ,ఇ). రెండు చిటికల కాలములో ఉచ్చరింపబడు అచ్చు దీర్ఘము (ఆ, ఈ, ఊ, ౠ, ఏ,ఐ, ఓ, ఔ). మూడు చిటికల కాలములో ఉచ్చరింపబడు అచ్చు ప్లుతము (అ$^{3}$,ఇ$^{3}$,ఉ,$^{3}$ఋ$^{3}$,ఇ$^{3}$,ఏ$^{3}$,ఐ$^{3}$,ఓ$^{3}$,ఔ$^{3}$). **ఉదయకాలమున** కోడి తనకూతలో హ్రస్వదీర్ఘప్లుతములను చూపును. ఇవి ఒక్కొక్కటి ఉదాత్త, అనుదాత్త, స్వరిత భేదమున మూడేసి రకములు, ఎ) ఉచ్చైరుదాత్తః (సూ. 1–2–29), బి) నీచైరనుదాత్తః (సూ. 1–2–30), సి) సమాహారః స్వరితః (సూ. 1–2–31).

ఇవి తిరిగి అనునాసిక, అననునాసిక భేదముచే రెండు విధములు. ఇట్లు హ్రస్వము(6), దీర్ఘము(6), ప్లుతము(6), వెరసి 18 రకములు. ఇట పాణినీయ 'శిక్షా' అనుసంధానము చేసికొనగలరు.

---

**అవతారికా: –** సాంఖ్యమతేన స్తువన్తి – సాంఖ్యమతరీత్యా స్తోత్రము చేయుచున్నారు.

**శ్లో॥ త్వామామనన్తి ప్రకృతిం**
**పురుషార్థప్రవర్తినీమ్।**
**తద్దర్శినముదాసీనం త్వా –**
**మేవ పురుషం విదుః ॥** **13**

**పదవిభాగము :–** త్వామ్, ఆమనన్తి, ప్రకృతిమ్, పురుషార్థప్రవర్తినీమ్, తద్దర్శినమ్, ఉదాసీనమ్, త్వామ్, ఏవ, పురుషమ్, విదుః.

**అన్వయక్రమము:–** త్వామ్ పురుషార్థప్రవర్తనీమ్ ప్రకృతిమ్ ఆమనన్తి । త్వామ్ ఏవ తద్దర్శినమ్ ఉదాసీనమ్ పురుషం విదుః ।

**ప్రతిపదార్థము:–** త్వామ్ – నిన్ను, పురుషార్థప్రవర్తినీమ్ – ఆత్మ ప్రయోజనముకై ప్రవర్తించునట్టి, ప్రకృతిమ్ – మూలకారణముగా, ఆమనన్తి – పదేపదే చెప్పుచున్నారు, త్వామ్ ఏవ – నిన్నే, తద్దర్శినమ్ – ఆ ప్రకృతిని చూచుచున్న, ఉదాసీనమ్ – నిర్వికారుడవగు, పురుషమ్– పురుషునిగా, విదుః – తలంతురు.

**తాత్పర్యము:–** (ఓ – దేవా!) నిన్ను ఆత్మప్రయోజనముకై ప్రవర్తించునట్టి మూలకారణముగా పదేపదే చెప్పుచున్నారు. నిన్నే ఆ ప్రకృతిని చూచుచున్న నిర్వికారుడవగు పురుషునిగా తలంతురు.

**విభక్తులు / క్రియలు:–** 1. త్వామ్ – **త్వామ్/ త్వా,** యువామ్ / వామ్, యుష్మాన్ / వః ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 2. పురుషార్థప్రవర్తినీమ్ – **ప్రవర్తినీమ్,** ప్రవర్తిన్యౌ, ప్రవర్తినీః ; ఈకారాన్త స్త్రీలింగ ప్రవర్తినీశబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 3. ప్రకృతిమ్ – **ప్రకృతిమ్,** ప్రకృతీ, ప్రకృతీః ; ఇకారాన్త స్త్రీలింగ ప్రకృతిశబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 4. ఆమనన్తి – క్రియ (ఆ+మన్+లట్, ప్రథమపురుష బహువచనము). 5. ఏవ – అవ్యయము. 6. తద్దర్శినమ్ – **తద్దర్శినమ్,** తద్దర్శినౌ, తద్దర్శినః ; నకారాన్త పుంలింగ దర్శిన్ శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 7. ఉదాసీనమ్– **ఉదాసీనమ్,** ఉదాసీనౌ, ఉదాసీనాన్; అకారాన్త పుంలింగ ఉదాసీన శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 8. పురుషమ్ – **పురుషమ్,** పురుషౌ, పురుషాన్ ; అకారాన్త పుంలింగ పురుష శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 9. విదుః – క్రియ – విద్ లట్ ప్రథమ పురుష బహువచనము.

**సమాసాలు:–**

1. పురుషార్థప్రవర్తినీమ్ – పురుషస్య అర్థః (ష.త), పురుషార్థః పురుషార్థాయ ప్రవర్తతే ఇతి (ఉపపదతత్పు) తామ్.
2. తద్దర్శినమ్ – తామ్ పశ్యతీతి తద్దర్శీ (ఉపపదతత్పు) తమ్.

**సంధులు:–**

1. తత్+దర్శినమ్ – తద్దర్శినమ్ – జశ్త్వసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

**1. ప్రకృతిమ్ – ప్రకృతిః – ఇకారాన్త స్త్రీలింగశబ్దము**

ఎ) ప్రక్రియతే కార్యాదికమన**యేతి.** ప్ర+ కృ+ క్తిన్

బి) ధాతువులపై భావాద్యర్థములలో క్తిన్ (తి) ప్రత్యయము చేరును. ఈ క్తిన్నన్తము స్త్రీలింగములోనుండును. 'స్త్రియాం క్తిన్' (సూ. 3–3–94) భావే–కృ+తి–కృతిః

సి) 1. మాయాం తు ప్రకృతిం విద్యాత్ శ్వేతా. 4.10

2. భోక్తా పురుషో భోజ్యా ప్రకృతిః మైత్రి 6.10

3. శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ భ.గీ. 7–4.

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము





ఇట్లు నా ప్రకృతి ఎనిమిది విధములు. అని భగవద్గీత – జ్ఞాన విజ్ఞాన యోగమున జ్ఞానయుక్తమగు భక్తియోగమును భగవంతుడు అర్జునునకు తెలిపెను.

డి) శ్లో॥ న హ్యస్తి సర్వభూతేషు దుఃఖమస్మిన్ కృతః సుఖమ్ ।
ఏవం ప్రకృతిభూతానాం సర్వసంసర్గ సర్గయాయినామ్ ॥
మహాభారతము–12–152–16

ఇ) 'ప్రకృతిః పంచభూతేషు ప్రధానే మూలకారణే ' – ఇతి యాదవః

ఎఫ్) 'కపిలమహర్షి' సాంఖ్యసిద్ధాంతమును ఇట అనుసంధానము చేసికొనదగును.

**2) పురుషమ్ – పురుషః –**

ఎ) పురతి అగ్రే గచ్ఛతీతి, పుర+ 'పురః కుషన్' ఇతి కుషన్.

బి) శ్లో॥ పురాణ్యనేన సృష్టాని – నృతిర్యగృషిదేవతాః ।
శేతే జీవేన రూపేణ – పురేషు **పురుషో** హ్యసౌ ॥ ఇతి భాగవతే

సి) శ్లో॥ పురుసంజ్ఞే శరీరేఽస్మిన్ – శయనాత్ **పురుషో** హరిః ।
శకారస్య షకారోఽయం వ్యత్యయేన ప్రయుజ్యతే ॥
ఇతి శంకరవిజయే (13 అ)

డి) విష్ణువు – అనే అర్థములో

శ్లో॥ ఏవం పురాణః **పురుషో** విష్ణుర్వేదేషు పఠ్యతే ।
అచిన్త్యశ్చాప్రమేయశ్చ గుణేభ్యశ్చ పరస్తథా॥ ఇతి హరివంశే129–20

ఇ) శివుడు – అనే అర్థములో

శ్లో॥ యామ్యాయావ్యక్తరూపాయ సద్వృత్తే శంకరాయ చ ।
క్షేమ్యాయ హరికేశాయ స్థాణవే **పురుషాయ** చ ॥
ఇతి మహాభారతే 14-9-14

ఎఫ్) జీవుడు – అనే అర్థములో

శ్లో॥ **ప్రకృతిః** క్షరమిత్యుక్తం **పురుషో**ఽక్షర ఉచ్యతే ।
తావిమౌ ప్రేరయత్యన్యః స పరః పరమేశ్వరః ॥ ఇతి శివపురాణే.

జి) దుర్గ – అనే అర్థములో

శ్లో॥ మహానితి చ యోగేషు – ప్రధానశ్చైవ కథ్యతే ।
త్రిగుణా వ్యతిరిక్తా సా – **పురుషశ్చేతి** చోచ్యతే ॥ ఇతి దేవీ పురాణే.

**క్రియాదర్శము:-**

**1. ఆమనన్తి** – ఆ+మ్నా (అభ్యాసే), భ్వాదిప్రకరణమ్ (1), పరస్మైపదీ, సకర్మకమ్, అనిట్. ఆమనతి – ఆమనతః – **ఆమనన్తి! 'పాఘ్రాధ్మాస్థామ్నా'** ఇత్యాదినా మనాదేశః ।

శ్లో॥ధ్యేయమేకమపథే స్థితం ధియః స్తుత్యముత్తమమతీతవాక్పథమ్ ।
**ఆమనన్తి** యముపాస్యమాదారాద్దూరవర్తినమతీవ యోగినః॥ మాఘే 14-60
యోగినో యం ధ్యేయమేకమామనన్తి కథయన్తి । మ్నాధాతోర్మనాదేశః ।

**2. విదుః-** విద్ (విద్) జ్ఞానే (తెలియుట) అదాది ప్రకరణమ్ 2. సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్ ప్రథమపురుష బహువచనము ప్రథమపురుష రూపాలు – వేద–విదతుః–**విదుః "విదో లటో వా"** (3-4-93) ఇతి 'ఝోర్జుసాదేశః' వేత్తేర్లటః పరస్మైపదానాం ణలాదయో వా స్యుః॥ వేద, విదతుః, విదుః॥ పక్షే వేత్తి విత్తి ఇత్యాది.

---

**శ్లో॥ త్వం పిత్యాణామపి పితా**
**దేవానామపి దేవతా॥**
**పరతోఽపి పరశ్చాసి**
**విధాతా వేధసామపి ॥ 14**

**పదవిభాగము:-** త్వమ్, పిత్యాణామ్, అపి, పితా, దేవానామ్, అపి, దేవతా, పరతః, అపి, పరః, చ, అసి, విధాతా, వేధసామ్, అపి.

**అన్వయక్రమము:-** త్వమ్ పిత్యాణామ్ అపి పితా దేవానామ్ అపి దేవతా పరతః అపి పరః చ అసి వేధసామ్ అపి విధాతా (అసి) ।

**ప్రతిపదార్థము:-** త్వమ్ – నీవు, పిత్యాణామ్+అపి – పితృదేవతలకున్ను, పితా – తండ్రివి, దేవనామ్+అపి – దేవతలకున్ను, దేవతా – దేవతవు, పరతః – పరమునకంటె, పరః+చ – పరమైనవాడవును, అసి – అయితివి, వేధసామ్ + అపి – బ్రహ్మలకున్ను, విధాతా – సృష్టికర్తవు

**తాత్పర్యము:-** (దేవా!) పితృదేవతలకున్ను తండ్రివి. దేవతలకున్ను దేవతవు. పరమునకంటె పరుడవు. బ్రహ్మలకున్ను బ్రహ్మవు.

**విభక్తులు / క్రియలు:-** 1. త్వమ్ – **త్వమ్**, యువామ్, యూయమ్ ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 2. అపి – అవ్యయము 3. పిత్యాణామ్ – పితుః, పిత్రోః, **పిత్యాణామ్**, ;ఋకారాన్త పుంలింగ పితృశబ్దము. (ష.బ) 4. దేవానామ్ – దేవస్య, దేవయోః **దేవానామ్**, ;అకారాన్త పుంలింగ దేవశబ్దము (ష.బ), 5. వేధసామ్ – వేధసః, వేధసోః, **వేధసామ్** ;సకారాన్త పుంలింగ వేధశ్శబ్దము (ష.బ) 6. పరతః – తసిల్ప్రత్యయాన్తము, తద్ధితాన్తావ్యయము. 7. చ – అవ్యయము. 8. పితా – **పితా**, పితరౌ, పితరః ; ఋకారాన్త పుంలింగ పితృశబ్దము (ప్ర.ఏ). 9. దేవతా – **దేవతా**, దేవతే, దేవతాః ; ఆకారాన్త స్త్రీలింగ దేవతా శబ్దము (ప్ర.ఏ). 10. పరః – పరః పరౌ, పరాః ; అకారాన్త పుంలింగ పరశబ్దము (ప్ర.ఏ) 12. విధాతా – **విధాతా** , విధాతారౌ, విధాతారః ; ఋకారాన్త పుంలింగ విధాతృశబ్దము (ప్ర.ఏ)



**సంధులు :-** పరతః + అపి – పరతోఽపి – పూర్వరూపసన్ధిః

**పాఠాన్తరాలు :-** దేవతా – దైవతమ్

**పదవ్యుత్పతి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. పిత్యాణామ్ – పితా** – ఎ) ఋకారాన్త పుంలింగ పితృశబ్ద ప్రథమావిభక్తి ఏకవచనము. పాతి రక్షత్యపత్యం యః ।

బి) పారక్షణే + 'నప్తృనేష్టృత్వష్టృహోతృభ్రాతృజామాతృమాతృపితృదుహితృ' ఇతి తృచ్ ప్రత్యయేన నిపాతనాత్ సాధుః

సి) శ్లో॥ అన్నదాతా భయత్రాతా యస్య కన్యా వివాహితా ।
జనితా చోపనేతా చ పంచైతే **పితరః** స్మృతాః ॥ ఇతి చాణక్యః

శ్లో॥ కన్యాదాతాన్నదాతా చ జ్ఞానదాతాభయప్రదః ।
జన్మదో మాత్రదో జ్యేష్ఠభ్రాతా చ **పితరః** స్మృతాః ॥ ఇతి బ్రహ్మవైవర్తే

శ్లో॥ మాన్యః పూజ్యశ్చ సర్వేభ్యః సర్వేషాం జనకో భవేత్ ।
అహో యస్య ప్రసాదేన సర్వాన్ పశ్యతి మానవః ॥

శ్లో॥ జనకో జన్మదాతా చ రక్షణాచ్చ పితా నృణామ్ ।
తాతో విస్తీర్ణకరణాత్ కలయా సా ప్రజాపతిః ॥ ఇతి బ్రహ్మవైవర్తే

శ్లో॥ ఉపాధ్యాయః పితా జ్యేష్ఠో భ్రాతా చైవ మహీపతిః ।
మాతులః శ్వశురస్త్రాతా మాతామహపితామహౌ ।
బన్ధుజ్యేష్ఠపితృవ్యశ్చ పుంస్యేతే గురువః స్మృతాః ॥ ఇతి కౌర్మే

డి) **పితృగణః**

శ్లో॥ మనోర్హైరణ్య గర్భస్య యే మరీచ్యాదయః సుతాః ।
తేషామృషీణాం సర్వేషాం పుత్రాః పితృగణాః స్మృతాః ॥

శ్లో॥ విరాట్ సుతాః సోమసదః సాధ్యానాం పితరః స్మృతాః ।
అగ్నిష్వాత్తాశ్చ దేవానాం మరీచాలోకవిశ్రుతాః ॥ మ.స్మృ. 3-194

"హిరణ్యగర్భునికి మనువు పుత్త్రుడు. అతని పుత్రులు మరీచి మొదలైన మహర్షులు. వారి సంతానమే **పితృగణము**. విరాట్పుత్త్రులైన సోమసదులనే వారు సాధ్యులనే వారి యొక్క పితృగణము. అట్లే అగ్నిష్వాత్తులు అనే మరీచి మహర్షియొక్క పుత్త్రులు దేవతలకు పితృగణము...

శ్లో॥ ఋషిభ్యః పితరో జాతాః పితృభ్యో దేవమానవాః ।
దేవేభ్యస్తు జగత్సర్వం చరం స్థాణ్వనుపూర్వశః ॥ 201

ఋషులవలన పితృదేవతలు, వారికి దేవదానవులుద్భవించిరి. వారినుండి ఈ చరాచరసృష్టి ఆవిర్భవించినది. అస్తు.

**2) ప్రజాపతులు –**

శ్లో॥ అథాన్యాన్మానసాన్పుత్రాన్సదృశానాత్మనోఽసృజత్ ।
భృగుం పులస్త్యం పులహం క్రతుమాంగిరసం తథా ॥

శ్లో॥ మరీచిం దక్షమత్రిం చ వసిష్ఠం చైవ మానసమ్ ।
నవ బ్రహ్మణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః ॥
వాయుపురాణే 9 –68, 69 విష్ణుపురాణే । 7.5

భృగువు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అంగీరసుడు, మరీచి, దక్షుడు, అత్రి, మఱియు వశిష్ఠుడు అనువారిని నవబ్రహ్మలుగా ప్రజాపతులుగా విష్ణుపురాణము, వాయుపురాణమున్ను పేర్కొన్నవి.

---

**శ్లో॥ త్వమేవ హవ్యం హోతా చ
భోజ్యం భోక్తా చ శాశ్వతః ।
వేద్యం చ వేదితా చాసి
ధ్యాతా ధ్యేయం చ యత్పరమ్ ॥ 15**

**పదవిభాగము :–** త్వమ్, ఏవ, హవ్యమ్, హోతా, చ, భోజ్యమ్, భోక్తా, చ, శాశ్వతః , వేద్యమ్, చ, వేదితా, చ, అసి, ధ్యాతా, ధ్యేయమ్, చ, యత్పరమ్

**అన్వయక్రమము:–** శాశ్వతః త్వమ్ ఏవ హవ్యమ్ హోతా చ (అసి) (త్వమేవ) భోజ్యమ్ భోక్తా చ (అసి) వేద్యం వేదితా చ ధ్యేయం ధ్యాతా చ అసి ।

**ప్రతిపదార్థము :–** హే బ్రహ్మన్ !, శాశ్వతః – శాశ్వతుడవైన, త్వమేవ – నీవే,





హవ్యమ్ – హవ్యము, హోతా చ – హోతవును, అసి – అయితివి, త్వమేవ – నీవే, భోజ్యమ్ – ఆహారము, భోక్తా చ – భుజించువాడవును, అసి – అయితివి, త్వమేవ – నీవే, వేద్యమ్ – ఎఱుగదగువాడవును, వేదితాచ అసి – అయితివి, త్వమేవ – నీవే, యత్పరమ్ ధ్యేయమ్ – ఏది ముఖ్యముగా ధ్యానింపదగినదియో, ధ్యాతా – తెలుసుకొనువాడవును, ధ్యానము చేయువాడవో, (తచ్చ – అదియున్ను,) అసి – అయితివి.

**తాత్పర్యము:–** ఓ బ్రహ్మదేవా ! శాశ్వతుడవైన నీవే హవ్యము, హోతవును అయితివి. నీవే భోజ్యము, భోక్తవును అయితివి. నీవే ఎఱుగదగువాడవు, తెలిసికొనువాడవును అయితివి. నీవే ధ్యానింపదగినదియు, ధ్యానము చేయువాడవును అయితివి. **'నీకంటె వేఱేది లేదనుట'**

**విభక్తులు / క్రియలు:–** 1. శాశ్వతః – **శాశ్వతః,** శాశ్వతౌ, శాశ్వతాః ;అకారాన్త పుంలింగ శాశ్వతశబ్దము (ప్ర.ఏ) 2. ఏవ – అవ్యయము 3. త్వమ్ – **త్వమ్,** యువామ్, యూయమ్; దకారాన్త పుంలింగయుష్మచ్ఛబ్దము (ప్ర.ఏ) 4. చ – అవ్యయము 5. హవ్యమ్ – **హవ్యమ్**, హవ్యే, హవ్యాని ; అకారాన్త నపుంసకలింగ హవ్యశబ్దము (ప్ర.ఏ) 6. అసి – క్రియ 7. భోజ్యమ్ – **భోజ్యమ్,** భోజ్యే, భోజ్యాని ; అకారాన్త నపుంసకలింగభోజ్యశబ్దము (ప్ర.ఏ) 8. భోక్తా – **భోక్తా**, భోక్తారౌ, భోక్తారః ; ఋకారాన్త పుంలింగభోక్తృశబ్దము(ప్ర.ఏ) 9. వేద్యమ్ – **వేద్యమ్,** వేద్యే, వేద్యాని; అకారాన్త నపుంసకంలింగవేద్యశబ్దము (ప్ర.ఏ) 10. వేదితా – **వేదితా**, వేదితారౌ, వేదితారః ; ఋకారాన్త పుంలింగవేదితృశబ్దము (ప్ర.ఏ) 11. ధ్యేయమ్ – **ధ్యేయమ్**, ధ్యేయే, ధ్యేయాని ; అకారాన్త నపుంసకలింగధ్యేయశబ్దము (ప్ర.ఏ) 12. ధ్యాతా – **ధ్యాతా**, ధ్యాతారౌ, ధ్యాతారః ; ఋకారాన్త పుంలింగధ్యాతృశబ్దము (ప్ర.ఏ)

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1.'సర్వమును నీవే అయితివి'** అనునది ఈ శ్లోక సారాంశము. రఘువంశమునందు పదవసర్గలోని 20వ శ్లోకమును చూడండి.

శ్లో॥ సర్వజ్ఞస్త్వమవిజ్ఞాతః సర్వయోనిస్త్వమాత్మభూః ।
సర్వప్రభురనీశస్త్వమేకస్త్వం సర్వరూపభాక్ ॥ ర. వం' 10–20

ఓ భగవంతుడా ! నీవు అనంతవిశ్వమునందలి ప్రత్యణువును ఎఱిగినవాడవు, ఏ అజ్ఞానిచేత తెలియబడదగినవాడవుకావు. సర్వలోకముల పుట్టువుకు కారణమవు. నీ యంతట నీవే పుట్టినవాడవు. నీవే అందఱికి అధిపతివి. నీకెవ్వడును శాసించు ప్రభువు లేదు. నీవు ఒక్కడవే అయి ఉన్నను సర్వచేతనాచేతనస్వరూపుడవు అయితివి. **'సర్వమును నీవే అయితివి'**

రఘువంశమునందు – 10వ సర్గలోని 5 శ్లోకమునుండి – 31వ శ్లోకము వఱకున్న భాగమును – ఇట అనుసంధానము చేసికొనదగును. ఇట రావణవధకై దేవతలు విష్ణువును ప్రార్థించుట చెప్పబడగా కుమారసమ్భవమహాకావ్యమున ఈ సర్గలోని 4వ శ్లోకమునుండి 15వ శ్లోకమువఱకున్న భాగము – తారకాసురవధకై దేవతలు బ్రహ్మను ప్రార్థించుట చెప్పబడినదిగా తెలియగలరు.

---

**శ్లో॥ ఇతి తేభ్యస్స్తుతీశ్శ్రుత్వా**
**యథార్థా హృదయఙ్గమాః ।**
**ప్రసాదాభిముఖో వేధాః**
**ప్రత్యువాచ దివౌకసః ॥ 16**

**పదవిభాగము:–** ఇతి, తేభ్యః, స్తుతీః, శ్రుత్వా, యథార్థాః, హృదయఙ్గమాః, ప్రసాదాభిముఖః, వేధాః, ప్రత్యువాచ, దివౌకసః.

**అన్వయక్రమము:–** వేధాః ఇతి తేభ్యః యథార్థాః హృదయఙ్గమాః స్తుతీః శ్రుత్వా ప్రసాదాభిముఖః దివౌకసః ప్రత్యువాచ।

**ప్రతిపదార్థము:–** వేధాః – బ్రహ్మదేవుడు, ఇతి – ఇట్లు, తేభ్యః – ఆ వేల్పులవలన యథార్థాః – సత్యములైనవి, హృదయఙ్గమాః – మనోహరములగు, స్తుతీః – నుతులను, శ్రుత్వా – విని, ప్రసాదాభిముఖః – అనుగ్రహాభిముఖుడై, దివౌకసః – దేవతలనుగూర్చి, ప్రత్యువాచ – ప్రత్యుత్తరము నిచ్చెను.

**తాత్పర్యము :–** బ్రహ్మదేవుడు, ఇట్లు ఆ వేల్పులవలన సత్యములైనవి మనోహరములగు నుతులను విని అనుగ్రహాభిముఖుడై, దేవతలనుగూర్చి ప్రత్యుత్తరమునిచ్చెను.

**విభక్తులు / క్రియులు:–** 1. వేధాః – **వేధాః,** వేధసౌ, వేధసః ; సకారాన్త పుంలింగ వేధశ్శబ్దము (ప్ర.ఏ) 2. ఇతి – అవ్యయము 3. తేభ్యః – తస్మై, తాభ్యామ్, **తేభ్యః** ; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము (చ.బ) 4. యథార్థాః – యథార్థామ్, యథార్థే, యధార్థాః ; ఆకారాన్త స్త్రీలింగ 'యథార్థా' శబ్దము (ది.బ) 5. స్తుతీః – స్తుతిమ్, స్తుతీ, **స్తుతీః** ; ఇకారాన్త స్త్రీలింగ స్తుతిశబ్దము (ద్వి.బ) 6. హృదయఙ్గమాః – హృదయఙ్గమామ్, హృదయఙ్గమే, **హృదయఙ్గమాః;** ఆకారాన్త స్త్రీలింగ 'హృదయఙ్గమా' శబ్దము. ద్వితీయావిభక్తి బహువచనము 7. శ్రుత్వా – అవ్యయము (కృదంతము) 8. ప్రసాదాభిముఖః – **ముఖః,** ముఖౌ, ముఖాః ; అకారాన్త పుంలింగ , ముఖ శబ్దము ప్ర.ఏ 9. దివౌకసః – దివౌకసమ్, దివౌకసౌ, **దివౌకసః** ; సకారాన్త పుంలింగ దివౌకస్ శబ్దము ద్వి.బ 10. ప్రత్యువాచ – ప్రతి+ ఉవాచ – క్రియ





**సమాసాలు:–**

1. హృదయఙ్గమాః – హృదయం గచ్ఛన్తీతి (ఉపపదతత్పు) తే।
2. ప్రసాదాభిముఖః – ప్రసాదేన అభిముఖః (తృతీయాతత్పు)

**సంధులు:–**

1. తేభ్యః + స్తుతీః – తేభ్యస్స్తుతీః – విసర్గసన్ధిః
2. స్తుతీః + శ్రుత్వా – స్తుతీశ్శ్రుత్వా – విసర్గసన్ధిః
3. యథార్థాః + హృదయఙ్గమాః – యథార్థా హృదయఙ్గమాః– విసర్గలోపసన్ధిః
4. ప్రసాదాభిముఖః + వేధాః – ప్రసాదాభిముఖో వేధాః – ఉత్త్వాదేశసన్ధిః
5. ప్రతి + ఉవాచ – ప్రత్యువాచ – యణాదేశసన్ధిః
6. ప్రసాద + అభిముఖః – ప్రసాదాభిముఖః – సవర్ణదీర్ఘసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. వేధాః –** ఎ) సకారాంతపుంలింగ వేధస్శబ్దము ప్రథమావిభక్తి ఏకవచనరూపము

బి) విదధాతీతి, వి+ధా+'విధాఞో వేధ చ' ఇతి అసి వేధాదేశశ్చ సోపసర్గధాతోః

సి) శ్లో॥ తం **వేధా** విదధే నూనం మహాభూతసమాధినా ।
తథా హి సర్వే తస్యాసన్ పరార్థైకఫలా గుణాః ॥ ర.వం. 1–29

"పంచమహాభూతములనే కారణసామాగ్రిగా చేసికొని **సృష్టికర్త,** ఆ మహారాజును సృష్టించియుండుననుట నిశ్చయము. ఏలయన ..."

డి) శ్లో॥ బ్రహ్మా స్రష్టా పరమేష్ఠీ ధాతా పద్మభూః సురజ్యేష్ఠః ।
**వేధా** విధిర్విరించో హిరణ్యగర్భః శతానన్దః ॥ 6

శ్లో॥ శమ్భుః స్వయమ్భూ ర్ద్రుహిణశ్చతుర్వక్త్రః ప్రజాపతిః ।
పితామహో జగత్కర్తా విరించిః కమలాసనః ॥ 7

అని హలాయుధకోశము **'వేధాః'** నామమునకు 20 నామములను అందించినది.

**క్రియాదర్శము:– ప్రత్యువాచ** – ప్రతి+ ఉవాచ – బ్రూఞ్ (బ్రూ) వ్యక్తాయాం వాచి (మాట్లాడుట) ద్వికర్మకమ్, సేట్, వచ్యాదేశే (ఉభయ) అనిట్. పరస్మైపదీ.
లిట్ ప్రథమపురుషరూపాలు:– **ఉవాచ** – ఊచతుః – ఊచుః

---

**అవతారక :–** అథ కవిరాహ। కవి చెప్పుచున్నాడు.

శ్లో॥ పురాణస్య కవేస్తస్య
చతుర్ముఖసమీరితా।
ప్రవృత్తిరాసీచ్ఛబ్దానాం
చరితార్థా చతుష్టయీ॥ **17**

**పదవిభాగము:–** పురాణస్య, కవేః, తస్య, చతుర్ముఖసమీరితా, ప్రవృత్తిః, ఆసీత్, శబ్దానామ్, చరితార్థా, చతుష్టయీ।

**అన్వయక్రమము:–** చతుష్టయీ శబ్దానామ్ ప్రవృత్తిః పురాణస్య కవేః తస్య చతుర్ముఖసమీరితా చరితార్థా ఆసీత్ ।

**ప్రతిపదార్థము:–** చతుష్టయీ – నాలుగు విధములైన, శబ్దానామ్ – మాటలయొక్క ప్రవృత్తిః – వ్యాపారము, పురాణస్య కవేః – పురాతనకవి ఐన, తస్య – ఆ బ్రహ్మ యొక్క, చతుర్ముఖసమీరితా – నాలుగు మోములచే పలుకబడినదై, చరితార్థా – సార్థకమయినది, ఆసీత్ – ఆయెను.

**తాత్పర్యము:–** నాలుగువిధములైన మాటలయొక్క వ్యాపారము, పురాతనకవి ఐన ఆ బ్రహ్మయొక్క నాలుగు మోములచే పలుకబడినదై సార్థకమయినది ఆయెను.

**విభక్తులు/క్రియలు:–** 1. చతుష్టయీ – **చతుష్టయీ**, చతుష్టయ్యౌ, చతుష్టయ్యః, ఈకారాన్త స్త్రీలింగ చతుష్టయీ శబ్దము, ప్రథమా విభక్తి ఏకవచనము. 2. శబ్దానామ్ – శబ్దస్య, శబ్దయోః, **శబ్దానామ్**, అకారాన్తపుంలింగ 'శబ్ద' శబ్దము. ష.బ. 3. ప్రవృత్తిః – **ప్రవత్తిః**, ప్రవృత్తీ, ప్రవృత్తయః, ఇకారాన్త స్త్రీలింగ ప్రవృత్తిశబ్దము. ప్ర.ఏ. 4. పురాణస్య – **పురాణస్య**, పురాణయోః, పురాణానామ్, అకారాన్త పుంలింగ పురాణ శబ్దము. ష.ఏ. 5. కవేః – **కవేః**, కవ్యోః, కవీనామ్, ఇకారాన్త పుంలింగ కవిశబ్దము. ష.ఏ 6. తస్య – **తస్య,** తయోః, తేషామ్, దకారాన్తపుంలింగ తచ్ఛబ్దము. ష.ఏ. 7. చతుర్ముఖసమీరితా – **సమీరితా**, సమీరితే, సమీరితాః, ఆకారాన్త స్త్రీలింగ సమీరితా శబ్దము, ప్ర.ఏ. 8. చరితార్థా – చరితార్థా, చరితార్థే, చరితార్థాః, ఆకారాన్త స్త్రీలింగ చరితార్థాశబ్దము. ప్ర.ఏ. 9. ఆసీత్ – క్రియ (లజ్ – ప్రథమ పురుషైకవచనమ్)

**సమాసాలు:–**

1. చతుర్ముఖసమీరితా – చతుర్ముఖేన సమీరితా (తృ.త)
2. చరితార్థా – చరితః, అర్థః, యస్యాః, (బహువ్రీహి) సా.

**సంధులు:–**

1. ప్రవృత్తిః + ఆసీత్ – ప్రవృత్తిరాసీత్ – విసర్గసన్ధిః
2. ఆసీత్ + శబ్దానామ్ – ఆసీచ్ఛబ్దానామ్ – ఛత్వమ్, (ఛకారాదేశః)



**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

1) **శబ్దానాం ప్రవృత్తిః**

ఎ) శ్లో॥ **వైఖరీ** శబ్దనిష్పత్తి **ర్మధ్యమా** శ్రుతిగోచరా।
ద్యోతితార్థా చ **పశ్యన్తీ సూక్ష్మా** వాగనపాయినీ॥

బి) శ్లో॥ **పరా** వాక్ మూలచక్రస్థా **పశ్యన్తీ** నాభిసంస్థితా।
హృదిస్థా **మధ్యమా** జ్ఞేయా **వైఖరీ** కంఠదేశగా॥
పరమలఘుమంజూషా

సి) శ్లో॥ **శాంతా**ధారపదస్థాస్మి పశ్యా రన్తీ చ నాభిజా।
**ప్రేరణీ** చ ధియాం మధ్యా సృష్టిః వక్త్రే తథార్ణసామ్॥
చతుః స్థానస్థితా చైవం శాన్తాపశ్యాదిభేదినీ॥
**లక్ష్మీతంత్రమ్** 50.82

'ధ్వని ఎ) ఉదరం మూలభాగంనుండి వెలువడేటప్పుడు **శాంతా** అనే పేరును కల్గినదై ఉంటుంది. అది శ్రీశబ్దంలో ఉండే శకారముయొక్క అర్థము. బి) నాభిదేశం నుండి వచ్చేటప్పుడు **'పశ్యా', 'రన్తీ'** అనే నామాలను కలిగినది. ఇది శకారానికి, రేఫకు, ఈ కారానికి అర్థము. సి) మధ్యస్థాన మనబడే కంఠదేశంనుండి వచ్చేటప్పుడు **ప్రేరణీ** అనే పేరును కల్గి ఉంటుంది. ఇది రేఫకు, ఈకారానికి అర్థము. డి) చివరగా ధ్వని నోటినుండి వెలువడేటప్పుడు **'సృష్టి'** అనే పేరును పొందినదై ఉంటుంది. ఇది ఇకారానికి అర్థమై ఉంటుంది.

ఈ అర్థాలన్నీ అక్షరసామ్యాలను బట్టి చెప్పబడ్డాయి. ఈ విధంగా శకారం, రేఫం, ఈ కారం అనే వీటికి విషయమై నాలుగు స్థానాలలో **శాంతా, పశ్యా, (రన్తీ) ప్రేరణీ, సృష్టి** నామాలను కల ధ్వని స్వరూపంగా ఉంటుంది. శ్రీ సూక్తములోని మూడవ మంత్రములోని 'శ్రీః' పదాన్ని – లక్ష్మీతంత్ర మీ విధంగా వ్యాఖ్యానించింది – శ్రీసూక్తవ్యాఖ్యానము

డి) Words are also of four kinds, those referring (1) ద్రవ్య–substance, as పృథ్వీ & C. (2) to గుణ– quality as శ్వేత & C (3) to కర్మన్– action as పాకః, గమనం & C and (4) to జాతి, species as a Brahmana, a cow & C.

ఇ) శ్లో॥ పురాణస్య కవేస్తస్య – వర్ణస్థానసమీరితా।
బభూవ కృతసంస్కారా – చరితార్థైవ భారతీ॥ రఘువంశమ్ 10–36

"సనాతనుడైన కవియగు విష్ణువుయొక్క గంభీరమైన కంఠమునుండి,

వెలువడినదియును, **ధ్వని, వర్ణ, పద, వాక్యములయందు** చక్కని సంస్కారమును పొందినదియును అగు భారతి (మాట) కృతార్థమైనది.

**అక్షరములు వర్ణోత్పత్తిస్థానములనుండి సక్రమముగా ఉచ్చరింపబడుటవలన, ఆ మాటకు సంస్కారము వచ్చును.**

ఆ వర్ణోత్పత్తి స్థానములు '8' ఉన్నవని 'పాణిని' మహర్షి ఇట్లు పేర్కొనినాడు.

శ్లో॥ అష్టౌ స్థానాని వర్ణానామురః కంఠః శిరస్తథా।
జిహ్వామూలఞ్చ దన్తాశ్చ నాసికోౢష్ఠౌ చ తాలు చ॥

యఫ్) ఈ శ్లోకమున బ్రహ్మదేవునకు 'పురాణకవి' అను పదమును ప్రయోగించుట వలన కవి శబ్దమునకున్న మహత్వము స్పష్టము చేయబడినది.

**క్రియాదర్శము:-** **ఆసీత్** : అస (అస్) భువి (ఉండుట) అదాది ప్రకరణమ్(2). అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లఙ్ ప్రథమపురుషైకవచనమ్.

ప్రథమపురుషరూపాలు :- **ఆసీత్** - ఆస్తామ్ - ఆసన్

**అలంకారము:-** ఇట 'అనుప్రాస' చెప్పదగును.

---

**శ్లో॥ స్వాగతం స్వానధీకారాన్**
**ప్రభావైరవలమ్బ్య వః ।**
**యుగపద్యుగబాహుభ్యః**
**ప్రాప్తేభ్యః ప్రాజ్యవిక్రమాః ॥ 18**

**పదవిభాగము:-** స్వాగతమ్, స్వాన్, అధీకారాన్, ప్రభావైః, అవలంబ్య, వః, యుగపత్, యుగబాహుభ్యః, ప్రాప్తేభ్యః, ప్రాజ్యవిక్రమా ః।

**అన్వయక్రమము:-** ప్రాజ్యవిక్రమాః ! స్వాన్ అధీకారాన్ ప్రభావైః అవలంబ్య యుగపత్ ప్రాప్తేభ్యః యుగబాహుభ్యః వః స్వాగతమ్ ।

**ప్రతిపదార్థము:-** ప్రాజ్యవిక్రమాః !- మిక్కుటమైన పరాక్రమముగల ఓ దేవతలారా!, స్వాన్ - మీవయిన, అధీకారాన్ - అధికారములను, ప్రభావై ః - సామర్థ్యములచేత అవలంబ్య - వహించి, యుగపత్ - ఒక్కుమ్మడిగా, ప్రాప్తేభ్య ః - వచ్చినట్టి, యుగబాహుభ్యః - ఆజానుబాహులగు, వ ః - మీకు (రు) కొఱకు, స్వాగతమ్ - స్వాగతము.

25



**తాత్పర్యము:-** మిక్కుటమగు పరాక్రమముగల ఓ దేవతలారా! మీవయిన అధికారములను సామర్థ్యములచేత వహించి ఒక్కుమ్మడిగా వచ్చినట్టి ఆజానుబాహులగు మీకు స్వాగతము అగుగాక !

**విభక్తులు / క్రియలు :-** 1. ప్రాజ్యవిక్రమాః - హే ప్రాజ్యవిక్రమః ; హే ప్రాజ్య విక్రమౌ, హే **ప్రాజ్యవిక్రమాః** ; అకారాన్త పుంలింగ విక్రమ శబ్దము. సంబోధన ప్రథమావిభక్తి బహువచనము 2. స్వాన్ - స్వమ్, స్వౌ, **స్వాన్**, అకారాన్త పుంలింగ'స్వ' శబ్దము. ద్వితీయావిభక్తి బహువచనము 3. అధీకారాన్ - అధీకారమ్, అధీకారౌ,అధీకారాన్. అకారాన్త పుంలింగ అధీకార శబ్దము. ద్వితీయావిభక్తి బహువచనము 4. ప్రభావైః - ప్రభావేణ, ప్రభావాభ్యామ్, **ప్రభావైః,** అకారాన్త పుంలింగ ప్రభావ శబ్దము, తృతీయా విభక్తి బహువచనము 5. అవలంబ్య - ల్యబన్తము (అవ్యయము) (అవ+లమ్బ్+క్త్వా) 6. యుగపత్ - అవ్యయము 7. ప్రాప్తేభ్యః - ప్రాప్తాయ - ప్రాప్తాభ్యామ్, ప్రాప్తేభ్యః ; అకారాన్త పుంలింగ ప్రాప్తశబ్దము. చ.బ 8. యుగబాహుభ్యః - యుగబాహవే, యుగబాహుభ్యామ్, **యుగబాహుభ్యః**, ఉకారాన్త పుంలింగ యుగబాహుశబ్దము. చ.బ 9. వః- తుభ్యమ్ / తే, యువాభ్యామ్ / వామ్, **యుష్మభ్యమ్ / వః**, దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, చతుర్థీ విభక్తి బహువచనము 10. స్వాగతమ్ - స్వాగతమ్, స్వాగతే, స్వాగతాని; అకారాన్త నపుంసకలింగ స్వాగత శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :-**

1. ప్రాజ్యవిక్రమాః - ప్రాజ్యః విక్రమః యేషామ్ (బహువ్రీహి) తే.
2. యుగబాహుభ్యః - యుగౌ ఇవ బాహూ యేషాం (బహువ్రీహి) తే యుగబాహవః, తేభ్యః.

**సంధులు:-**

1. ప్రభావైః+అవలంబ్య - ప్రభావైరవలంబ్య - విసర్గసంధిః
2. యుగపత్ + యుగబాహుభ్యః - యుగపద్యుగబాహుభ్యః - జశ్త్వసంధిః

**పదవ్యుత్పత్తి - నిఘంటు ప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

1. యుగపత్ - అవ్యయకోషః(675)

ఎ) 'ఏకకాలే' ఇత్యర్థః

బి) శ్లో॥ తద్వల్గునా **యుగపదు**న్మిషితేన తావత్
సద్యః పరస్పరతులామధిరోహతాం ద్వే ।
ప్రస్పన్దమానపరుషేతరతారమన్త -
శ్చక్షుస్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్ ॥ ర.వం. 5-68

'లోపల కదులుచున్న నల్లగుడ్డు కల నీ కన్నును, అంతర్భాగమున కదిలియాడు

తుమ్మెదలుగల పద్మమును, రెండును **ఒకేసారి** విచ్చుకొనుటచేత అవి పరస్పర సాదృశ్యమును పొందునుగాక.

శ్లో॥ నిర్వృష్టలఘుభిర్మేఘైః ముక్తవర్త్మా సుదుస్సహః ।
ప్రతాపస్తస్య భానోశ్చ **యుగపద్వ్యానశే** దిశః । ర.వం. 4-15

"....రఘుమహారాజు ప్రతాపమును, సూర్యతేజస్సును **ఒకేసారిగా** దిక్కుల యంతటను వ్యాపించెను"

సి) క్రియాసమభిహారేఽపి క్వచిదర్థః – 'యుగపజ్జ్ఞానానుత్పత్తిర్మనసో లిఙ్గమ్' (న్యాయసూత్రమ్ 1-1-16) ఉపదేశే తవర్గతృతీయాన్తోఽయమ్ । అన్యథా 'యౌగపద్యమ్' ఇత్యత్ర దకారో న శ్రూయేత ।

**2) అధికార** – (అధి 'కృ') పుంలింగము, duty అని పేర్కొంటూ ఈ శ్లోకాన్నే ఉదాహరించినది. S.H.E. Dictonary. (అకారాన్త) అజన్తపుంలింగవిశేషశబ్దముగ గ్రహింపవలయును.

'ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహులమ్' (సూ. 6.3.122)
ఉపసర్గస్య బహులం దీర్ఘః స్యాత్ ఘఞన్తే పరే న తు మనుష్యే ।
పరీపాకః । పరిపాకః । అమనుష్యే కిమ్ । నిషాదః

ఈ సూత్రమునకు సంబంధించి మఱిన్ని వివరములకు 'పాణిని సూత్రవ్యాఖ్యా' చూడగలరు. ఈ శ్లోకమునే ఉదాహరణగా చూపుట గమనించదగినది.

---

**అవతారికా :–** దేవానాం దుఃఖకారణం బ్రహ్మా పృచ్ఛతి ।
దేవతల దుఃఖమునకు కారణమును బ్రహ్మదేవు డడుగుట.

**శ్లో॥ కిమిదం ద్యుతిమాత్మీయాం**
**న బిభ్రతి యథా పురా।**
**హిమక్లిష్టప్రకాశాని**
**జ్యోతీంషీవ ముఖాని వః ॥ 19**

**పదవిభాగము:–** కిమ్, ఇదమ్, ద్యుతిమ్, ఆత్మీయామ్, న, బిభ్రతి, యథా, పురా, హిమక్లిష్టప్రకాశాని, జ్యోతీంషి, ఇవ, ముఖాని, వః .

**అన్వయక్రమము:–** (హే దేవాః) హిమక్లిష్టప్రకాశాని జ్యోతీంషి ఇవ వః ముఖాని పురా యథా ఆత్మీయాం ద్యుతిం న బిభ్రతి ఇదమ్ కిమ్ ?





**ప్రతిపదార్థము:–** (హే దేవాః – ఓ దేవతలారా !)హిమక్లిష్టప్రకాశాని – మంచుచేత మసకబారిన కాంతులుగల, జ్యోతీంషి + ఇవ– నక్షత్రములవలె, వః – మీయొక్క, ముఖాని – ముఖములు, పురా యథా – మునుపటివలె, ఆత్మీయామ్ – తమ తమ, ద్యుతిమ్ – కాన్తిని, న బిభ్రతి – తాల్పవు, ఇదమ్ కిమ్ – ఇది యేమి ?

**తాత్పర్యము :–** (ఓ దేవతలారా!) మంచుచేత మసకబారిన కాంతులు గల నక్షత్రములవలె మీయొక్క ముఖములు మునుపటివలె తమ తమ కాన్తిని తాల్పవు. ఇది యేమి?

**విభక్తులు / క్రియలు :–** 1. హిమక్లిష్టప్రకాశాని – ప్రకాశమ్, ప్రకాశే, **ప్రకాశాని** ; అకారాన్త నపుంసకలింగ హిమక్లిష్టప్రకాశ శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము 2. జ్యోతీంషి – జ్యోతిః, జ్యోతిషీ, **జ్యోతీంషి** ; షాన్తో నపుంసకలింగే జ్యోతిష్ శబ్దః – ప్రథమావిభక్తి బహువచనము 3. వః – తవ / తే – యువయోః / వామ్, **యుష్మాకమ్ / వః**, దకారాన్త పుంలింగయుష్మచ్ఛబ్దము. ష.ఏ. 4. ఇవ, పురా, యథా, ఇదమ్, కిమ్, న – అవ్యయాలు, 5. ముఖాని – ముఖమ్, ముఖే, **ముఖాని**, అకారాన్త నపుంసకలింగముఖశబ్దము ప్ర.ఏ. 6. ఆత్మీయామ్ – **ఆత్మీయామ్,** ఆత్మీయే, ఆత్మీయాః, ఆకారాన్త స్త్రీలింగ ఆత్మీయాశబ్దము. ద్వి.ఏ. 7. ద్యుతిమ్ – **ద్యుతిమ్,** ద్యుతీ, ద్యుతీః ఇకారాన్త స్త్రీలింగద్యుతిశబ్దము, ద్వి.ఏ. 8. బిభ్రతి–క్రియ (భృ+లట్) ప్ర. బహువచనము.

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు– కావ్యప్రయోగాలు**

**1. జ్యోతీంషి –** ఏ) 'దీప్తితారాహుతాశేషు జ్యోతిః' ఇతి శాశ్వతః (సంజీవనీ వ్యాఖ్యా) జ్యోతిర్ఖద్యోతదృష్టిషు' అని అమరమున్ను.

బి) **జ్యోతిః**– సకారాంత నపుంసకలింగము నక్షత్రమ్,

సి) ద్యుత్ దీప్తౌ + **'ద్యుతేరిసన్నాదేశ్చ జః'** ఇతి ఇసన్ దస్య చ జః।

డి) 'జ్యోతీంష్యగ్నిఞ్చామేధ్యమశంస్తఞ్చ నాభివీక్షేత' – ఇతి చరకే.

సి) జ్యోతిః – పుంలింగమున, ద్యుత్+కర్తరి ఇసన్ అగ్నిః

శ్లో॥ తస్యాన్తరేణ నాభేస్తు జ్యోతిఃస్థానం ధ్రువం స్మృతమ్।
తథా ధమతి వాతస్తు దేహస్తేనాస్య వర్ధతే॥ –ఇతి సుశ్రుతే

యఫ్) శ్లో॥ భం నక్షత్రం తారకం తారకా చ
**జ్యోతి**స్తారా ధిష్ణ్యమృక్షం తథోడు।
అని హలాయుధకోశము '9' నామములను పేర్కొన్నది.

జి) శ్లో॥ సాసమ్భవద్భిః కుసుమైర్లతేవ
**జ్యోతిర్భి**రుద్యద్భిరివ త్రియామా।

సరిద్విహఙ్గైరివ లీయమానై–
రాముచ్యమానాభరణా చకాశే॥ – కు.సం.7–21

“ఆభరణములను ధరించుచున్న పార్వతీదేవి, పూచుచున్న పూవులతో లతవలెను, **ఉదయించుచున్న తారకలతో రాత్రి వలెను,** ఆశ్రయించియున్న చక్రవాకపక్షులతో నదివలెను ప్రకాశించెను.

**క్రియాదర్శము:– బిభ్రతి** – డుభృఞ్ (భృ) ధారణపోషణయోః (ధరించుట, పోషించుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, లట్, జుహోత్యాది ప్రకరణమ్ (3), ప్రథమపురుషరూపాలు – బిభర్తి – బిభృతః–**బిభ్రతి**

శ్లో॥ ....బిభర్తి ధృతిపోషయోః॥
తయోర్ధధాతి దానే చాభిదధాత్యుక్తిబన్ధయోః।
శ్రద్దధాతి తు విస్రమ్భస్పృహయోః **పంచ** చాత్మనే॥ 112

అని ‘ఆఖ్యాతచన్ద్రికా’ పేర్కొన్నది.

శ్లో॥... తామేకతస్తవ బిభర్తి గురుర్వినిద్రః
తస్యా భవానపరధుర్యపదావలంబీ। ర.వం. 5–66

“....ఆ జగద్భారమును ఒకతట్టు నీయొక్క తండ్రి జాగరూకుడైన వాడగుచు ధరించుచున్నాడు...”

---

**అవతారికా:–** ఉక్తమేవ ప్రపంచయతి సప్తభిః శ్లోకైః–చెప్పినమాటనే మఱియేడు శ్లోకములతో విస్తరించుచున్నాడు. 27

**శ్లో॥ ప్రశమాదర్చిషామేత –**
**దనుద్గీర్ణసురాయుధమ్ ।**
**వృత్రస్య హన్తుః కులిశం**
**కుణ్ఠితాశ్రీవ లక్ష్యతే॥ 20**

**పదవిభాగము:–** ప్రశమాత్, అర్చిషామ్, ఏతత్, అనుద్గీర్ణసురాయుధమ్, వృత్రస్య, హన్తుః, కులిశమ్, కుణ్ఠితాశ్రి, ఇవ, లక్ష్యతే.

**అన్వయక్రమము:–** అర్చిషామ్ ప్రశమాత్ అనుద్గీర్ణసురాయుధం వృత్రస్య హన్తుః ఏతత్ కులిశమ్ కుణ్ఠితాశ్రి ఇవ లక్ష్యతే ।



**ప్రతిపదార్థము:–** అర్చిషామ్ – తేజస్సులయొక్క, ప్రశమాత్ – ఆఱుటచేత, అనుద్గీర్ణసురాయుధమ్ – ప్రకటముకాని సురాయుధము, వృత్రస్య – వృత్రాసురుని యొక్క, హన్తుః – వధించిన యింద్రునియొక్క, ఏతత్ కులిశమ్–ఈ వజ్రాయుధము కుణ్ఠిత+అశ్రి+ఇవ – మొక్క వోయిన మొనగలుగలదివలె, లక్ష్యతే – అగపడు చున్నది.

**తాత్పర్యము :–** తేజస్సులు ఆఱుటచేత ప్రకటముకాని సురాయుధము, వృత్రాసురుని వధించిన యింద్రునియొక్క వజ్రాయుధము మొక్కవోయిన మొనలుగలదివలె అగుపడుచున్నది.

**విభక్తులు/క్రియలు:–** 1. అర్చిషామ్–అర్చిషః, అర్చిషోః, **అర్చిషామ్,** షకారాన్త నపుంసకలింగ అర్చిస్ శబ్దము. ష.బ. 2. ప్రశమాత్ – **ప్రశమాత్,** ప్రశమాభ్యామ్, ప్రశమేభ్యః, అకారాన్త పుంలింగ ప్రశమ శబ్దము పంచమీ విభక్తి ఏకవచనము 3. అనుద్గీర్ణసురాయుధమ్ – **ఆయుధమ్,** ఆయుధే, ఆయుధాని – అకారాన్త నపుంసకలింగ ఆయుధశబ్దము. ప్ర.ఏ. 4. వృత్రస్య – **వృత్రస్య,** వృత్రయోః వృత్రాణామ్, అకారాన్త పుంలింగ వృత్రశబ్దము. ష.ఏ. 5. హన్తుః – **హన్తుః,** హన్త్రోః, హన్తౄణామ్, ఋకారాన్త పుంలింగ హన్తృశబ్దము. ష.ఏ. 6. కులిశమ్ – **కులిశమ్**, కులిశే, కులిశాని, అకారాన్తనపుంసకలింగ కులిశశబ్దము. ప్ర.ఏ. 7. కుణ్ఠితాశ్రి – **కుణ్ఠితాశ్రి**, కుణ్ఠితాశ్రిణీ,కుణ్ఠితాశ్రీణి కుణ్ఠిత్మాణి, ఇకారాన్త నపుంసకలింగ కుణ్ఠితాశ్రి శబ్దము, ప్ర.ఏ. 8. ఇవ –అవ్యయము 9. లక్ష్యతే – క్రియ (కర్మణి) లక్ష్+య+లట్ – ప్రథమ పురుషైకవచనమ్.

**సమాసాలు :–**

1. అనుద్గీర్ణసురాయుధమ్– సురాణామ్ ఆయుధమ్ (ష.త) సురాయుధమ్. న ఉద్గీర్ణమ్– అనుద్గీర్ణమ్ (నఞ్తత్పు) అనుద్గీర్ణం సురాయుధమ్ (వి.పూ.క) తత్.
2. కుణ్ఠితాశ్రి – కుణ్ఠితాః అశ్రయః యస్య (బహువ్రీహి) తత్.

**సంధులు:–**

1. ప్రశమాత్ + అర్చిషామ్– ప్రశమాదర్చిషామ్ – జశ్త్వసంధిః
2. ఏతత్ + అనుద్గీర్ణ – ఏతదనుద్గీర్ణ – జశ్త్వసంధిః
3. కుణ్ఠిత + అశ్రి – కుణ్ఠితాశ్రి– సవర్ణదీర్ఘసంధిః
4. అశ్రి + ఇవ – అశ్రీవ – సవర్ణదీర్ఘసంధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. వృత్రస్య – హన్తుః ।** వృత్రః – ఎ)వృత్ + ‘స్ఫాయితఞ్చిఇచ్చీతి’ రక్, ‘త్వాష్ట్రః’,

దానవ విశేషః స తు త్వష్టృపుత్రః ఇంద్రేణ హతః

బి) 'త్వాష్ట్రే తమసి శత్రౌ చ వృత్రశబ్దస్త్రిషు స్మృతః' । హ.కో.

సి) శ్లో॥ తథా వృత్రవధే ప్రాప్తే సాహాయ్యార్థం వృతో మయా ।'

– ఇతి హరివంశే ( 127–17)

డి) 'వృత్రో రిపౌ ధ్వనౌ ధ్వాన్తే శైలే చక్రే చ దానవే' – పాణినిసూత్రవ్యాఖ్యా

ఉణాదిప్రకరణమ్ పేజి 425

ఇ) శ్లో॥ కంపేన మూర్ధ్నశ్శతపత్రయోనిం
వాచా హరిం, **వృత్రహణం** స్మితేన ।
ఆలోకమాత్రేణ సురానశేషాన్
సంభావయామాస యథాప్రధానమ్ ॥ కు.సం. 7–46.

'ఆ **శివుడు** పద్మోద్భవుడైన బ్రహ్మను తలయూచుటచేతను, హరిని మాట చేతను, **ఇంద్రుని** నవ్వుచేతను, తక్కిన దేవతలను తన చూపుతోను యథాప్రధానముగా గౌరవించెను.'

**ఎఫ్) వృత్రాసురుడు – ఇంద్రుడు – బ్రహ్మదేవుడు – విష్ణువు – శివుడు – సనత్కుమారుడు** త్వష్ట ప్రజాపతిచే హోమగుండమునుండి పుట్టింపబడినవాడు. త్వష్ట సృజించిన విశ్వరూపుని నింద్రుడు సంహరించుటచే నింద్రుని సంహరించుటకై త్వష్ట వీనిని సృజించెను. **వృత్రాసురుడు బ్రహ్మదేవుని** ప్రార్థించి రాత్రిగాని, పగలుగాని, జీవముండిన వానిచే గాని, జీవములేనివానిచే గాని తనకు మరణము లేకుండునట్లు వరమును వేడెను. బ్రహ్మ యావరము నొసంగెను. ఇతనితో **ఇంద్రుడు** యుద్ధముచేసి ఓడి పారిపోయి **విష్ణువు**ను శరణువేడెను. సమయము వచ్చినపుడు ఇతనిని ఉపాయముచే కొట్టవలయును. అంతవరకు అతనితో స్నేహముగ నుండుమనియు విష్ణువు ఇంద్రునితో చెప్పెను. వృత్రునకు ఇంద్రునకు మునులే చెలిమిచేసిరి. వృత్రుడు ఇంద్రుని నమ్మియే యుండెను. వృత్రాసురునిబలము యుద్ధమునందు మించుచుండెను. మునులును, దేవతలును **శివుని** ప్రార్థించిరి. వృత్రునిబలము మించుటకు గారణము 'ఇరువది వేలేండ్లు బ్రహ్మనుగూర్చి తపస్సుచేయుటచే వచ్చినది' అని చెప్పి, అయినను నాచే నతనిశక్తియంతయు ఉడుగునని శివుడు చెప్పెను. అంత వాని తేజము జ్వరమై వృత్రుని తాకెను. అప్పుడింద్రుడు వానిని వజ్రాయుధముతో గొట్టెను. వృత్రుడు జవసత్వములుడిగి యుండెను. ఇట్లు వృత్రుడు ఓడియున్నప్పుడు శుక్రుడు వచ్చి 'నీవు ఓడియును అచలితుడవై యుంటివేల'





యని యడిగెను. 'కలిమిలేములు కాలవశంగతములు..... నాకా విచారములే'దనెను. అతనిని పరీక్ష చేయుటకు శుక్రుడు వాదించెను. కాని తనకే కోరిక లేదనియు, యుద్ధములో విష్ణువును జూచితిననియును, వాని మహిమను చెప్పి వానిని కనుమార్గమును తెలుపుమని కోరెను. అప్పుడే యక్కడకు **సనత్కుమారుడు** వచ్చెను. విష్ణుమాహాత్మ్యమును చెప్పుమని శుక్రుడు కోరెను. సనత్కుమారుడు చెప్పెను. **వృత్రుడు ప్రాణములు విడిచి యనంతుని చేరెను.** ఇంద్రునకు వృత్రుని చంపినందన 'బ్రహ్మహత్యామహాపాతకము' కలిగినది. – పూర్వగాథాలహరి. మహాభారతమునందలి ఈ గాథయొక్క 'ప్రతీకత'ను పెద్దలనుండి గ్రహింతురుగాక.

**క్రియాదర్శము:– లక్ష్యతే – (కర్మణి)** – లక్ష్ దర్శనాఙ్కనయోః – చురాదయః (10) సకర్మకమ్, సేట్, ఉభయపదీ లట్ లక్ష్యతి – లక్ష్యతే.

ప్రథమపురుషరూపాలు – లక్ష్యతి – లక్ష్యతః – లక్ష్యన్తి

**లక్ష్యతే** – లక్ష్యేతే – లక్ష్యన్తే

**అలంకారము:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

---

**అవతారికా :–** వరుణస్యావస్థామాహ – వరుణుని అవస్థ చెప్పుచున్నాడు.

**శ్లో॥ కిఞ్చాయమరిదుర్వారః
పాణౌ పాశః ప్రచేతసః ।
మన్త్రేణ హతవీర్యస్య
ఫణినో దైన్యమాశ్రితః ॥** **21**

**పదవిభాగము:–** కిమ్, చ, అయమ్, అరిదుర్వారః, పాణౌ, పాశః, ప్రచేతసః । మన్త్రేణ, హతవీర్యస్య, ఫణినః, దైన్యమ్, ఆశ్రితః ।

**అన్వయక్రమము:–** కిఞ్చ అరిదుర్వారః ప్రచేతసః పాణౌ అయమ్ పాశః మన్త్రేణ హతవీర్యస్య ఫణినః దైన్యమ్ ఆశ్రితః ।

**ప్రతిపదార్థము:–** కిఞ్చ – మఱియు, అరిదుర్వారః – శత్రువులకు వారింపరాని, ప్రచేతసః – వరుణునియొక్క, పాణౌ – చేతియందలి, అయమ్ పాశః – ఈ త్రాడు, మన్త్రేణ – గారుడమంత్రముచేత, హతవీర్యస్య – అణచబడిన శక్తిగలదైన ఫణినః – పాముయొక్క, దైన్యమ్– దిల్లతనమును, ఆశ్రితః – వహించియున్నది.

**తాత్పర్యము:–** మఱియు, శత్రువులకు వారింపరాని వరుణినియొక్క చేతియందలి ఈ త్రాడు గారుడమంత్రముచేత అణచబడిన శక్తిగలదైన పాముయొక్క డిల్లతనమును వహించియున్నది.

**విభక్తులు / క్రియలు :–** 1. కిఞ్చ – అవ్యయము 2. అరిదుర్వారః – **అరిదుర్వారః, అరిదుర్వారౌ, అరిదుర్వారాః**, అకారాన్త పుంలింగ అరిదుర్వార శబ్దము. ప్ర.ఏ 3. ప్రచేతసః – **ప్రచేతసః**, ప్రచేతసోః, ప్రచేతసామ్, సకారాన్త పుంలింగ ప్రచేతశ్శబ్దము ష.ఏ 4. పాణౌ – **పాణౌ**, పాణ్యోః, పాణిషు, ఇకారాన్త పుంలింగ పాణిశబ్దము. స.విభక్తి ఏకవచనము 5. పాశః – పాశః, పాశౌ, పాశాః – అకారాన్త పుంలింగ పాశశబ్దము. ప్ర.ఏ 6. మన్త్రేణ – **మన్త్రేణ**, మన్త్రాభ్యామ్, మన్త్రైః అకారాన్త పుంలింగ మన్త్రశబ్దము తృ.ఏ 7. హతవీర్యస్య – **హతవీర్యస్య** – హతవీర్యయోః, హతవీర్యాణామ్, అకారాన్త పుంలింగ హతవీర్య శబ్దము. ష.ఏ 8. ఫణినః – **ఫణినః, ఫణినోః**, ఫణినామ్, నకారాన్త పుంలింగ ఫణిన్ శబ్దము ష.ఏ 9. దైన్యమ్ – **దైన్యమ్,** దైన్యే, దైన్యాని, అకారాన్త నపుంసకలింగ దైన్యశబ్దము. ద్వి.వి.ఏకవచనము 10. ఆశ్రితః – ఆశ్రితః, అశ్రితౌ, ఆశ్రితాః, అకారాన్త పుంలింగ ఆశ్రితశబ్దము. ప్ర.ఏ

**సమాసాలు:–**

1. అరిదుర్వారః – అరిభిః దుర్వారః (తృ.త)
2. హతవీర్యస్య – హతం వీర్యం యస్య (బహుబ్రీహి) సః, హతవీర్యః తస్య

**సంధులు:–**

1. ఫణినః + దైన్యమ్ – ఫణినో దైన్యమ్ – ఉత్వాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

1. మన్త్రేణ ఈ శ్లోకఉత్తరార్ధమున 'గారుడమంత్రముచే కట్టబడిన పాముయొక్క డిల్లతనమును వహించియున్న'దని వరుణినిపాశము చెప్పబడినది. ఇట శ్రీ వేదాంతదేశికులవారి **గరుడదండకము**ను అనుసంధానము చేసికొనదగును.

**గరుడ దండకము**

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది।
నమః పన్నగనద్ధాయ వైకుంఠవశవర్తినే ।
శ్రుతిసింధుసుధోత్పాదమందరాయ గరుత్మతే ॥

1. గరుడ మఖిలవేదనీడాధిరూఢం, ద్విషత్పీడనోత్కంఠితాకుంఠవైకుంఠ పీఠీకృతస్కంధ మీడే స్వనీడాగతిప్రీతరుద్రాసుకీర్తి స్తనాభోగగాఢోపగూఢం, స్ఫురత్కంటకవ్రాతవేధవ్యథా వేపమానద్విజిహ్వాధిపాకల్పవిష్ఫార్యమాణ స్ఫటావాటికా రత్నరోచిశ్ఛటారాజినీరాజితం, కాంతికల్లోలినీరాజితమ్.

2. జయ గరుడ !, సువర్ణ !, దర్వీకరాహార!, దేవాధిపాహారహారిన్ !, దివౌకస్పతిక్షిప్త దంభోళిధారాకణాకల్ప ! కల్పాంతవాతూలకల్పోదయానల్ప వీరాయితో ద్యచ్చమత్కార! దైత్యారిజైత్రధ్వజారోహనిర్ధారితోత్కర్ష ! సంకర్షణాత్మన్ ! గరుత్మన్ ! మరుత్పంచకాధీశ ! సత్యాదిమూర్తే! న కశ్చిత్ సమస్తే నమ స్తే పున స్తే నమః

3. నమ ఇద మజహత్సపర్యాయ, పర్యాయనిర్యాత పక్షానిలాస్ఫాలనో ద్వేలపాథో వీచీచపేటాహతాగాధపాతాళ భాంకారసంక్రుద్ధ నాగేంద్ర పీడాసృణీ భావ భాస్వన్నఖ శ్రేణయే, చండతుండాయ, నృత్యద్భుజంగభ్రువే, వజ్రిణే దంష్ట్రయా, తుభ్య మధ్యాత్మవిద్యా విధేయా విధేయా భవద్దాస్య మాపాదయేథాః దయేథాశ్చ మే.

4. మనురనుగతపక్షివక్త్రస్ఫురత్తారక స్తావక శ్చిత్రభానుప్రియాశేఖర స్త్రాయతాం న స్త్రివర్గాపవర్గప్రసూతిః పరవ్యోమధామన్ ! బలద్వేషి దర్పజ్వలద్వాల ఖిల్య ప్రతిజ్ఞావతీర్ణ! స్థిరాం తత్త్వబుద్ధిం పరాం భక్తిధేనుం జగన్మూలకందే ముకుందే మహానందదోగ్ధ్రీం దధీథా ముధాకామహీనా మహీనా మహీనాంతక !

షట్త్రింశత్గణచరణో నరపరిపాటీనవీనగుంభగుణః ।
విష్ణురథదండకోఽసౌ విఘయతు విపక్షవాహినీ వ్యూహమ్ ॥
విచిత్ర సిద్ధిద స్సోఽయం వేంకటేశవిపశ్చితా ।
గరుడధ్వజతోషాయ గీతో గరుడదండకః ॥

దీనికి డా॥ ఇ.ఎ. శింగరాచార్యులు, తిరుపతి వారు చేసిన హృద్యార్థదీపికా వ్యాఖ్యను కూడా చూడగలరు.

**అలంకారములు:–**

అత్ర ఫణినిష్ఠదైన్యస్య పాశేఽసంభవాద్ దైన్యమివ దైన్యమితి కల్పనాత్ అసమ్భవద్వస్తుసమ్బన్ధో నిదర్శనాలంకారః। తల్లక్షణం యథా సాహిత్య దర్పణే 10–51

శ్లో॥ సమ్భవన్వస్తుసంబంధోఽసమ్భవన్వాపి కుత్రచిత్।
యత్ర బింబానుబిమ్బత్వం బోధయే త్సా నిదర్శనా ॥ ఇతి

"ఇట వరుణుని పాశము, మంత్రించిన సర్పముయొక్క దైన్యసదృశముగా దైన్యమును వహించియున్నదని వర్ణింపబడుటచే, నిది 'నిదర్శనాలంకారము'గా చెప్పదగును.

**అవతారికా :–** అథ కుబేరస్యావస్థామాహ । – పిమ్మట కుబేరుని అవస్థను చెప్పుచున్నాడు.

**శ్లో॥ కుబేరస్య మనశ్శల్యం**
**శంసతీవ పరాభవమ్ ।**
**అపవిద్ధగదో బాహు –**
**ర్భగ్నశాఖ ఇవ ద్రుమః ॥ 22**

**పదవిభాగము:–** కుబేరస్య, మనశ్శల్యమ్, శంసతి, ఇవ, పరాభవమ్, అపవిద్ధగదః బాహుః, భగ్నశాఖః, ఇవ, ద్రుమః.

**అన్వయక్రమము:–** అపవిద్ధగదః భగ్నశాఖః ద్రుమః ఇవ (స్థితః) కుబేరస్య బాహుః మనఃశల్యమ్ పరాభవం శంసతి ఇవ.

**ప్రతిపదార్థము:–** అపవిద్ధగదః – విడిచిపెట్టబడిన గద గలది( అందువలననే), భగ్నశాఖః – విఱిగిన కొమ్మగలదైన, ద్రుమః+ఇవ – వృక్షమువలె, (స్థితః – ఉన్న,) కుబేరస్య – కుబేరునియొక్క, బాహుః – భుజము, మనఃశల్యమ్ – మనస్సునకు బాణమువలెనున్న, పరాభవమ్ – అవమానమును, శంసతి + ఇవ – చెప్పుచున్నట్లున్నది.

**తాత్పర్యము:–** విడిచిపెట్టబడిన గదగలది కనుకనే విఱిగిన కొమ్మగలదైన వృక్షమువలెనున్న కుబేరునియొక్క భుజము మనస్సునకు బాణమువలెనున్న అవమానమును చెప్పుచున్నట్లున్నది.

**విభక్తులు / క్రియలు :–** 1. అపవిద్ధగదః – **గదః,** గదౌ,గదాః – అకారాన్త పుంలింగ.... గద శబ్దము ప్ర.ఏ. 2. భగ్నశాఖః – **భగ్నశాఖః** , భగ్నశాఖౌ, భగ్నశాఖాః , అకారాన్త పుంలింగ భగ్నశాఖ శబ్దము ప్ర.ఏ 3. ద్రుమః – **ద్రుమః** , ద్రుమౌ, ద్రుమాః , అకారాన్త పుంలింగ ద్రుమశబ్దము ప్ర.ఏ 4. కుబేరస్య – **కుబేరస్య,** కుబేరయోః , కుబేరాణామ్, అకారాన్త పుంలింగ కుబేర శబ్దము ష.ఏ 5. బాహుః – **బాహుః** , బాహూ, బాహవః , ఉకారాన్త పుంలింగ బాహుశబ్దము ప్ర.ఏ 6. మనఃశల్యమ్ – **మనఃశల్యమ్,** మనఃశల్యే, మనఃశల్యాని, అకారాన్త నపుంసకలింగ మనఃశల్యశబ్దము ద్వి. ఏ 7. పరాభవమ్– **పరాభవమ్,** పరాభవే, పరాభవాని, అకారాన్త నపుంసకలింగ పరాభవశబ్దము ద్వి.ఏ 8. శంసతి – క్రియ లట్ – ప్రథమపురుషైకవచనమ్ ।

**సమాసాలు :–**

1. అపవిద్ధగదః – అపవిద్ధా గదా యేన (బహువ్రీహి) సః ।



2. భగ్నశాఖః – భగ్నా శాఖా యేన (బహువ్రీహి) సః ।
3. మనఃశల్యమ్ – మనసః శల్యమ్ (ష.త)

**సంధులు:–**

1. శంసతి + ఇవ – శంసతీవ – సవర్ణదీర్ఘసంధిః
2. అపవిద్ధగదః + బాహుః – అపవిద్ధగదో బాహుః – ఉత్వాదేశసంధిః
3. బాహుః + భగ్నశాఖః – బాహుర్భగ్నశాఖః – విసర్గసంధిః
4. భగ్నశాఖః + ఇవ – భగ్నశాఖ ఇవ – విసర్గలోపసంధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. కుబేరః**

ఎ) కుంబతి ధనమ్ అన్యస్యైశ్వర్యం వా ఇతి । కుబి ఆచ్ఛాదనే, 'కుమ్బేర్న లోపశ్చ' ఇతి ఏరక్ నలోపశ్చ । యద్వా కుత్సితం వేరం శరీరం యస్య 'వేరం కలేబరే క్లీబమ్' – ఇతి మేదినీ । **పింగలనేత్రత్వాత్తథాత్వమ్ ।**

బి) శ్లో॥ కుత్సాయాం క్వితి శబ్దోఽయం శరీరం వేరముచ్యతే ।
కువేరః కుశరీరత్వాద్ **నామ్నా** తేనైవ సోఽఙ్కితః ॥ ఇతి వాయుపురాణే
శ్లో॥ "కుబేరో భవ నామ్నా త్వం మమ రూపేర్ష్యయా సుత!"
– ఇతి కాశీఖండే

సి) శ్లో॥ ఐలవిలః పౌలస్త్యో వైశ్రవణః కిన్నరేశ్వరో ధనదః ।
శ్రీదః శ్రీకణ్ఠసఖో మనుష్యధర్మా ధనాధ్యక్షః ॥ 78
శ్లో॥ ఉత్తరాశాపతిర్యక్షః **కుబేరో** నరవాహనః ।
గుహ్యకో రాజరాజశ్చ ధనీ పుణ్యజనేశ్వరః ॥ 79

అని హలాయుధకోశము 'కుబేరు'నకు 17 నామములను పేర్కొన్నది.

డి) Kubera is represented as being deformed in body having three legs, only tight teeth and yellow mark in place of one eye.

ఇ) శ్లో॥ తథేతి తస్యావితథం ప్రతీతః
ప్రత్యగ్రహీత్సంగరమగ్రజన్మా ।
గామాత్తసారాం రఘురప్యవేక్ష్య
నిష్క్రష్టుమర్థం చకమే **కుబేరాత్** ॥ ర.వం. 5–26

'....కౌత్సునకు కావలసిన ధనమును **కుబేరు**నినుండి ఆర్జింపదలపోసెను."

**క్రియాదర్శనము:– శంసతి:–** శంసు( శంస్) స్తుతౌ (స్తుతించుట, **దుర్గతినొందుట)**

సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ . లట్.

ప్రథమపురుషరూపాలు :- **శంసతి**- శంసతః - శంసన్తి

శ్లో॥ ఆచష్టే వక్తి వదతి రపత్యాఖ్యాతి భాషతే ।
బ్రూతేఽ భిధత్తే గదతి వ్యాహరత్యపి జల్పతి ॥ 93

శ్లో॥ బ్రవీత్యభిదధాతి వ్యాహరతే కథయత్యపి ।
గుణాత్యుదీరయత్యుక్త్వై కీర్తయత్యాలపత్యపి ॥ 94

శ్లో॥ భణత్యపి వచత్యేకే వాచయత్యపి **శంసతి** ।

అని 'ఆఖ్యాతచంద్రికా' క్రియాకోశము, శంస్ ధాతువునకు తుల్యమైన క్రియారూపాలను పేర్కొన్నది.

**అలంకారములు :-** 'సంసృష్ట్యలంకారము' చెప్పదగును. 'అత్ర పరాభవం శంసతీవేత్యు**త్ప్రేక్షా,** ద్రుమ **ఇవేత్యుపమా,** మనఃశల్యమితి రూపకమ్', తథా చోత్ప్రేక్షోపమారూపకాణాం **సంసృష్టిః ।**

**లక్షణము:-** సేష్టా సంసృష్టి రేతేషాం భేదేన యదిహ స్థితిః - కావ్యప్రకాశే 10-139. ఈ అలంకారాలయొక్క వేరువేరుగా ఇక్కడ ఒక కావ్యంలో అనగా శ్లోకములో లేదా వాక్యములో ఏ ఉండటం కలదో అది సంసృష్టిగా ఇష్టమైనది - బాలానందిని. **అలంకారాల కలయిక సంసృష్టి. ఒక దాని అపేక్ష మరొకదానికి లేకుండా ఉండాలి.**

---

**అవతారికా:-** అథ యమస్యావస్థామాహ - పిమ్మట యముని అవస్థను చెప్పుచున్నాడు.

**శ్లో॥ యమోఽపి విలిఖన్ భూమిం**
**దండేనాస్తమితత్విషా ।**
**కురుతేఽ స్మిన్నమోఘేఽపి**
**నిర్వాణాలాతలాఘవమ్ ॥ 23**

**పదవిభాగము:-** యమః, అపి, విలిఖన్, భూమిమ్, దండేన, అస్తమితత్విషా, కురుతే, అస్మిన్, అమోఘే, అపి, నిర్వాణాలాతలాఘవమ్.

**అన్వయక్రమము:-** అస్తమితత్విషా దండేన యమః అపి భూమిం విలిఖన్ అమోఘే అపి అస్మిన్ నిర్వాణ+అలాతలాఘవమ్ కురుతే ।





**ప్రతిపదార్థము:-** అస్తమితత్విషా - ఆరిపోయిన తేజస్సు కలదైన, దండేన - 'కాలదండ' మను నాయుధముతో, యమః+ అపి - యముడును, భూమిమ్ - నేలను, విలిఖన్ - గీఱుచు, అమోఘే + అపి - వమ్ముగానిదైనను, అస్మిన్ - దీనియందు (కాలదండాయుధమునకు), నిర్వాణ + అలాతలాఘవమ్ - ఆరిన కొఱవియొక్క దీనత్వమును, కురుతే - చేయుచున్నాడు.

**తాత్పర్యము: -** ఆరిపోయిన తేజస్సుగలదైన 'కాలదండ' మను నాయుధముతో యముడును నేలను గీఱుచు, వమ్ముగానిదైనను ఆ దండమందు (నకు) ఆరిన కొఱవియొక్క దీనత్వమును చేయుచున్నాడు (కలిగించినాడు)

**విభక్తులు / క్రియలు:-** 1. అస్తమితత్విషా - **త్విషా,** త్విడ్భ్యామ్, త్విడ్భిః, ; షకారాన్త పుంలింగ ...త్విష్‌శబ్దము తృ.ఏ 2. దండేన - **దండేన,** దండాభ్యామ్, దండైః, ; అకారాన్త పుంలింగ దణ్డశబ్దము ప్ర.ఏ 3. యమః - **యమః**, యమౌ, యమాః ; అకారాన్త పుంలింగ యమ శబ్దము ప్ర.ఏ 4. అపి - అవ్యయము 5 భూమిమ్ - **భూమిమ్**, భూమీ, భూమీః ; ఇకారాన్త స్త్రీలింగ భూమిశబ్దము ద్వి.ఏ 6. విలిఖన్ - **విలిఖన్**, విలిఖన్తౌ, విలిఖన్తః శత్రన్తః ; తకారాన్త పుంలింగ విలిఖత్ శబ్దము 7. అమోఘే - **అమోఘే**, అమోఘయోః, అమోఘేషు; అకారాన్త పుంలింగ అమోఘ శబ్దము స.ఏ 8. అస్మిన్ - **అస్మిన్** , ఏనయోః, ఏషు; మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దము స.ఏ 9. ని...లాఘవమ్- **లాఘవమ్**, లాఘవే, లాఘవాని; అకారాన్త నపుంసకలింగ....లాఘవ శబ్దము ద్వి.ఏ 10. కురుతే - క్రియ (లట్ ప్రథమపురుషైకవచనమ్)

**సమాసాలు:-**

1. అస్తమితత్విషా- అస్తమ్ + ఇత + త్విషా - అస్తమితాః త్విషః యస్య (బహువ్రీహి) సః, తేన.
2. అమోఘే - న మోఘః,; అమోఘః (నఞ్‌తత్పురుష) తస్మిన్.
3. నిర్వాణాలాతలాఘవమ్ - నిర్వాణఞ్చ తత్ అలాతమ్ (కర్మధా) నిర్వాణాలాతమ్ ; నిర్వాణాలాతస్య లాఘవమ్ (ష.త) నిర్వాణాతలాఘవమ్.

**సంధులు:-**

1. యమః + అపి - యమోఽపి - ఉత్వాదేశసన్ధిః
2. కురుతే + అస్మిన్ - కురుతేఽస్మిన్ - పూర్వరూపసన్ధిః
3. దండేన + అస్తమిత - దండేనాస్తమిత - సవర్ణదీర్ఘసన్ధిః
4. అస్మిన్ + అమోఘే - అస్మిన్నమోఘే - ఙముడాగమః
5. అమోఘే + అపి - అమోఘేఽపి - పూర్వరూపసన్ధిః

**శ్లో॥ జ్వలన్మణిశిఖాశ్చైనం**
**వాసుకిప్రముఖా నిశి।**
**స్థిరప్రదీపతామేత్య**
**భుజఙ్గాః పర్యుపాసతే ॥ 38**

**పదవిభాగము:–** జ్వలన్మణిశిఖాః, చ, ఏనమ్, వాసుకిప్రముఖాః, నిశి, స్థిరప్రదీపతామ్, ఏత్య, భుజఙ్గాః, పర్యుపాసతే ।

**అన్వయక్రమము:–** చ జ్వలన్మణిశిఖాః వాసుకిప్రముఖాః భుజంగాః నిశి స్థిరప్రదీపతామ్ ఏత్య ఏనమ్ పర్యుపాసతే ।

**ప్రతిపదార్థము:–** చ– ఇంతేకాదు, జ్వలన్మణిశిఖాః – ప్రకాశించుచున్న మాణిక్య జ్వాలలుగల, వాసుకి ప్రముఖాః – వాసుకి మున్నగు, భుజంగాః – సర్పములు, నిశి – రాత్రియందు, స్థిరప్రదీపతామ్ – ఆఱని దీపములు అగుటను, ఏత్య – పొంది, ఏనమ్ – ఈ తారకాసురుని, పర్యుపాసతే – కొలుచుచున్నారు.

**తాత్పర్యము:–** ఇంతేకాదు, ప్రకాశించుచున్న మాణిక్య జ్వాలలు గల వాసుకి మున్నగు సర్పములు రాత్రియందు ఆఱని దీపములు అగుటను పొంది ఈ తారకాసురుని సేవించుచున్నారు.

**విభక్తులు / క్రియలు:–** 1. చ– అవ్యయము, 2. జ్వలన్మణిశిఖాః – ...శిఖః, శిఖౌ, **శిఖాః,** అకారాన్త పుంలింగ...శిఖ శబ్దము. ప్ర.ఏ, 3. వాసుకిప్రముఖాః –... ప్రముఖః, ప్రముఖౌ, **ప్రముఖాః** , అకారాన్త పుంలింగ ప్రముఖ శబ్దము. ప్ర.ఏ 4. భుజంగాః – భుజంగః, భుజంగౌ, **భుజంగాః,** అకారాన్త పుంలింగ భుజంగ శబ్దము. ప్ర.బ, 5, నిశి – **నిశి,** నిశోః, నిక్షు, శకారాన్త నపుంసకలింగ 'నిశ్' శబ్దము. స.ఏ, 6. స్థిరప్రదీపతామ్ – **దీపతామ్,** దీపతే, దీపతాః, అకారాన్త స్త్రీలింగ దీపతా శబ్దము. ద్వి.ఏ, 7. ఏత్య – అవ్యయము, 8. ఏనమ్ – **ఇమమ్ / ఏనమ్ , ఇమౌ / ఏనౌ,** ఇమాన్ / ఏనాన్, మకారాన్త పుంలింగ 'ఇదమ్' శబ్దము. ద్వి.ఏ 9. పుర్యుపాసతే – పరి + ఉప+ ఆసతే (లట్ – ప్రథమపురుష బహువచనము)

**సమాసాలు:–**

1. జ్వలన్మణిశిఖాః – జ్వలన్త్యః మణీనాం శిఖాః (ష.త) యేషామ్ (బహుబ్రీహి) తే ।
2. వాసుకిప్రముఖాః – వాసుకిః ప్రముఖం యేషామ్ (బహుబ్రీహి) తే ।
3. స్థిరప్రదీపతామ్ – స్థిరః చాసౌ ప్రదీపః (కర్మధా) స్థిరప్రదీపః, తస్య భావః తామ్ ।



**సంధులు:–**

1. జ్వలత్ + మణిశిఖాః – జ్వలన్మణిశిఖాః – అనునాసికసన్ధిః
2. శిఖాః + చ – శిఖాశ్చ – శ్చుత్వసన్ధిః
3. శిఖాశ్చ + ఏనమ్ – శిఖాశ్చైనమ్ – వృద్ధిసన్ధిః **వృద్ధిరేచి** – (సూ. 6–1–85)

– అవర్ణమునకు (అ,ఆలకు) ఏఓఐఔలు పరమగునపుడు పూర్వపరముల స్థానములో వృద్ధి ఏకాదేశమగును. ఏ,ఐలు పరమగునపుడు ఐకారము, ఓఔలు పరమగునపుడు ఔకారము వచ్చునని తాత్పర్యము.

4. వాసుకిప్రముఖాః + నిశి – వాసుకిప్రముఖా నిశి – విసర్గలోపసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. వాసుకిప్రముఖాః**

ఎ) ఋషికల్పుడగు నన్నయభట్టారకుడు మహాభారతమునందు ఆదిపర్వమున గావించిన నాగస్తోత్రమున గల నాలుగుపద్యములు అనర్ఘమణిరత్నములు. వాట ి కవియే సాటి. ఇట వాటిని మనసారా తనివితీరా ఆస్వాదిద్దాము.

**1. "బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ**
**సహితమహామహీభర మజస్రసహస్రఫణాళి దాల్చి దు**
**స్సహతరమూర్తికిన్ జలధిశాయికి బాయక శయ్యయైన య**
**య్యహిపతి దుష్కృతాంతకుడనంతుడు మాకు బ్రసన్నుడయ్యెడున్.**

**2. అరిదితపోవిభూతినమరారుల బాధలు వొందకుండగా**
**నురగుల నెల్లగాచిన మహోరగ నాయకు డానమత్సురా**
**సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదునకద్రినందనే**
**శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకు బ్రసన్నుడయ్యెడున్.**

**3. దేవమనుష్యలోకముల ద్రిమ్మరుచున్ విపులప్రతాపసం**
**భావితశక్తిశౌర్యులు నపార విషోత్కటకోప విస్ఫుర–**
**త్పావకతాపితాఖిలవిపక్షులులైన మహానుభావులై**
**రావతకోటిఘోర ఫణిరాజులు మాకు బ్రసన్నుడయ్యెడున్.**

**4. గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులం గురు**
**క్షేత్రమునం బ్రకామగతి ఖేలన నొప్పి సహాశ్వసేనుడై**
**ధాత్రి బరిభ్రమించు బలదర్ప పరాక్రమ దక్షుడీక్షణ**
**శ్రోత్రవిభుండు తక్షకుడు శూరుడు మాకు బ్రసన్నుడయ్యెడున్.**

ఈ నాల్గుపద్యములు చాలా ప్రసిద్ధములైనవి. నన్నయగారి అక్షరరమ్యత యొక్క ప్రత్యేకతము వీనిలో కన్పించుచున్నది. ఈ పద్యములకు 'విశ్వనాథ'వారు అందించిన వ్యాఖ్యను- 'సాహిత్యసురభి'ని చూడ ప్రార్థన.

బి) శ్లో॥ సర్పాణామస్మి వాసుకిః - భగవద్గీత 10-28

'సర్పములలో వాసుకి నేను' అని శ్రీకృష్ణభగవానుడు - విభూతియోగములో పేర్కొనినాడు అట్లే

శ్లో॥ అనంతశ్చాస్మి నాగానామ్- 'నాగజాతివారిలో ఆదిశేషుడు (అనంతుడు) ను నేను అని చెప్పినాడు.

సి) శ్లో॥ వాసుకిస్తు సర్పరాజః శ్వేతో నీలసరోజవాన్। అని అభిధానచిన్తామణి.

డి) శివభగవానుని కంఠాభరణము, దేవదానవులు 'అమృతమునకై' సాగించిన మథనంలో మంథర పర్వతము కవ్వంగాను, కవ్వపు త్రాడుగ 'వాసుకి' ప్రధానపాత్ర వహించిన మహాసర్పరాజము.

**క్రియాదర్శము:- పర్యుపాసతే** - పరి+ఉప+ఆసతే - ఆస (ఆస్) ఉపవేశనే (కూర్చొనుట) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, అదాదిప్రకరణమ్. లట్ - ప్రథమపురుష బహువచనము రూపాలు - ఆస్తే - ఆసాతే - **ఆసతే.**

**అలంకారములు:-** ఇందు 'వ్యతిరేకాలంకార' మున్నదని చెప్పదగును. అన్వయము - సరళము. 'జ్వలన్మణిశిఖాః'

---

**అవతారికా:-** అథేదానీం త్రైలోక్యాధిపతేరిన్ద్రస్యాపి సవిశేషానువృత్తిమాహ ।

**శ్లో॥ తత్కృతానుగ్రహాపేక్షీ**
**తం ముహుర్దూతహారితైః ।**
**అనుకూలయతీన్ద్రోఽపి**
**కల్పద్రుమవిభూషణైః ॥ 39**

**పదవిభాగము:-** తత్కృతానుగ్రహాపేక్షీ, తమ్, ముహుః, దూతహారితైః, అనుకూలయతి, ఇన్ద్రః, అపి, కల్పద్రుమవిభూషణైః।

**అన్వయక్రమము:-** ఇంద్రః అపి తత్కృతానుగ్రహాపేక్షీ (సన్) ముహుః దూతహారితైః కల్పద్రుమభూషణైః తమ్ అనుకూలయతి ।





**ప్రతిపదార్థము:-** ఇంద్రః+అపి - ఇంద్రుడున్నూ, తత్కృతానుగ్రహాపేక్షీ - ఆ తారకునిచే చేయబడిన ప్రసాదము కోరుచున్నవాడై, ముహుః - మాటిమాటికి, దూతహారితైః - దూతలచే పంపబడిన, కల్పద్రుమవిభూషణైః - కల్పవృక్షముల నుండి పుట్టిన ఆభరణములతో, తమ్ - ఆ తారకాసురుని, అనుకూలయతి - అనుకూలునిగా చేసికొనుచున్నాడు.

**తాత్పర్యము:-** ఇంద్రుడున్నూ ఆ తారకాసురునిచే చేయబడిన ప్రసాదము కోరుచున్నవాడై మాటిమాటికి దూతలచే పంపబడిన కల్పవృక్షజనితాభరణములతో ఆ తారకుని అనుకూలునిగా చేసికొనుచున్నాడు.

**విభక్తులు / క్రియలు:-** 1. ఇంద్రః - **ఇంద్రః**, ఇంద్రౌ, ఇంద్రాః, అకారాన్త పుంలింగ ఇంద్రశబ్దము. ప్ర.ఏ 2. త...పేక్షీ - **పేక్షీ,** తత్కృ...పేక్షిణౌ, తత్కృ..క్షిణః, నకారాన్త పుంలింగ **అపేక్షిన్** శబ్దము. ప్ర.ఏ 3. ముహుః - అవ్యయము 4. దూతహారితైః - దూతహారితేన , దూతహారితాభ్యామ్, **దూతహారితైః,** అకారాన్త నపుంసకలింగ దూతహారిత శబ్దము. తృ.బ 5. కల్పద్రుమవిభూషణైః - విభూషణేన, విభూషణాభ్యామ్, **విభూషణైః**, అకారాన్త నపుంసకలింగ కల్పవిభూషణ శబ్దము. తృ.బ 6. తమ్ - **తమ్,** తౌ, తాన్, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 7. అనుకూలయతి - అనుకూల +ణిచ్+లట్, ప్రథమపురుష ఏకవచనము.

**సమాసాలు:-**

1. తత్కృతానుగ్రహాపేక్షీ - తేన కృతః తత్కృతః, స చాసౌ అనుగ్రహః తత్కృతానుగ్రహః, తమ్ అపేక్షతే తచ్ఛీలః తత్కృతానుగ్రహాపేక్షీ ।
2. దూతహారితైః - దూతైః హారితాని (తృ.త) దూతహారితాని తైః ।
3. కల్పద్రుమవిభూషణైః - కల్పద్రుమణాం విభూషణాని (ష.త) తైః ।

**సంధులు:-**

1. ముహుః+దూత - ముహుర్దూత - విసర్గసన్ధిః
2. అనుకూలయతి+ఇంద్రః - అనుకూలయతీన్ద్రః - సవర్ణదీర్ఘసన్ధిః
3. ఇంద్రః+అపి - ఇంద్రోఽపి - ఉత్వాదేశసన్ధిః, పూర్వరూపసన్ధిః

**పదవ్యుత్పత్తి నిఘంటు ప్రమాణాలు - కావ్యప్రయోగాలు**

**1. కల్పద్రుమః**

ఎ) కల్పస్య సంకల్పస్య దాతా ద్రుమః, కల్పస్థాయీ ద్రుమ ఇతి వా।

బి) శ్లో॥ నమస్తే కల్పవృక్షాయ చిన్తితాన్నప్రదాయ చ ।
విశ్వమ్భరాయ దేవాయ నమస్తే విశ్వమూర్తయే " ఇతి దానసాగరే.

సి) శ్లో॥ మందారపారిజాతకహరిచందనకల్పవృక్ష సన్తానాః ।
పంచైతే సురతరవో...॥ 135 అని హలాయుధకోశము పేర్కొన్నది.

డి) శ్లో॥ తేషాం మహార్హాసనసంస్థితానామ్
ఉదారనైపథ్యభృతాం స మధ్యే ।
రరాజ ధామ్నా రఘుసూను రేవ
**కల్పద్రుమాణామివ పారిజాతః** ॥ ర.వం' 6-6

'శ్రేష్ఠములైన సింహాసనములపై విశేషాలంకారములతో గూర్చున్న రాజులలో అజమహారాజు అతిశయకాంతిచేత **కల్పవృక్షములలో** పారిజాతవృక్షమువలె ప్రకాశించెను.

ఇ) కల్పయన్తీతి కల్పాః, కల్పా ఇతి ద్రుమాః కల్పద్రుమాః ।

ఎఫ్) శ్లో॥ అథ ప్రభావోపనతైః కుమారం
కల్పద్రుమోత్థైరవకీర్య పుష్పైః ।
ఉవాచ వాగ్మీ దశనప్రభాభిః
సంవర్ధితోరస్థ్సలతారహారః ॥ ర.వం. 5-52

"వక్తయగు నా పురుషుండు తన ప్రభావముచేత రప్పించబడిన **కల్పవృక్ష** పుష్పములను అజమహారాజుపై వెదజల్లి..."

జి) శ్లో॥ యత్ర **కల్పద్రుమైరేవ** - విలోలవిటపాంశుకైః ।
గృహయన్త్రపతాకాశ్రీ - రపౌరాదరనిర్మితా ॥ కు.సం. 6 -41

"ఆ పురమునందలి కల్పవృక్షములు ప్రజలేవి కోరిన వానిని అన్నింటిని ఇచ్చుచున్నవని తాత్పర్యము."

హెచ్)శ్లో॥ సన్తానకతరుచ్ఛాయా - సుప్తవిద్యాధరాధ్వగమ్ ।
యస్య చోపవనం బాహ్యం - గన్ధవద్గన్ధమాదనమ్ ॥ కు.సం. 6-46

"ఆ పురములో **సంతానమను కల్పవృక్షముల** నీడ క్రింద విద్యాధరులు అను బాటసారులు నిద్రించుచుందురు...."

**క్రియాదర్శము:-** 1. **అనుకూలయతి** – నామవాచక ధాతువు. లట్ ప్రథమపురుషైక వచనము. ధాతువులపై కొన్ని ప్రత్యయములు చేరుటవలన సుబంతములేర్పడినట్లుగ సుబంతములపై కొన్ని ప్రత్యయములు చేరుటవలన ధాతువు లేర్పడును. నామములపై అర్థవిశేషములో ప్రత్యయము చేరగా ఏర్పడునది నామధాతువు.





**అనుగతఃకూలమ్ అనుకూలః** అనుకూల ఇవ ఆచరతి – అనుకూలయతి. పరస్మైపదీ (లట్) **అనుకూలయతి** –అనుకూలయతః – అనుకూలయన్తి.

---

**అవతారికా:-** ఏవం సర్వదేవానువృత్తావపి చరాచరవిజయిని తారకాసురే వైఫల్యమాహ.।

**శ్లో॥ ఇత్థమారాధ్యమానోఽపి
క్లిశ్నాతి భువనత్రయమ్।
శామ్యేత్ప్రత్యపకారేణ
నోపకారేణ దుర్జనః ॥ 40**

**పదవిభాగము:-** ఇత్థమ్, ఆరాధ్యమానః, అపి, క్లిశ్నాతి, భువనత్రయమ్, శామ్యేత్, ప్రత్యపకారేణ, న, ఉపకారేణ, దుర్జనః ।

**అన్వయక్రమము:-** ఇత్థమ్ ఆరాధ్యమానః అపి (సః) భువనత్రయం క్లిశ్నాతి । దుర్జనః ప్రత్యపకారేణ శామ్యేత్ ఉపకారేణ న (శామ్యేత్)।

**ప్రతిపదార్థము:-** ఇత్థమ్ – ఇవ్విధముగ, ఆరాధ్యమానః+అపి – పూజింపబడుచున్న వాడైనను, (సః – తారకాసురుడు), భువనత్రయమ్– ముల్లోకములను, క్లిశ్నాతి – పీడించుచున్నాడు. దుర్జనః – దుర్జనుడు, ప్రత్యపకారేణ – బదులుగా కీడుచేయుటచే, శామ్యేత్ – నశించును, ఉపకారేణ–మేలుచేయుటచే, న (శామ్యేత్) – నశించదు.

**తాత్పర్యము:-** ఇవ్విధముగ పూజించబడుచున్నవాడైనను (తారకాసురుడు) ముల్లోకములను పీడించుచున్నాడు. దుర్జనుడు బదులుగా కీడుచేయుటచే నశించును. మేలుచేయుటచే నశించదు.

**విభక్తులు / క్రియలు:-** 1. ఇత్థమ్ – అవ్యయము 2. అపి – అవ్యయము 3. ఆరాధ్యమానః – **ఆరాధ్యమానః,** ఆరాధ్యమానౌ, ఆరాధ్యమానాః, అకారాన్త పుంలింగ ఆరాధ్యమానశబ్దము. ప్ర.ఏ 4. భువనత్రయమ్ – **భువనత్రయమ్,** భువనత్రయే, భువనత్రయాణి, అకారాన్త నపుంసకలింగ భువనత్రయ శబ్దము. ద్వి.ఏ 5. క్లిశ్నాతి – క్రియ – లట్ ప్రథమపురుషైకవచనము. 6. దుర్జనః – **దుర్జనః,** దుర్జనౌ, దుర్జనాః, అకారాన్త పుంలింగ దుర్జనశబ్దము. ప్ర.ఏ 7. ప్రత్యపకారేణ – **ప్రత్యపకారేణ,** ప్రత్యపకారాభ్యామ్, ప్రత్యపకారైః, అకారాన్త పుంలింగ ప్రత్యపకార శబ్దము. తృ.ఏ 9.శామ్యేత్ – క్రియ 10. న– అవ్యయము.

**సమాసాలు:–**

1. భువనత్రయమ్ – భువనానాం త్రయమ్ (ష.త)
2. ప్రత్యపకారేణ – ప్రత్యపకారణం ప్రత్యపకారః తేన ప్రత్యపకారేణ (తృ.త)

**సంధులు:–**

1. ఆరాధ్యమానః + అపి – ఆరాధ్యమానోఽపి – ఉత్వాదేశ పూర్వరూపసన్ధిః
2. న + ఉపకారేణ – నోపకారేణ – గుణసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. దుర్జనః**– ఎ) దుర్దుష్టో జనః । 'కుగతిప్రాదయః' ఇతి సమాసః ।

బి) శ్లో॥ దుర్జనః పిశునః క్షుద్రో నీచః కర్ణేజపః ఖలః॥
దోషగ్రాహీ పురోభాగీ ద్విజిహ్వో మత్సరీ మతః ॥ 346

అని హలాయుధకోశము 10 నామములను **దుర్జన** శబ్దానికి పేర్కొన్నది.

సి) శ్లో॥ **దుర్జనః** ప్రియవాదీ చ నైతద్విశ్వాసకారణమ్ ।
మధు తిష్ఠతి జిహ్వాగ్రే హృదయే తు హలాహలమ్ ॥

శ్లో॥ **దుర్జనః** పరిహర్తవ్యో విద్యయాలంకృతోఽపి సః ।
మణినా భూషితః సర్పః కిమసౌ న భయంకరః ॥

– ఇతి చాణక్యశతకే.

ఈ పై శ్లోకము **భర్తృహరి నీతిశతకము** దుర్జనపద్ధతి భాగములో (42)వ పద్యముగ కూడా కనిపిస్తున్నది. దాని కాంధ్రానువాదమీ క్రింది పద్యము.

తే॥ విద్యచే భూషితుండయి వెలయుచున్న
దొడరి వర్జింపనగు జుమీ **దుర్జనుండు**
చారుమాణిక్యభూషితశస్తమస్త
కంబయిన పన్నగము భయంకరము గాదె॥ (ఏనుగు లక్ష్మణకవిది)

**క్రియాదర్శము:– 1. క్లిశ్నాతి** – క్లిశూ (విబాధనే) పీడించుట, క్ర్యాదిప్రకరణమ్ (9) సకర్మకమ్, వేట్, పరస్మైపదీ, లట్ ప్రథమపురుషైకవచనము.

రూపాలు – **క్లిశ్నాతి,** క్లిశ్నీతః, క్లిశ్నన్తి

శ్లో॥ దృమ్ఫతి దృఫతి దునోతి వ్యథయతి దుఃఖయతి తపతి పీడయతి ।
**క్లిశ్నాతి** దూనయత్యపి ధూపయతి ఖేదయత్యాద్యాః । 164



శ్లో॥ దుఃఖారోతి తుదతి చ కరోతి వైకల్యముదాద్విభ్యోఽమీ ।
ఆత్మనేఽపి గ్లపయతి గ్లాపయత్యపి పీడనే ॥ 165

శ్లో॥ రోఠతే లోఠతే కుథ్నాత్యపి మన్థతి బాధతే ।
ఏఠతే హఠతే తత్ర లోటతే క్లేశయత్యపి ॥ 166

శ్లో॥ శణ్ఠతే శూలతి రుజత్యుపత్యామయతీతి చ ।
అని 'ఆఖ్యాతచన్ద్రికా' అను క్రియాకోశము (2–3) పేర్కొన్నది.

2. **శామ్యేత్** – శము (ఉపశమే) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, దివాదిప్రకరణమ్ 4. 'పుషాదిః శమాదిశ్చ' 'లిఙ్' – ప్రథమపురుషైకవచనము.

రూపాలు – **శామ్యేత్** – శామ్యేతామ్ – శామ్యేయుః

**అలంకారములు:–** ఇట 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. ఇట ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడుటచే నిది 'అర్థాన్తరన్యాసాలంకార' మని చెప్పదగును. అన్వయము సరళము.

**లక్షణము:–** ఉపన్యసనమన్యస్య యదర్థస్యోదితాదృతే ।
జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసః పూర్వార్థానుగతో యథా । 71
కావ్యాలంకారః – ద్వితీయః పరిచ్ఛేదః.

---

**అవతారికా:–** అథ నందనవనవృక్షాపహరణమాహ ।

**శ్లో॥ తేనామరవధూహస్తైః**
**సదయాలూనపల్లవాః ।**
**అభిజ్ఞాశ్ఛేదపాతానాం**
**క్రియన్తే నన్దనద్రుమాః ॥ 41**

**పదవిభాగము:–** తేన, అమరవధూహస్తైః, సదయాలూనపల్లవాః, అభిజ్ఞాః, ఛేదపాతానామ్, క్రియన్తే, నందనద్రుమాః ।

**అన్వయక్రమము:–** తేన అమరవధూహస్తైః సదయాలూనపల్లవాః నందనద్రుమాః ఛేదపాతానామ్ అభిజ్ఞాః క్రియన్తే ।

**ప్రతిపదార్థము:–** తేన – ఆ తారాకాసురునిచేత, అమరవధూహస్తైః – దేవాంగనల యొక్క చేతులతో, సదయాలూనపల్లవాః – దయతో కోయబడిన చిగుళ్లుగల,

నందనద్రుమాః – నందనవనవృక్షములు, ఛేదపాతానామ్ – నఱుకుదెబ్బలకు, అభిజ్ఞాః – ఎఱుగునట్టివిగా, క్రియన్తే – చేయబడుచున్నవి.

**తాత్పర్యము:–** ఆ తారకాసురునిచేత; దేవాంగనలయొక్క చేతులతో దయతో కోయబడిన చిగుళ్లుగల నందనవనవృక్షములు నఱుకుదెబ్బలకు ఎఱుగునట్టివిగా చేయబడుచున్నవి.

**విభక్తులు / క్రియలు:–** 1.తేన – **తేన,** తాభ్యామ్, తైః, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. తృ.ఏ. 2. అమరవధూహస్తైః – హస్తేన, హస్తాభ్యామ్, **హస్తైః,** అకారాన్త పుంలింగ = హస్త శబ్దము. తృ.బ 3. సదయాలూనపల్లవాః – పల్లవః, పల్లవౌ, **పల్లవాః,** అకారాన్త పుంలింగ పల్లవశబ్దము. ప్ర.బ 4. నందనద్రుమాః – ద్రుమః, ద్రుమౌ, **ద్రుమాః,** అకారాన్త పుంలింగ = ద్రుమశబ్దము. ప్ర.బ 5. ఛేదపాతానామ్ – ఛేదపాతస్య, ఛేదపాతయోః, **ఛేదపాతానామ్,** అకారాన్త పుంలింగ ఛేదపాతశబ్దము. ష.బ 6. అభిజ్ఞా– అభిజ్ఞః, అభిజ్ఞౌ, అభిజ్ఞాః, అకారాన్త పుంలింగ అభిజ్ఞ శబ్దము. ప్ర.బ 7. క్రియన్తే – క్రియ (కర్మణి) లట్ ప్రథమపురుష బహువచనము.

**సమాసాలు:–**

1. అమరవధూహస్తైః – అమరాణాం వధ్వః, అమరవధ్వః (ష.త)। అమరవధూనాం హస్తాః (ష.త) అమరవధూహస్తాః, తైః. ।
2. సదయాలూనపల్లవాః – సదయమ్ దయయా సహితం యథా స్యాత్తథా సదయమ్ (బహువ్రీహి), సదయమ్ ఆలూనాః సదయాలూనాః సదయాలూనాః పల్లవాః యేషామ్ (బహువ్రీహి) తే ।
3. నందనద్రుమాః – నందనస్య ద్రుమాః (ష.త)।
4. ఛేదపాతానామ్ – ఛేదాశ్చ పాతాశ్చ (ద్వంద్వ) తే ఛేదపాతాః, తేషామ్ ।
5. అభిజ్ఞాః – అభిజానన్తీతి (ఉపపదతత్పురుష) తే. ।

**సంధులు:–**

1. తేన+ అమరవధూ – తేనామరవధూ – సవర్ణదీర్ఘసంధిః
2. అభిజ్ఞాః+ఛేద – అభిజ్ఞాశ్ఛేద – శ్చుత్వసంధిః

**స్తోఃశ్చునా శ్చుః** – (సూ. 8–4–39) సకారతవర్గములకు శకారచవర్గములతో కలయిక ఏర్పడినపుడు శకారచవర్గములు వచ్చును.

**పాఠాన్తరాలు:–** 1. ఛేదపాతానామ్ – ఛిన్నపాతానామ్

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

1. ఎ) ఈ శ్లోకభావానికి దాదాపు తుల్యముగానున్న రఘువంశమునందలి (16–19) శ్లోకభావమును గమనించండి.

శ్లో॥ ఆవర్జ్య శాఖాః **సదయం** చ యాసాం
పుష్పాణ్యుపాత్తాని **విలాసినీభిః** ।
వన్యైః పులిన్దైవ వానరైస్తాః
క్లిశ్యన్త ఉద్యానలతా మదీయాః ॥

‘ఏ ఉద్యానవన లతలనుండి పూర్వము సుకుమారములైన కొమ్మలను వంచి (వానిమీద దయతో నెమ్మదిగా) యువతులు పూవులను కోసెడివారో, ఆ ఉద్యానవనలతలే నేడు కర్కశస్వభావముగల అడవికోతులవంటి ఆటవిక జనులచే నిర్దయగా పీడించబడుచున్నవి”.

బి) అభిజ్ఞానశాకున్తలనాటకచతుర్థాంక భాగమునగల ఈ శ్లోకాన్ని గమనించండి.

శ్లో॥ పాతుం న ప్రథమం వ్యవసతి జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్ ।
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకున్తలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతామ్ ॥

“ఓ ఆశ్రమ వృక్షములారా ! ఏ పడతి మీ పాదులను నీటిచే నింపి మిమ్ముల తృప్తిపరచుటకు పూర్వము తాను జలము త్రాగుటకు, మీయందలి స్నేహముచే దానలంకరించుకొనుటకు మీచిగురుటాకును సయితము త్రుంచుటకు, ఏ మాత్రము ఇష్టపడకుండెడిదో, మీరు నూతనముగ పుష్పవతులగుట కని పరమానందభరిత యగుచుండిడిదో, అట్టి మీ నెచ్చెలియగు శకున్తల నేడు భర్తృగృహమునకు బయలుదేరుచున్నది. మీరందరు దయతో సాగనంపుడు”.

కరుణరసము చిప్పిల్లు మిగిలిన 3 శ్లోకములను కూడా ఇట అనుసంధానము చేసికొందురుగాక.

1. యాస్యత్యద్య.... ర్నవైః ॥
2. అస్మాన్ సాధు...వధూబంధుభిః ॥
3. శుశ్రూషస్వ గురూన్ ... కులస్యాధయః ॥

**క్రియాదర్శము:–** 1. **క్రియన్తే** – డుకృఞ్ కరణే (చేయుట) – కర్మణి ప్రయోగము. లట్ ప్రథమపురుష బహువచనము. తనాదిప్రకరణమ్(8) సకర్మకమ్, అనిట్, (ఉభయపదీ) ఆత్మనేపదీ. రూపాలు – క్రియతే, క్రియేతే, **క్రియన్తే.**

**అలంకారములు:–** ఇట 'పర్యాయోక్త్యలంకార'మున్నదని చెప్పదగును. అత్ర కార్యభూతేన నందనద్రుమచ్ఛేదపాతేన కారణభూతో మహేంద్రపరాజయః ప్రతీయతే, ఇతి కార్యద్వారేణ పరాజయస్యైవాభిధానాత్ పర్యాయోక్తమలంకారః ।తదుక్తం **సాహిత్యదర్పణే** – 'పర్యాయోక్తం యదా భంగ్యాగమ్యమేవాభిధీయతే ' ఇతి నాత్రాప్రస్తుత ప్రశంసా, కార్యకారణయోరుభయోరపి వర్ణనీయత్వేన ప్రస్తుతత్వాత్ । – పుంసవనీ వ్యాఖ్యనుండి.

---

**అవతారికా:–** అథ దేవానాం దారాపహరణమాహ । దేవాంగనల అపహరణము.

**శ్లో॥ వీజ్యతే స హి సంసుప్త –**
**శ్వాససాధారణానిలైః ।**
**చామరైస్సురబన్దీనాం**
**బాష్పశీకరవర్షిభిః ॥ 42**

**పదవిభాగము:–** వీజ్యతే, సః, హి, సంసుప్తః, శ్వాససాధారణానిలైః, చామరైః, సురబన్దీనామ్, బాష్పశీకరవర్షిభిః.

**అన్వయక్రమము:–** హి సః సంసుప్తః సన్ శ్వాససాధారణానిలైః బాష్పశీకరవర్షిభిః సురబందీనామ్ చామరైః వీజ్యతే ।

**ప్రతిపదార్థము:–** హి – ఏలయన, సః – ఆ తారాకాసురుడు, సంసుప్తః (సన్) – నిద్రితుడగుచు, శ్వాససాధారణానిలైః – శ్వాసతో సమానమగు గాలి గలట్టియు, బాష్పశీకరవర్షిభిః – కన్నీళ్లతుంపరలను కురియుచున్నవైనవియగు, సురబందీనామ్ – చెఱగొనబడిన దేవాంగనలయొక్క,
చామరైః – వింజామరములచే, వీజ్యతే – వీచబడుచున్నాడు.

**తాత్పర్యము:–** ఆ తారకాసురుడు నిద్రితుడయ్యును, శ్వాసతో సమానమగు గాలిగలట్టియు, కన్నీళ్ళ తుంపరలను కురియుచున్న వైనవియు అగు చెఱగొనబడిన దేవాంగనలయొక్క వింజామరములచే వీచబడుచున్నాడు.

**విభక్తులు / క్రియలు:–** 1. హి– అవ్యయము 2. సః – సః, తౌ, తే, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 3. సంసుప్తః – **సంసుప్తః**, సంసుప్తౌ, సంసుప్తాః, అకారాన్త పుంలింగ సంసుప్త శబ్దము. ప్ర.ఏ 4. శ్వాససాధారణానిలైః – శ్వాససాధారణానిలేన, శ్వాససాధారణానిలాభ్యామ్, **శ్వాససాధారణానిలైః**, అకారాన్త నపుంసకలింగ శ్వాస... నిలశబ్దము. తృ.బ 5. బాష్పశీకరవర్షిభిః – వర్షిణా, వర్షిభ్యామ్, **వర్షిభిః**, ఇకారాన్త నపుంసకలింగ వర్షిశబ్దము. తృ.బ 6. చామరైః – చామరేణ, చామరాభ్యామ్, చామరైః, అకారాన్త నపుంసకలింగ చామరశబ్దము. తృ.బ 7. వీజ్యతే – క్రియ (కర్మణి) 8. సురబందీనామ్ – బంద్యాః, బంద్యోః, **బందీనామ్**, ఈకారాన్త స్త్రీలింగ బందీ శబ్దము. ష.బ



**సమాసాలు:–**

1. శ్వాససాధారణానిలైః – శ్వాసేన సాధారణః, శ్వాససాధారణః, స అనిలః యేషాం తాని శ్వాససాధారణానిలాని తైః (బహుబ్రీహి), శ్వాససాధారణానిలైః
2. బాష్పశీకరవర్షిభిః – బాష్పాణాం శీకరాః (ష.త) బాష్పశీకరాః, తాన్ వర్షన్తి తచ్ఛీలాని, తైః (బహుబ్రీహి) బాష్పశీకరవర్షిభిః ।
3. సురబందీనామ్ –సురాణాం బన్ద్యః సురబన్ద్యః తాసాం సురబన్దీనామ్. ।

**సంధులు:–**

1. సః+ హి – స హి – సులోపః
   సులోపః **ఏతత్తదోః** సులోపోఽకోరనఞ్ సమాసే హలి (సూ. 6–1–128) కకారములేని ఏతత్, తద్ శబ్దములమీది సుప్రత్యయము హల్లుపరముగా నున్నపుడు లోపించును. నఞ్ సమాసమున ఈ లోపము రాదు.
2. సంసుప్తః+శ్వాస – సంసుప్తశ్శ్వాస – విసర్గాదేశసన్ధిః – వా శరి – (సూ 8–3–36) శషసవర్ణములు పరముగా ఉన్నప్పుడు విసర్గమునకు శషసలు వికల్పముగా వచ్చును. రాని పక్షమున విసర్గమునకు విసర్గమే వచ్చును.
3. చామరైః + సురబన్దీనామ్ – చామరైస్సురబందీనామ్– విసర్గాదేశసంధిః

**పాఠాన్తరాలు:–** 1. సంసుప్తశ్వాస – సంతప్తశ్వాస

**1. సంసుప్తశ్వాస – సంతప్తశ్వాస**

The reading of the Trivandum edition, సంతప్తశ్వాస... is also a good one. The idea is - Taraka knows very well that the breeze produced by the Camaras, coming in contact with the hot tears shed by the ladies and their hot signs, would not be quite comforting to him, but he puts up with it, as he likes to gloat over their miserable condition. It is not fanning that he wants, but the pleasure derived from looking at the humiliation and degradation of his captives - R.D. Karmarkar.

**క్రియాదర్శము:– వీజ్యతే** – వీజ (వ్యజనే) వీచుట, చురాదిప్రకరణమ్ (10) ఉభయపదీ, సకర్మకమ్, సేట్, లట్ ప్రథమపురుషైకవచనమ్, కర్మణి ప్రయోగము, ఆత్మనేపదిరూపము.

రూపాలు – **వీజ్యతే**, వీజ్యేతే, వీజ్యన్తే

**అలంకారములు:–** ఇట 'పర్యాయోక్తాలంకార'మున్నదని చెప్పదగును. లక్షణము – పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణభిధీయతే' కావ్యాలంకారః 3–8. చెప్పదలచిన విషయమును మామూలుమాటలతో కాక మఱియొక ప్రకారమున చెప్పినచో పర్యాయోక్తము. శ్వాససాధారణానిలైః, బాష్పశీకరవర్షిభిః అని చెప్పబడుటయే ఇట అలంకారము 'పర్యాయోక్తము' అని చెప్పదగును.

---

**అవతారికా:–** అథ ధనాపహరణ మాహ।

**శ్లో॥ ఉత్పాట్య మేరుశృఙ్గాణి**
**క్షుణ్ణాని హరితాం ఖురైః ।**
**ఆక్రీడపర్వతాస్తేన**
**కల్పితాః స్వేషు వేశ్మసు ॥ 43**

**పదవిభాగము:–** ఉత్పాట్య, మేరుశృఙ్గాణి, క్షుణ్ణాని, హరితామ్, ఖురైః, ఆక్రీడపర్వతాః తేన, కల్పితాః, స్వేషు, వేశ్మసు ।

**అన్వయక్రమము:–** తేన హరితాం ఖురైః క్షుణ్ణాని మేరుశృఙ్గాణి ఉత్పాట్య స్వేషు వేశ్మసు ఆక్రీడపర్వతాః కల్పితాః ।

**ప్రతిపదార్థము:–** తేన – ఆ తారకాసురునిచే, హరితాం – సూర్యాశ్వములయొక్క ఖురైః– గిట్టలచే, క్షుణ్ణాని – చూర్ణములైన, మేరుశృఙ్గాణి – మేరు పర్వతశిఖరములు, ఉత్పాట్య – పెల్లగించి, స్వేషు – తన, వేశ్మసు – ఇండ్లయందు, ఆక్రీడపర్వతాః – క్రీడాపర్వతములుగా, కల్పితాః – చేయబడినవి.

**తాత్పర్యము:–** ఆ తారకాసురునిచే, సూర్యాశ్వములయొక్క గిట్టలచే చూర్ణములైన మేరుపర్వత శిఖరములు పెల్లగించబడి తన ఇండ్లయందు క్రీడాపర్వతములుగా చేయబడినవి.

**విభక్తులు / క్రియలు:–** 1. తేన – **తేన,** తాభ్యామ్, తైః, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 2. హరితామ్ – హరితః, హరితోః, **హరితామ్,** తకారాన్త స్త్రీలింగ **హరిత్** శబ్దము. ష.బ 3. ఖురైః – ఖురేణ, ఖురాభ్యామ్, **ఖురైః,** అకారాన్త నపుంసకలింగ **ఖుర** శబ్దము. ద్వి.బ 4. క్షుణ్ణాని – క్షుణ్ణమ్, క్షుణ్ణే, **క్షుణ్ణాని,** అకారాన్త నపుంసకలింగ **క్షుణ్ణ** శబ్దము. ద్వి.బ 5. మేరుశృఙ్గాణి – మేరుశృఙ్గమ్, మేరుశృఙ్గే, మేరుశృంగాణి, అకారాన్త నపుంసకలింగ మేరుశృఙ్గశబ్దము. ప్ర.బ 6. ఉత్పాట్య – ఉత్+



పాట్ + క్త్వా – ల్యబన్తమవ్యయము 7. స్వేషు – స్వే, స్వయోః, స్వేషు, అకారాన్త పుంలింగ స్వశబ్దము. స.బ 8. వేశ్మసు – వేశ్మని, వేశ్మనోః, **వేశ్మసు,** నకారాన్త నపుంసకలింగ 'వేశ్మన్' శబ్దము. స.బ 9. ఆక్రీడపర్వతాః – ఆక్రీడపర్వతః, ఆక్రీడపర్వతౌ, ఆక్రీడపర్వతాః, అకారాన్త పుంలింగ ఆక్రీడపర్వతశబ్దము. ప్ర.బ 10. కల్పితాః – కల్పితః, కల్పితౌ, **కల్పితాః,** అకారాన్త పుంలింగ **కల్పిత** శబ్దము. ప్ర.బ

**సమాసాలు:–**

1. మేరుశృంగాణి – మేరోః శృంగాణి (ష.త)
2. ఆక్రీడపర్వతాః – ఆక్రీడాః చ తే పర్వతాః (కర్మధా)

**సంధులు:–**

1. ఆక్రీడపర్వతాః+ తేన – ఆక్రీడపర్వతాస్తేన – విసర్గసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. హరిత్**

ఎ) **స్త్రీ.** హృ + ఇతి । పుం. హరతి నయనమనాంసీతి ।
'హృ + హృస్యరుహియుషిభ్య ఇతిః' ఇతి.
హలాయుధకోశవ్యాఖ్య ఈ శ్లోకాన్నే ఈ పదవివరణమున ఉదాహరించినది.

బి)శ్లో॥ అర్వా గంధర్వోఽ శ్వః సప్తిర్వాజీ తురంగమస్తురగః ।
తార్క్ష్యో హరిస్తురంగో యయురుక్తో ఘోటకో హయో వాహః ॥
అని 'హలాయుధకోశము 14' నామములను అశ్వ శబ్దానికి పేర్కొన్నది.

సి) అశ్వభేదములు – లక్షణములు – 'హలాయుధకోశః (436–439)
శ్లో॥ గుణదేశకృతాస్తేషాం సంజ్ఞాః స్యురనేకధా లోకే ।
కర్కః శ్వేతః శోణో రక్తో హేమశ్చ కృష్ణవర్ణోఽ శ్వః ॥
శ్లో॥ మల్లికాక్షః సితైర్నేత్రైః కృష్ణైరిన్ద్రాయుధో మతః ।
శ్రీవృక్షకీ స విజ్ఞేయః శ్రీవృక్షో యస్య లాంఛనమ్ ॥
శ్లో॥ ఆజానేయాః కులీనాః స్యుః పారసీకా వనాయుజాః ।
కామ్భోజా వాహ్లికాః ప్రోక్తాః సైంధవాః సింధుపారజాః ॥

డి)శ్లో॥ ధియః సమగ్రైః సగుణై రుదారధీః
క్రమాచ్చతస్రశ్చతురర్ణవోపమాః ।
తతార విద్యాః పవనాతిపాతిభిః
దిశో **హరిద్భి** ర్హరితామివేశ్వరః ॥ ర.వం. 3–30

'సూర్యుడు వాయువేగముగ పయనించు తన **అశ్వముల** సాయమున నలుదిక్కులను దాటునట్లు మహాధీశాలి అయిన ఆ రఘువు బుద్ధియొక్క సర్వగుణములచేత నాల్గు సముద్రములతో పోల్చదగిన నాలుగువిద్యలను వరుసగా దాటెను. ఈ రఘువంశ శ్లోకాన్ని - జాగ్రత్తగా - క్షుణ్ణంగా వ్యాఖ్యానంతో సహా అధ్యయనం చేయుదురుగాక.

ఇ) మనుమంచిభట్టు విరచిత 'హయలక్షణవిలాసము', దానికి డా॥ సూర్యదేవర రవికుమార్ గారందించిన విస్తృతపీఠిక ఇట అనుసంధానము చేసికొనదగును.

**అలంకారములు:-** ఇందు 'పర్యాయోక్తాలంకార'మున్నదని చెప్పదగును. సుమేరు పర్వత సువర్ణ శిఖరములు పెల్లగింపబడినవని చెప్పుటచేత దేవతల దురవస్థ సూచితమవుటచే నిట 'పర్యాయోక్తాలంకార'మున్నదని చెప్పదగును.

**లక్షణము:-** కా॥'పర్యాయోక్తం వినా వాచ్యవాచకత్వేన యద్వచః' కావ్యప్రకాశే 10-31. వాచ్యవాచకభావం లేకుండా ఏ చెప్పడం ఉన్నదో అది **పర్యాయోక్తా లంకారము** వృత్తి - వాచ్యవాచక భావ వ్యతిరేకేణావగమన వ్యాపారేణ యత్ ప్రతిపాదనం తత్ పర్యాయేణ భఙ్గ్యన్తరేణ కథనాత్ పర్యాయోక్తమ్. వాచ్యవాచక భావన కంటె భిన్నమైన అవగమనవ్యాపారంచేత, అనగా వ్యంజనా వ్యాపారముచేత, ఏ ప్రతిపాదించడం ఉన్నదో అది పర్యాయోక్తాలంకారము.

**వివరణ:-** ఏ అర్థాన్ని శక్తిచేత వాచ్యవాచక భావాన్ని పురస్కరించుకొని చెప్పవలసి ఉన్నదో ఆ అర్థాన్నే వ్యంగ్య వ్యంజక భావాన్ని పురస్కరించుకొని చెప్పడం పర్యాయోక్తము.

**సాధారణంగా ధ్వనిస్థలాలలో వాచ్యార్థం ఒకటి ఉంటుంది. వ్యంగ్యార్థం మరొకటి ఉంటుంది. పర్యాయోక్తంలో రెండూ ఒకటే అని అర్థము.**

---

**అవతారికా:-** అథ దేవోపభోగసాధనానాం సువర్ణకమలానామపహరణమాహ।

**శ్లో॥ మన్దాకిన్యాః పయశ్శేషం**
**దిగ్వారణమదావిలమ్ ।**
**హేమామ్భోరుహసస్యానాం**
**తద్వాప్యో ధామ సామ్ప్రతమ్ ॥** 44





**పదవిభాగము:-** మందాకిన్యాః, పయఃశేషమ్, దిగ్వారణమదావిలమ్, హేమామ్భోరుహసస్యానామ్, తద్వాప్యః, ధామ, సాంప్రతమ్.।

**అన్వయక్రమము:-** సాంప్రతమ్ మందాకిన్యాః దిగ్వారణమదావిలం పయః శేషం హేమామ్భోరుహసస్యానాం తద్వాప్యః ధామ (ఆసన్, ఇతి, శేషః)

**ప్రతిపదార్థము:-** సాంప్రతమ్ - ఇప్పుడు, మందాకిన్యాః - ఆకాశగంగకు, దిగ్వారణమదావిలమ్ - దిగ్గజముల మదజలముతో కలుషితమయిన, పయః - నీరు, శేషమ్ - మిగిలియున్నది, హేమామ్భోరుహసస్యానామ్ - బంగారు తామరల పైరులకు, తద్వాప్యః - ఆ తారాకాసురుని దిగుడు బావులు, ధామ - స్థానము (ఆసన్ - అయియున్నవి).

**తాత్పర్యము:-** ఇప్పుడు ఆకాశగంగకు దిగ్గజముల మదజలముతో కలుషిత మయిన నీరు మిగిలియున్నది. బంగారు తామరల పైరులకు ఆ తారకాసురుని దిగుడు బావులు స్థానము (అయియున్నవి)

**విభక్తులు / క్రియలు:-** 1. సాంప్రతమ్- అవ్యయము 2. మందాకిన్యాః - మందాకిన్యాః, మందాకిన్యోః, మందాకినీనామ్, ఈకారాన్త స్త్రీలింగ మందాకినీ శబ్దము. ష.ఏ 3. దిగ్వారణమదావిలమ్ - **ఆవిలమ్,** ఆవిలే, అవిలాని, అకారాన్త నపుంసకలింగ ఆవిలశబ్దము. ప్ర.ఏ 4. పయః - **పయః,** పయసీ, పయాంసి, సకారాన్త నపుంసకలింగ **పయ**శ్శబ్దము. ప్ర.ఏ 5. శేషమ్ - **శేషమ్,** శేషే, శేషాణి, అకారాన్త నపుంసకలింగ **'శేష'** శబ్దము. ప్ర.ఏ 6. హేమా ..సన్యాసామ్ - సస్యస్య, సస్యయోః **,సస్యానామ్,** అకారాన్త నపుంసకలింగ సస్యశబ్దము. ష.ఏ 7. తద్వాప్యః - తద్వాపీ, తద్వాప్యౌ, తద్వాప్యః, ఈకారాన్త స్త్రీలింగ తద్వాపీ శబ్దము. ప్ర.బ 8. ధామ - ధామ - ధామనీ - ధామాని, నకారాన్త నపుంసకలింగ ధామన్శబ్దము. ప్ర.ఏ

**సమాసాలు:-**

1. దిగ్వారణమదావిలమ్ - దిశాం వారణాః (ష.త) దిగ్వారణాః, దిగ్వారణానాం మదాః (ష.త) దిగ్వారణమదైః ఆవిలమ్(తృ.త) ।
2. హేమామ్భోరుహసస్యానామ్ - హేమ్నః అంభోరుహాణి (ష.త) హేమామ్భోరుహాణి, హేమామ్భోరుహాణీవ సస్యాని (కర్మధా) తేషామ్ ।
3. తద్వాప్యః - తస్య వాప్యః (ష.త) ।

**సంధులు:-**

1. పయః+శేషమ్ - పయశ్శేషమ్ - విసర్గాదేశసన్ధిః (వా శరి)
2. తద్వాప్యః + ధామ - తద్వాప్యో ధామ - ఉత్వాదేశసన్ధిః (హశి చ)

అప్లుతమైన హ్రస్వ అకారమునకు పరముగనున్న రేఫమునకు మృదుహల్లులు పరముగానున్నపుడు 'ఉత్వము' వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. ద్విగారణాః –**

ఎ) దిశో వారణాః ।

బి) శ్లో॥ ఐరావతః పుండరీకో వామనః కుముదోఽ ఽజనః ।
పుష్పదన్తః సార్వభౌమః సుప్రతీకశ్చ దిగ్గజాః ॥ ఇత్యమరః

సి) శ్లో॥ ఐరావతః పుండరీకః కుముదాంజనవామనాః ।
పుష్పదన్తః సార్వభౌమః సుప్రతీకశ్చ దిగ్గజాః ॥ ఇతి హలాయుధకోశః

ఎ) ఐరావతము 2) పుండరీకము 3) కుముదము 4) అంజనము 5) వామనము 6) పుష్పదన్తము 7) సార్వభౌమము 8) సుప్రతీకము అను '8'న్ను 8 దిక్కులను రక్షించు గజరాజములు; అట్లే

డి) శ్లో॥ కరిణ్యోఽభ్రముకపిలా పింగలానుపమాః క్రమాత్ ।
తామ్రకర్ణీ శుభ్రదన్తీ చాఙ్గనా చాంజనావతీ ॥

అనునవి ఆయా దిక్కులందుండు ఆడుగజములు

ఇ) శ్లో॥ మాతంగద్విరదద్విపాః కరిగజస్తమ్బేరమనేకపాః ।
కుంభీకుంజరవారణేభరదినః సోమోద్భవః సింధూరః ॥

అని హలాయుధకోశము '14' నామములను 'గజ' శబ్దమునకు పేర్కొన్నది. మరిన్ని వివరములకు 'హలాయుధకోశము' చూడదగును.

**అలంకారములు:–** ఇట 'పర్యాయోక్తాలంకార' మున్నదని చెప్పదగును.

---

**అవతారికా:–** అథ దేవానామనురోధమాహ ।

**శ్లో॥ భువనాలోకనప్రీతిః**
**స్వర్గిభిర్నానుభూయతే ।**
**ఖిలీభూతే విమానానాం**
**తదాపాతభయాత్పథి ॥ 45**

**పదవిభాగము:–** భువనాలోకనప్రీతిః, స్వర్గిభిః, న, అనుభూయతే, ఖిలీభూతే, విమానానామ్, తదాపాతభయాత్, పథి ।



**అన్వయక్రమము:–** తదాపాతభయాత్ విమానానామ్ పథి ఖిలీభూతే (సతి) స్వర్గిభిః భువనాలోకనప్రీతిః న అనుభూయతే ।

**ప్రతిపదార్థము:–** తదాపాతభయాత్ – ఆ తారకాసురునియొక్క తాకుడువలని భయమువలన, విమానానామ్ – విమానములయొక్క, పథి – మార్గము, ఖిలీభూతే (సతి) – పాడైన దగుచుండగ, స్వర్గిభిః – దేవతలచే, భువనాలోకనప్రీతిః – లోకములను చూచుటయందలి ప్రీతి, న అనుభూయతే – అనుభవింపబడకున్నది.

**తాత్పర్యము:–** ఆ తారకాసురునియొక్క తాకుడువలని భయమువలన విమానముల యొక్క మార్గము పాడైన దగుచుండగ, దేవతలచే లోకములను చూచుటయందలి ప్రీతి అనుభవింపబడకున్నది.

**విభక్తులు / క్రియలు:–** త... భయాత్... **భయాత్,** భయాభ్యామ్, భయేభ్యః, అకారాన్త నపుంసకలింగ త... భయశబ్దము. తృ.ఏ 2. విమానానామ్– విమానస్య, విమానయోః, **విమానానామ్,** అకారాన్త పుం/నపుంసకలింగ విమానశబ్దము. ష.బ 3. పథి – **పథి,** పథోః, పథిషు, నకారాన్త పుంలింగ 'పథిన్', శబ్దము. సప్తమీ విభక్తి ఏకవచనము 4. ఖిలీభూతే (సతి) – **ఖిలీభూతే** , ఖిలీభూతయోః, **ఖిలీభూతేషు,** ఖిలీభూతశబ్దము. అకారాన్త పుంలింగ సప్తమీ విభక్తి ఏకవచనము. 5. స్వర్గిభిః – స్వర్గిణా , స్వర్గిభ్యామ్, **స్వర్గిభిః** నకారాన్త పుంలింగ స్వర్గిన్శబ్దము. తృ.బ 6. భువనాలోకప్రీతిః – **ప్రీతిః,** ప్రీతీ, ప్రీతయః, ఇకారాన్త స్త్రీలింగ ప్రీతిశబ్దము. ప్ర.ఏ 7. న – అవ్యయము 8. అనుభూయతే – క్రియ, అను –ఉపసర్గ, కర్మణి ప్రయోగము, లట్ ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1. తదాపాతభయాత్– తస్య ఆపాతః (ష.త) తదాపాతః తదాపాతాత్ భయమ్ (పం.త) ।
2. భువనాలోకనప్రీతిః – భువనానామ్ ఆలోకనమ్ – భువనాలోకనమ్ (ష.త) భువనాలోకనే ప్రీతిః (స.త) భువనాలోకనప్రీతిః ।

**సంధులు:–**

1. స్వర్గిభిః + న – స్వర్గిభిర్న – విసర్గసన్ధిః
2. న + అనుభూయతే – నానుభూయతే – సవర్ణదీర్ఘసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. న– అవ్యయము( అవ్యయకోషః 449)**
**నిషేధోపమానయోరయం వర్తతే ।**

ఎ) నిషేధే – 'ఆసవః ప్రతిపదం ప్రమదానాం నైకరూపరసతామివ భేజే' కిరాతార్జునీయే – 9.55

బి) ఉపమానే – 'మృగో న భీమః కుజరో గిరిష్ఠాః' ఋక్ 1-154-21
మృగో న – మృగ ఇవేత్యర్థః । ఉపమానార్థకోఽయం **ఛన్దస్యేవ ।**
తత్రాపి ఉపమానపదాత్ పర ఏవ అభిధానస్వాభావ్యాత్ ।

సి) ప్రసిద్ధాత్ నఞో వ్యతిరిక్తోఽయం నిపాతః । అనేన సాకం సమాసే న నలోపః । ఏతదేవ వ్యాఖ్యాతృభిస్తత్ర' నగనైకాదివత్ న సమాసః ఇతి ప్రతిపాద్యతే। 'పన్నగః' ఇత్యత్రాపి పద్భ్యాం న గచ్ఛతీత్యర్థే న సమాస ఏవ।

డి) నఞోఽర్థాః బహువ ఉపరి ప్రదర్శయియన్తే। తేషు సర్వేష్వప్యర్థేషు అముమపి బహులం ప్రయుఞ్జతే । తత్తు ననఞోరర్థస్వరూపభేదాపరిజ్ఞానాదిత్యాస్తాం తావత్ విస్తరస్తు శిష్టప్రయోగసమీక్షాయామస్మాభిరుపన్యస్తః । 'అకార్షీః కటం దేవదత్త । న కరోమి భోః । నాకార్షమ్' । పృష్టప్రతివచనమత్ర 'న' ఇత్యస్యార్థః ।

**క్రియాదర్శము:– అనుభూయతే** – అను ఉపసర్గ, **కర్మణి**, ప్రయోగము . భూ – సత్తాయామ్ (ఉండుట), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, వర్తమానే లట్.

**ప్రథమపురుషరూపాలు: – అనుభూయతే** , అనుభూయేతే, అనుభూయన్తే
ఈ ధాతురూపాలు మిగిలిన ప్రకరణములలో ఎట్లుండునో గమనించండి.

ఏ) **పరస్మైపది**లట్ ప్రథమపురుష రూపాలు – భవతి – భవతః – భవన్తి
బి) ణిజన్తే ॥ భావయతి – భావయతః – భావయన్తి
సి) సన్నన్తే ॥ బుభూషతి – బుభూషతః – బుభూషన్తి
డి) యఙి ॥ బోభూయతే – బోభూయేతే – బోభూయన్తే
ఇ) యఙ్లుకి ॥ బోభవీతి / బోభోతి – బోభూతః – బోభువతి

మరిన్ని వివరములకు 'బృహత్ధాతుకుసుమాకరముః'ను సంప్రదించగలరు.

**అలంకారములు:–** ఇట 'పర్యాయోక్తాలంకారము'న్నదని చెప్పదగును.

---

**అవతారికా:–** అథ భోజనస్యాప్యపహరణమాహ –

**శ్లో॥ యజ్వభిస్సమ్భృతం హవ్యం**
**వితతేష్వధ్వరేషు సః ।**
**జాతవేదోముఖాన్మాయీ**
**మిషతామాచ్ఛినత్తి నః ॥** **46**





**పదవిభాగము:–** యజ్వభిః, సమ్భృతమ్, హవ్యమ్, వితతేషు, అధ్వరేషు, సః, జాతవేదోముఖాత్, మాయీ మిషతామ్, ఆచ్ఛినత్తి, నః.

**అన్వయక్రమము:–** యజ్వభిః వితతేషు అధ్వరేషు సంభృతం హవ్యం మాయీ సః నః మిషతాం జాతవేదోముఖాత్ ఆచ్ఛినత్తి ।

**ప్రతిపదార్థము:–** యజ్వభిః – యథావిధిగా యజ్ఞము చేసిన వారిచేత, వితతేషు– చేయబడిన, అధ్వరేషు – యజ్ఞములయందు, సంభృతమ్ – వేల్వబడిన (ఈయబడిన) హవ్యమ్ – హవిస్సును, మాయీ – మాయావియగు, సః – ఆ తారకాసురుడు మిషతామ్ – చూచునట్టి, నః – మాయొక్క, జాతవేదోముఖాత్ – అగ్నియనెడు ముఖమునుండి, ఆచ్ఛినత్తి – ఒడిసికొనుచున్నాడు,

**తాత్పర్యము:–** యథావిధిగా యజ్ఞము చేసిన వారిచేత చేయబడిన యజ్ఞములయందు వేల్వబడిన హవిస్సును మాయావియగు ఆ తారకాసురుడు, మమ్ములనుగూర్చి చూచుచున్నట్టి అగ్నియనెడి ముఖమునుండి ఒడిసికొనుచున్నాడు.

**విభక్తులు / క్రియలు:–** 1. యజ్వభిః – యజ్వనా, యజ్వభ్యామ్, **యజ్వభిః**, నకారాన్త పుంలింగ యజ్వన్ శబ్దము. తృ.బ 2. వితతేషు – వితతే, వితతయోః, **వితతేషు,** అకారాన్త పుంలింగ వితత శబ్దము. స.బ 3. అధ్వరేషు – అధ్వరే, అధ్వరయోః, **అధ్వరేషు**, అకారాన్త నపుంసకలింగ అధ్వర శబ్దము. ద్వి.ఏ 4. సంభృతమ్ – **సంభృతమ్,** సంభృతే, సంభృతాని; అకారాన్త నపుంసకలింగ సంభృతశబ్దము. ద్వి.ఏ. 5. హవ్యమ్ – **హవ్యమ్**, హవ్యే, హవ్యాని, అకారాన్త నపుంసకలింగ హవ్య శబ్దము. ప్ర.ఏ 6. మాయీ – **మాయీ,** మాయినౌ, మాయినః, నకారాన్త పుంలింగ మాయిన్ శబ్దము. ప్ర.ఏ 7. సః – **సః,** తౌ, తే, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 8. నః– మమ, నౌ, **నః** , దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ష.బ 9. మిషతామ్ – మిషతః, మిషతోః, **మిషతామ్,** తకారాన్త పుంలింగ మిషత్ శబ్దము. ష.బ 10. జాత.. **ముఖాత్** , ముఖాత్, ముఖాభ్యామ్, ముఖేభ్యః అకారాన్త నపుంసకలింగ ముఖ శబ్దము. పం.ఏ 11. ఆచ్ఛినత్తి – క్రియ

**సమాసాలు:–**

1. జాతవేదోముఖాత్ – జాతవేదా ఏవ ముఖమ్ (కర్మధా) తస్మాద్.

**సంధులు:–**

1. యజ్వభిః + సమ్భృతమ్ – యజ్వభిస్సమ్భృతమ్ – విసర్గసన్ధిః
2. వితతేషు + అధ్వరేషు – వితతేష్వధ్వరేషు – యణాదేశసన్ధిః
3. జాతవేదోముఖాత్ + మాయీ – జాతవేదోముఖాన్మాయీ –అనునాసికసన్ధిః

అనునాసికసన్ధిః – **యరోఽనునాసికే అనునాసికో వా** (సూ.8-4-44) రహాలుతప్ప

తక్కిన పదాంతమందలి హల్లులకు (యర్రులకు) అనునాసిక వర్ణము పరముగనున్నచో ఆయావర్గాలకు సంబంధించిన అనునాసిక (ఞ / మఙణన) వర్ణమాదేశముగ వికల్పముగ వచ్చును.

**పదవ్యుత్పత్తి -నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1) యజ్వా**

ఎ) 'యజ్వన్' - నకారాన్త పుంలింగ శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము

బి) యజ్ 'సుయజోఙ్వనిప్' ఇతి ఙ్వనిప్.

సి) శ్లో॥ రాజా స **యజ్వా** విబుధవ్రజత్రా
కృత్వాధ్వరాజ్యోపమయైవ రాజ్యమ్।
భుంక్తే శ్రితశ్రోత్రియసాత్కృతశ్రీః
పూర్వం త్వహో శేషమశేషమన్త్యమ్ ॥ ఇతి నైషధచరితే 3-24

డి) శ్లో॥ నీపాన్వయః పార్థివ ఏష **యజ్వా**
గుణైర్యమాశ్రిత్య పరస్పరేణ।
సిద్ధాశ్రమం శాంతమివైత్య సత్త్వైః
నైసర్గికోఽప్యుత్ససృజే విరోధః ॥ ర.వం. 6-46

"యథావిధిగ యజ్ఞము చేసిన నీపవంశస్థుడైన ఈ రాజునందు మహర్షుల యాశ్రమములలో ఏనుగు, సింగము మొ॥ జంతువులు వానియొక్క సహజమయిన ద్వేషమును విడిచి యుండెడి రీతి జ్ఞానము, మౌనము మొదలయిన గుణములు వాని స్వాభావికమైన వైషమ్యమును వదలినవి. జ్ఞానముండిడి తావున మౌనము, ఐశ్వర్యముండెడి తావున దాతృత్వము, ఈ లాగున నొక సుగుణముండెడి వ్యక్తియందు మఱియొక సుగుణము సాధారణముగ నుండుట లేదు. (రాజు సకల గుణ సంపన్నుడని భావము) - వావిళ్ల

**క్రియాదర్శము:- ఆచ్ఛినత్తి** - ఆ - ఉపసర్గ, ఛిదర్ (ఛిద్) ద్వైధీకరణే (చీల్చుట) సకర్మకమ్, రుధాది ప్రకరణమ్ (7) అనిట్ (ఉభయ) పరస్మైపదీ, లట్.

ప్రథమపురుషరూపాలు :- **ఆచ్ఛినత్తి**, ఆచ్ఛిన్తః, ఆచ్ఛిన్దన్తి.

శ్లో॥ లునాతి లుమ్పతి తథా ఛినత్తీత్యాత్మనే త్రయమ్ ॥ 223

శ్లో॥ త్రుటతి చ్ఛోటయతి చ చుటతి చ్చుటతీతి చ ।
ఛేదనే వర్ధయతి చ చ్ఛ్యతి వృశ్చతి కృన్తతి ॥ 224



శ్లో॥ చతుర్దశ త్రోటయతి ద్యతి చ్ఛోదయతీత్యమీ ।
అని 'ఆఖ్యాతచన్ద్రికా ' 2/5/5 పేర్కొన్నది.

---

**అవతారికా:-** కిం బహునా సురపతేరశ్వరత్నమపి తేనాపహృతమాహ -

**శ్లో॥ ఉచ్చైరుచ్చైశ్శ్రవాస్తేన**
**హయరత్నమహారి చ ।**
**దేహబద్ధమివేన్ద్రస్య**
**చిరకాలార్జితం యశః ॥ 47**

**పదవిభాగము:-** ఉచ్చైః, ఉచ్చైశ్శ్రవాః, తేన, హయరత్నమ్, అహారి, చ, దేహబద్ధమ్, ఇవ, ఇన్ద్రస్య, చిరకాలార్జితమ్, యశః ।

**అన్వయక్రమము:-** చ తేన ఉచ్చైః ఉచ్చైశ్శ్రవాః హయరత్నం దేహబద్ధం చిరకాలార్జితమ్ ఇంద్రస్య యశః ఇవ అహారి ।

**ప్రతిపదార్థము:-** చ - మఱియు, తేన - ఆ తారకాసురునిచేత, ఉచ్చైః - ఉన్నతమైన, ఉచ్చైశ్శ్రవాః - ఉచ్చైశ్శ్రవమనుపేరుగలదైన, హయరత్నమ్ - గుఱ్ఱము, దేహబద్ధమ్ - రూపుదాల్చిన, చిరకాలార్జితమ్ - చాలాకాలము సంపాదించిన, ఇంద్రస్య - ఇంద్రునియొక్క, యశః ఇవ - కీర్తియోయన, అహారి - అపహరించబడెను.

**తాత్పర్యము:-** మఱియు, ఆ తారకాసురునిచేత ఉన్నతమైన ఉచ్చైశ్శ్రవమను పేరుగలదైన గుఱ్ఱము, రూపుదాల్చిన చాలాకాలము సంపాదించిన ఇంద్రునియొక్క కీర్తియో యన అపహరించబడెను.

**విభక్తులు / క్రియలు:-** 1. చ, ఇవ - అవ్యయము 2. తేన - **తేన**, తాభ్యామ్, తైః, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 3. ఉచ్చైః - అవ్యయము 4. ఉచ్చైశ్శ్రవాః - **ఉచ్చైశ్శ్రవాః**, ఉచ్చైశ్శ్రవసౌ, ఉచ్చైశ్శ్రవసః, సకారాన్త పుంలింగ ఉచ్చైశ్శ్రవస్ శబ్దము. ప్రథమాఏకవచనము 5. హయరత్నమ్ - **హయరత్నమ్,** హయరత్నే, హయరత్నాని, అకారాన్త నపుంసకలింగ హయరత్న శబ్దము ప్ర.ఏ 6. దేహబద్ధమ్ - **దేహబద్ధమ్**, దేహబద్ధే, దేహబద్ధాని, అకారాన్త నపుంసకలింగ దేహబద్ధశబ్దము. ప్ర.ఏ 7. చిరకాలార్జితమ్ - **చిరకాలార్జితమ్**, ఆర్జితే, ఆర్జితాని, అకారాన్త నపుంసకలింగ ఆర్జిత శబ్దము. ప్ర.ఏ 8. ఇంద్రస్య - **ఇంద్రస్య**, ఇంద్రయోః, ఇంద్రాణామ్, అకారాన్త పుంలింగ ఇంద్రశబ్దము. ష.ఏ 9. యశః - **యశః**, యశసీ, యశాంసి, సకారాన్త నపుంసకలింగ యశస్ శబ్దము. ప్ర.ఏ 10. అహారి - క్రియ (కర్మణిప్రయోగము) లుఙ్ ప్రథమపురుషైకవచనమ్.

**సమాసాలు:-**

1. ఉచ్చైశ్శ్రవా ః - ఉచ్చైః శ్రవః యస్య (బహుబ్రీహి) సః ।
2. హయరత్నమ్ - హయః రత్నమ్ ఇవ (కర్మధా) ।
3. దేహబద్ధమ్ - దేహేన బద్ధమ్ ( తృ.త) తత్ ।
4. చిరకాలార్జితమ్ - చిరం కాలాః (కర్మధా) చిరకాలాః చిరకాలైః ఆర్జితమ్,(తృ.త) ।

**సంధులు:-**

1. ఉచ్చైః + ఉచ్చైశ్శ్రవాః - ఉచ్చైరుచ్చైశ్శ్రవాః - విసర్గసన్ధిః
2. ఉచ్చైశ్శ్రవాః + తేన - ఉచ్చైశ్శ్రవాస్తేన - విసర్గసన్ధిః
3. ఇవ+ ఇన్ద్రస్య - ఇవేన్ద్రస్య - గుణసన్ధిః **ఆద్గుణః**

**పదవ్యుత్పత్తి - నిఘంటు ప్రమాణాలు - కావ్యప్రయోగాలు**

1. ఉచ్చైః - మహత్త్వే - అవ్యయకోషః (219)
   '- ఉత్కృష్టే' ఇతి శాకటాయనః ।'
1.' కిం పునర్యస్తథోచ్చైః...' మేఘదూతే 17
2. 'ఉచ్చైరుదాత్తః' (1-2-29)

ఇత్యాదిషు స్థలేషు ఊర్ధ్వభాగార్థకత్వమస్యేతి జ్ఞేయమ్ । తుంగత్వ ఔన్నత్యాదయో ఽస్యార్థవిశేషాః ప్రకరణానురోధేనోహ్యాః । అస్యావ్యయస్య ఘప్రత్యయాన్తస్య గుణవాచిత్వే 'కిమేత్ తిఙ్వ్యఘూదామ్' (5-4-11) ఇతి ఆముప్రత్యయే ఉచ్చైస్తరామ్ ఉచ్చైస్తమామ్ ఇతి సాధుః । యథా 'ఉచ్చైస్తరాం వా వషట్కారః' (1-2-35) ఇత్యత్ర । ద్రవ్యప్రకర్షే తు వివక్షితే 'ఉచ్చైస్తరోవృక్షః' ఇత్యాదిషు న ఆముప్రత్యయ ఇతి జ్ఞేయమ్ ।ఉచ్చకైః । ఉచ్చైఃకృత్య, ఉచ్చైఃకృత్వా, ఉచ్చైఃకారం వా ఆచష్టే । కేచిత్ ఏతదవ్యయం సుబన్త ప్రతిరూపకమితి మన్వతే । ఉచ్చశబ్దఔన్నత్యాద్యర్థకోఽస్తి, తస్య తృతీయాబహువచనే ఉచ్చైః ఇతి సమ్పద్యతే । తస్య ప్రతిరూపకమేతదితి తేషామాశయః । పరేతు సాన్తమేతదభ్యుపగచ్ఛన్తి ।

**క్రియాదర్శము :- అహారి** , హృఞ్ (హృ) హరణే (తీసికొనిపోవుట, దొంగిలించుట, నాశనము చేయుట) భ్వాదిప్రకరణమ్, అనిట్, ద్వికర్మకమ్, (ఉభయ) పరస్మైపదీ, కర్మణి, లుఙ్ ప్రథమపురుషైకవచనము. **అహారి**, అహారిషాతామ్, అహారిషత; పక్షే, **అహరి**, అహరిషాతామ్, అహరిషత.



**అలంకారములు:-** ఇట 'ఉత్ప్రేక్షా మఱియు అనుప్రాస'ము లున్నవని చెప్పదగును.

**లక్షణమ్-** అవివక్షితసామాన్యా కించిచ్చోపమయా సహ।
అతద్గుణ క్రియాయోగాదుత్ప్రేక్షాతిశయాన్వితా ॥ కావ్యాలంకారః 2-91

వివక్షితముకాని సాదృశ్యము కలదియు, కొంచెము ఉపమాసంబంధము కలదియు, ఏ గుణక్రియలు ఉన్నట్లు వర్ణింపబడునో అట్టి గుణక్రియలు లేనిదియు, అతిశయముతో కూడినదియు అగునది ఉత్ప్రేక్ష. ఉత్ప్రేక్షలో నాలుగు విషయము లుండవలెను.

ఎ) **ఇవాది** శబ్దములు ప్రయోగించినను కవికి సంభావనయందే (ఊహ) తాత్పర్యము కాని సాదృశ్యమునందు ఉండదు.
బి) ఇవాది శబ్దములను /ప్రయోగించుటచే కొంచెము ఉపమాచ్ఛాయ ఉండును.
సి) ఒక వస్తువునందు ఏ గుణక్రియలు ఉన్నట్లు వర్ణింపబడునో అవి వాస్తవమున అందు ఉండవు.
డి) అతిశయము ఉండును.

దేహబద్ధమ్, యశః ఇవ అని వర్ణింపబడుటచే నిది 'ఉత్ప్రేక్ష'యని చెప్పదగును.

---

**అవతారికా:-** తర్హి సామాద్యుపాయాః కథం న ప్రయుక్తాః । ఇత్యత్రాహ -

**శ్లో॥ తస్మిన్నుపాయాస్సర్వే నః**
**క్రూరే ప్రతిహతక్రియాః ।**
**వీర్యవన్త్యౌషధానీవ**
**వికారే సాన్నిపాతికే ॥ 48**

**పదవిభాగము :-** తస్మిన్, ఉపాయాః, సర్వే, నః, క్రూరే, ప్రతిహతక్రియాః, వీర్యవన్తి, ఔషధాని, ఇవ, వికారే, సాన్నిపాతికే.

**అన్వయక్రమము:-** క్రూరే తస్మిన్ నః సర్వే ఉపాయాః సాన్నిపాతికే వికారే వీర్యవన్తి ఔషధాని ఇవ ప్రతిహతక్రియాః భవన్తి ।

**ప్రతిపదార్థము:-** క్రూరే - క్రూరుడైన, తస్మిన్ - ఆ తారకాసురునియందు, నః - మాయొక్క, సర్వే - అన్ని, ఉపాయాః - ఉపాయములు, సాన్నిపాతికే - సాన్నిపాతకరోగముచే కలుగునట్టి, వికారే - వ్యాధిమీద, వీర్యవన్తి - సారముగలవైన

ఔషధాని – మందులు, ఇవ – వలె, ప్రతిహతక్రియాః – నిష్ఫల ప్రయోగములు గలవిగ, (భవన్తి – అగుచున్నవి).

**తాత్పర్యము:–** క్రూరుడైన ఆ తారకాసురునియందు మాయొక్క అన్ని ఉపాయములును సాన్నిపాతకరోగముచే కలుగునట్టి వ్యాధిమీద సారముగలవైన మందులు వలె నిష్ఫలప్రయోగములు గలవిగ అగుచున్నవి.

**విభక్తులు / క్రియలు :–**1. క్రూరే – **క్రూరే,** క్రూరయోః, క్రూరేషు, అకారాన్త పుంలింగ క్రూరశబ్దము. స.ఏ 2. తస్మిన్ – తస్మిన్, తయోః, తేషు, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. స.ఏ 3. నః – మమ/మే, ఆవయోః / నౌ, **అస్మాకమ్ / నః,** దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ష.ఏ 4. సర్వే– సర్వః, సర్వౌ, **సర్వే,** అకారాన్త పుంలింగ సర్వశబ్దము. ప్ర.బ 5. ఉపాయాః – ఉపాయః, ఉపాయౌ, **ఉపాయాః,** అకారాన్త పుంలింగ ఉపాయశబ్దము. ప్ర.బ 6. సాన్నిపాతికే – **సాన్నిపాతికే,** సాన్నిపాతికయోః, సాన్నిపాతికేషు, అకారాన్త పుంలింగ సాన్నిపాతిక శబ్దము. స.ఏ 7. వికారే – **వికారే,** వికారయోః, వికారేషు, అకారాన్త పుంలింగ వికార శబ్దము. స.ఏ 8. వీర్యవన్తి – **వీర్యవత్,** వీర్యవతీ, వీర్యవన్తి, తకారాన్త నపుంసకలింగ వీర్యవత్ శబ్దము. ప్ర.బ 9. ఔషధాని – ఔషధమ్, ఔషధే, **ఔషధాని,** అకారాన్త నపుంసకలింగ ఔషధ శబ్దము .ప్ర.బ

**సమాసాలు :–**

1. ప్రతిహతక్రియాః – ప్రతిహతాః క్రియాః యేషామ్(బహువ్రీహి)తే

**సంధులు:–**

1. తస్మిన్+ ఉపాయాః – తస్మిన్నుపాయాః – ఙముడాగమః ।
2. ఉపాయాః + సర్వే – ఉపాయాస్సర్వే – విసర్గసన్ధిః ।
3. వీర్యవన్తి + ఔషధాని – వీర్యవన్త్యౌషధాని – యణాదేశసన్ధిః ।
4. ఔషధాని + ఇవ – ఔషధానీవ – సవర్ణదీర్ఘసన్ధిః ।

**ఙముడాగమః – ఙమో హ్రస్వాదచి ఙముణ్ణిత్యమ్ (సూ. 8-3-32)** హ్రస్వమునకు పరముగానున్న 'ఙణన'లకు పరముగానున్న అచ్చునకు క్రమముగా ఙణనలు ఆగమముగ వచ్చును( ఙణనలకు ద్విత్వము వచ్చును)

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. సాన్నిపాతికే –**

ఎ) సన్నిపాతః సన్నిపాతాదుద్భూతః సాన్నిపాతికః ।

బి) సన్నిపాత దోషజన్యే జ్వరాదౌ మహావీర్యాణి భేషజాని ఇవ అస్మాకం దేవానాం సర్వే సామాదయః ఉపాయాః క్రూరే తస్మిన్





తారకాసురే నిష్ఫలా భవన్తీతి భావః

సన్నిపాతజ్వరాదావౌషధానాం నిష్ఫలత్వముక్తం వైద్యశాస్త్రే –

శ్లో॥ వాతపిత్తకఫానాం చ సన్నిపాతో యదా భవేత్ ।
తదా జాతో జ్వరస్తీవ్రో హ్యసాధ్యః సర్వభేషజైః ॥ ఇతి

సన్నిపాతమనగా – **వాతపిత్తశ్లేష్మముల** మూటియొక్క సమానముగా నగు నాధిక్యత. – 'విమలా' సంస్కృతవ్యాఖ్య

**అలంకారములు:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును. ఉపమానోపమేయయోః సాధారణం ధర్మమాహ – క్రూర ఇతి. అసురవిజయిత్వాదభేద్యచిత్తే దోషత్రయసమ్భూతత్వాదసాధ్యే చేత్యర్థః । – 'వివరణమ్ ' వ్యాఖ్య

---

**అవతారికా:–** తత్ర జయాశాయాం వైఫల్యమాహ ।

**శ్లో॥ జయాశా యత్ర చాస్మాకం**
**ప్రతిఘాతోత్థితార్చిషా ।**
**హరిచక్రేణ తేనాస్య**
**కణ్ఠే నిష్కమివార్పితమ్ ॥ 49**

**పదవిభాగము:–** జయాశా, యత్ర, చ, అస్మాకమ్, ప్రతిఘాతోత్థితార్చిషా, హరిచక్రేణ, తేన, అస్య, కణ్ఠే, నిష్కమ్, ఇవ, అర్పితమ్ ।

**అన్వయక్రమము:–** యత్ర అస్మాకం జయాశా ప్రతిఘాతోత్థితార్చిషా తేన హరిచక్రేణ చ అస్య కణ్ఠే నిష్కమ్ అర్పితమ్ ఇవ ।

**ప్రతిపదార్థము:–** చ – ఇంకను, యత్ర – దేనియందు (ఏ శ్రీమహావిష్ణువు చక్రమునందు), అస్మాకమ్ – మాకు, జయాశా – గెలుపుయొక్క కోరిక (ఉండెనో), ప్రతిఘాతోత్థితార్చిషా – ప్రతిఘాతముచే వెడలిన జ్వాలగల, తేన – ఆ, హరిచక్రేణ – హరిచక్రముచే, అస్య – ఈ తారకాసురునియొక్క, కణ్ఠే – కంఠమున, నిష్కమ్ – వక్షస్థలాంలకారము, అర్పితమ్ ఇవ – అర్పించబడినదివలె (ఆసీత్ – ఆయెను)

**తాత్పర్యము:–** ఇంకను, దేనియందు మాకు గెలుపుకోరిక (ఉండెనో) ప్రతిఘాతముచే వెడలిన జ్వాలగల ఆ హరిచక్రముచే, ఈ తారకాసురునియొక్క కంఠమున వక్షస్థలాలంకారము అర్పించబడినదివలె ఆయెను.

**విభక్తులు / క్రియలు:-** 1. చ,యత్ర, ఇవ - అవ్యయాలు, 2. అస్మాకమ్ - మమ / మే , ఆవయోః / నౌ, **అస్మాకమ్/నః,** దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ష.బ 3. జయాశా - జయాశా, జయాశే, జయాశాః, ఆకారాన్త స్త్రీలింగ జయాశా శబ్దము. ప్ర.ఏ 4. ప్రతి...ర్చిషా.. **అర్చిషా...**అర్చిర్భ్యామ్,... అర్చిర్భిః. సకారాన్త నపుంసకలింగ అర్చిస్ శబ్దము. తృ.ఏ 5. తేన - **తేన,** తేభ్యామ్, తైః, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 6,.హరిచక్రేణ - **హరిచక్రేణ,** హరిచక్రాభ్యామ్, హరిచక్రైః, అకారాన్త నపుంసకలింగ హరిచక్రశబ్దము. తృ.ఏ 7. అస్య - **అస్య,** అనయోః, ఏషామ్, మకారాన్త పుంలింగ 'ఇదమ్' శబ్దము. ష.ఏ 8. కణ్ఠే - **కణ్ఠే,** కణ్ఠయోః, కణ్ఠేషు, అకారాన్త పుంలింగ 'కణ్ఠ' శబ్దము. స.ఏ 9. నిష్కమ్ - **నిష్కమ్,** నిష్కే, నిష్కాణి, అకారాన్త నపుంసకలింగ నిష్క శబ్దము. ప్ర.ఏ 10. అర్పితమ్ - అర్పితమ్, అర్పితే, అర్పితాని, అకారాన్త నపుంసకలింగ 'అర్పిత' శబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు :-**

1. జయాశా - జయస్య ఆశా (ష.త)।
2. ప్రతిఘాతోత్థితార్చిషా - ప్రతిఘాతేన ఉత్థితమ్, ప్రతిఘాతోత్థితమ్ (తృ.త) ప్రతిఘాతోత్థితమ్ అర్చిః యస్య (బహువ్రీహి) తేన ।
3. హరిచక్రేణ - హరేః చక్రమ్ (ష.త) తేన ।

**సంధులు:-**

1. చ + అస్మాకమ్ - చాస్మాకమ్ - సవర్ణదీర్ఘసన్ధిః
2. తేన + అస్య - తేనాస్య - సవర్ణదీర్ఘసన్ధిః
3. ఇవ + అర్పితమ్ - ఇవార్పితమ్ - సవర్ణదీర్ఘసన్ధిః

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

1. హరిచక్రేణ - చక్రమ్ (నపుంసక)

ఎ) క్రియతేఽనేనేతి, కృ+ ఘ, ఇ+ ర్థే క, కృఞాదీనామితి ద్విత్వఇచ్చ ।

బి) శ్లో॥ తతో భగవతా తస్య శిరశ్ఛిన్నమలంకృతమ్ ।
చక్రాయుధేన చక్రేణ పిబతోఽమృతమోజసా ॥
- ఇతి మహాభారతే (1-19-6)

సి) సుదర్శనం- ఇదొక చక్రం. దీని పుట్టువును గుఱించి మూడు గాథలు

1. సూర్యభగవానుడు విశ్వకర్మ పుత్రిక సంజ్ఞను వివాహమాడుతాడు. సూర్యతేజాన్ని భరించలేనని సంజ్ఞ తన తండ్రి విశ్వకర్మతో చెప్పగా, విశ్వకర్మ ఒక యంత్రం ద్వారా సూర్యతేజస్సును తగ్గిస్తాడు. యంత్రంలో సూర్యునిపెట్టి త్రిప్పిన సందర్భాన రాలిన రజం వల్ల విశ్వకర్మ చక్రాన్ని తయారుచేస్తాడు. ఇది విష్ణువుకు



ఇవ్వబడుతుంది. విష్ణుపురాణం - 3-2

2. ఇంద్రుడు వర్షాన్ని వర్షించడంవల్ల ఖాండవదహనాన్ని అడ్డుకుంటాడు. ఆ సందర్భాన సుదర్శనాన్ని గాండీవాన్ని కృష్ణార్జునులకు అగ్నిదేవుడు ప్రసాదిస్తాడు. అందుచేత సుదర్శనానికి 'ఆగ్నేయం' అని కూడా పేరు.

3. సుదర్శనాయుధాన్ని శివుడు కృష్ణునకు ఇచ్చినట్లు మహాభారతములో కనబడుతుంది. నీటిలో నివసించే ఒకానొక దైత్యుని సంహరించేందుకు గాను చక్రాన్ని శివుడు విష్ణువునకు ఇస్తాడు.

సుదర్శనానికి సంబంధించి - పురాణాలలో అనేక గాథలున్నాయి. కృష్ణావతారానికి పూర్వమే సుదర్శనం విష్ణువు దగ్గర ఉంది. మహాభారతం - ఆదిపర్వం 16వ అధ్యాయంలో సుదర్శన చక్రాన్ని గుఱించిన వర్ణన చేయబడినది.

సుదర్శనచక్రరాజశతకంనుండి

డి) శ్రీ కూరనారాయణ యతీంద్రులు 'సుదర్శన' శతకము చెప్పగా, దానిని ఆంధ్రభాషలోనికి ఇటీవల అనువదించినారు శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు. శ్రీ కూరనారాయణయతీంద్రుల వారి **'సుదర్శన'** శతక ప్రథమశ్లోకాన్ని ఇట అనుసంధానము చేసికొందుము.

శ్లో॥ సౌదర్శన్యుజ్జిహానా దిశి విదిశి తిరస్కృత్య సావిత్రమర్చిః
బాహ్యాబాహ్యాంధకారక్షతజగదగదంకారభూమ్నా స్వధామ్నా ।
దోః ఖర్జూదూరగర్జద్విబుధరిపువధూకంఠవైకల్యకల్యా
జ్వాలాజాజ్వల్యమానా వితరతు భవతాం వీప్సయాభీప్సితాని ॥

సుదర్శనజ్వాల సూర్యకాంతిని మించిన తన తేజస్సుచే అంధకారమును బోగొట్టుచున్నది. జనులను జ్ఞానవంతులుగా చేయుచున్నది. దుర్మార్గులగు దానవులను చంపుచున్నది. అట్టి సుదర్శనజ్వాల ఆశ్రితుల అభీష్టములను ఎల్లప్పుడూ ప్రసాదించుగాక.

ఇ) శ్రీమాన్ ఉత్పల సత్యన్నారాయణాచార్యులు గారు ' శ్రీకృష్ణచంద్రోదయం'లో పంచభూతములకు పంచాయుధములు ప్రతీక అనే విషయాన్ని సూచించారు.

జలతత్త్వంబది శంఖమై ప్రబలతేజస్తత్త్వమే **చక్రమై**
అలఘుశ్రీ భువనాంశకంబు కమలంబైయొప్ప, వాయ్వంశ సం
కలనంబే గదయై, చతుర్భుజములన్ చైతన్యరూపంబులై
విలసిల్లన్ చెఱసాలలోన హరి యావిర్భావమొందెన్ కృపన్.

ఎఫ్) పంచాయుధస్తోత్రంలో సుదర్శనస్తుత్యాత్మక శ్లోకం దిగువనీయబడింది.

శ్లో॥ స్ఫురత్ సహస్రారశిఖాతితీవ్రం
సుదర్శనం భాస్కరకోటితుల్యమ్।
సురద్విషాం ప్రాణవినాశి విష్ణోః
**చక్రం** సదాహం శరణం ప్రపద్యే ॥

జి) మరిన్ని వివరములకు పాంచరాత్రాగమ 'అహిర్బుధ్న్యసంహిత' చూడగలరు.

**అలంకారములు:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకారము'న్నదని చెప్పదగును. 'కణ్ఠకాఠిన్యాత్ ప్రతిహతప్రజ్వలితేన కంఠగతేన హరిచక్రేణ హేతునాస్య కణ్ఠే నిష్కోఽర్పిత ఇవేత్యుత్ప్రేక్షతే – 'ప్రకాశికా'

---

**అవతారికా:–** అథ తదవష్టమ్భేన తారకాసురస్య హస్తినాం దుర్విలసితమాహ –

**శ్లో॥ తదీయాస్తోయదేష్వద్య**
**పుష్కరావర్తకాదిషు ।**
**అభ్యస్యన్తి తటాఘాతం**
**నిర్జితైరావతా గజాః ॥** **50**

**పదవిభాగము:–** తదీయాః, తోయదేషు, అద్య, పుష్కరావర్తకాదిషు, అభ్యస్యన్తి, తటాఘాతమ్, నిర్జితైరవతాః, గజాః ।

**అన్వయక్రమము:–** అద్య నిర్జితైరావతాః తదీయాః గజాః పుష్కరావర్తకాదిషు తోయదేషు తటాఘాతమ్ అభ్యస్యన్తి ।

**ప్రతిపదార్థము:–** అద్య – ఇప్పుడు, నిర్జితైరావతాః – ఓడింపబడిన ఐరావతము గలవైన, తదీయాః – ఆ తారకాసురునివైన, గజాః – ఏనుగులు, పుష్కరావర్తకాదిషు – పుష్కరములు, ఆవర్తకములును లోనగునట్టి, తోయదేషు – మేఘములయందు, తటాఘాతమ్ – వప్రక్రీడను, అభ్యస్యన్తి – నేర్చుకొనుచున్నవి,

**తాత్పర్యము:–** ఇప్పుడు ఐరావతమును ఓడించిన ఆ తారకాసురునివగు ఏనుగులు పుష్కరములు, ఆవర్తకములును లోనగునట్టి మేఘములయందు వప్రక్రీడను నేర్చుకొనుచున్నవి.





**విభక్తులు / క్రియలు:–** 1. అద్య – అవ్యయము 2. నిర్జిత+ ఐరావతాః – ఐరావతః, ఐరావతౌ, **ఐరావతాః,** అకారాన్త పుంలింగ ఐరావత శబ్దము. ప్ర.బ 3. తదీయాః – తదీయః, తదీయౌ, **తదీయాః** అకారాన్త పుంలింగ తదీయ శబ్దము. ప్ర.బ 4. గజాః – గజః, గజౌ, **గజాః,** అకారాన్త పుంలింగ గజశబ్దము. ప్ర.బ 5.పు..దిషు.. ఆదౌ, ఆద్యోః, ఆదిషు, ఇకారాన్త పుంలింగ **పుష్కరావర్తకాదిశబ్దము.** స.బ 6. తోయదేషు – తోయదే, తోయదయోః, **తోయదేషు,** అకారాన్త పుంలింగ తోయదశబ్దము. స.బ 7. తటాఘాతమ్ – **తటాఘాతమ్**, తటాఘాతౌ, తటాఘాతాన్, అకారాన్త పుంలింగ తటాఘాతశబ్దము. ద్వి.ఏ 8. అభ్యస్యన్తి – క్రియ – (అభి + అస్ + లట్ ) ప్రథమపురుష బహువచనము.

**సమాసాలు:–**

1. నిర్జితైరావతాః – నిర్జితః ఐరావతః యైః (బహువ్రీహి) తే ।
2. పుష్కరావర్తకాదిషు – పుష్కరాశ్చ ఆవర్తకాశ్చ ఆదయః యేషామ్ (బహువ్రీహి) తేషు ।
3. తోయదేషు – తోయాని దదతీతి (ఉపపదతత్పురుష) తోయదాః తేషు ।
4. తటాఘాతమ్ – తటే ఆఘాతః (స.త) తటాఘాతః, తమ్ ।

**సంధులు:–**

1. నిర్జిత+ ఐరావతాః – నిర్జితైరావతాః – వృద్ధిసన్ధిః ।

ఎ) **వృద్ధిరేచి** (సూ. 6–1–85) అవర్ణమునకు (అఆలకు) ఏఓఐఔలు పరమగునపుడు పూర్వపరముల స్థానములో వృద్ధి ఏకాదేశమగును. ఏఐలు పరమగునపుడు ఐకారము, ఓఔలు పరమగునపుడు ఔకారము వచ్చునని తాత్పర్యము.

2. తదీయాః + తోయదేషు – తదీయాస్తోయదేషు – విసర్గసన్ధిః
3. తోయదేషు + అద్య – తోయదేష్వద్య – యణాదేశసన్ధిః

బి) **ఇకో యణచి** (సూ. 6–1–74) ఇఉఋలు వర్ణములకు అసవర్ణమైన అచ్చు పరముగ నున్నప్పుడు క్రమముగ య్,వ్,ర్,ల్, (యణ్) అనునవి ఆదేశమగును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

**1) తటాఘాతమ్ – వప్రక్రీడ**

ఎ) తుల్యభావమున్న రఘువంశమునందలి (5–44) శ్లోకాన్ని చూడండి.

శ్లో॥ నిశ్శేషవిక్షాళితధాతునాఽపి
వప్రక్రియామృక్షవతస్తటేషు ।
నీలోర్ధ్వరేఖాశబలేన శంసన్
దంతద్వయేనాశ్మవికుంఠితేన ॥

"ఆ యేనుగు నీటిలో మునగుటవలన గావురాయి గుఱుతులు మాసిపోయినను దంతములయందు చిత్రవర్ణములుగల నిడుపుగీతలు నక్కడక్కడ వ్రేటుపడి విఱిగిన గుఱుతులను తెలియుచున్నందున సమీపముననున్న ఋక్షపర్వతపు చరియలయందు కొమ్ములతో **వప్రక్రీడ** యొనర్చినట్లు చూపరులకు తెలియుచుండెను."

బి) శ్లో॥ తస్మిన్నద్రౌ కతిచిదబలా విప్రయుక్తస్స కామీ
నీత్వా మాసాన్కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః ।
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడా పరిణతగజప్రేక్షణీయం దదర్శ ॥ మేఘదూతమ్ 2

ఇట 'మృణాళినీ వ్యాఖ్యా' చూడదగును. (స్వకీయ)

**క్రియాదర్శము:–** 1. **అభ్యస్యన్తి** – అభి – ఉపసర్గ, అసు (క్షేపణే) దివాదిప్రకరణమ్ (4) పరస్మైపదీ, సకర్మకమ్, సేట్, లట్ ప్రథమపురుషబహువచనము, రూపాలు– అభ్యస్యతి – అభ్యస్యతః – **అభ్యస్యన్తి**

---

**అవతారికా:–** అథ తస్య ప్రతికారం కర్తుం ప్రార్థయతే –

**శ్లో॥ తదిచ్ఛామో విభో ! స్రష్టుం**
**సేనాన్యం తస్య శాన్తయే ।**
**కర్మబన్ధచ్ఛిదం ధర్మం**
**భవస్యేవ ముముక్షవః ॥ 51**

**పదవిభాగము:–** తత్, ఇచ్ఛామః, విభో! స్రష్టుమ్, సేనాన్యమ్, తస్య, శాన్తయే, కర్మబన్ధచ్ఛిదమ్, ధర్మమ్, భవస్య, ఇవ, ముముక్షవః ।

**అన్వయక్రమము:–** తత్ హే విభో ! ముముక్షవః భవస్య శాన్తయే కర్మబన్ధచ్ఛిదం, ధర్మమ్ ఇవ తస్య శాన్తయే సేనాన్యం స్రష్టుమ్ ఇచ్ఛామః ।

**ప్రతిపదార్థము:–** తత్ – కావున, హే విభో – ఓ స్వామీ, ముముక్షవః – మోక్షము కోరువారు, భవస్య – సంసారముయొక్క, శాన్తయే – నాశము కొఱకు కర్మబన్ధచ్ఛిదమ్ – కర్మయను కట్టును త్రెంపునదైన, ధర్మమ్ – ధర్మమును, ఇవ – వలె, తస్య – ఆ తారకాసురునియొక్క, శాన్తయే – నాశముకొఱకు, సేనాన్యమ్ – సేనానాయకుని, స్రష్టుమ్ – సృజింపవలయునని, ఇచ్ఛామః – కోరుచున్నాము.





**తాత్పర్యము:–** కావున, ఓ బ్రహ్మదేవా! స్వామీ! మోక్షము కోరువారు సంసారముయొక్క నాశముకొఱకు కర్మయను కట్టును త్రెంపునదైన ధర్మమును వలె, ఆ తారకాసురుని నాశముకొఱకు సేనానాయకుని సృజింప కోరుచున్నాము.

**విభక్తులు / క్రియలు:–** 1. తత్ – అవ్యయము, 2. హే విభో – **హే విభో,** హే విభూ, హే విభవః – ఉకారాన్త పుంలింగ 'విభు'శబ్దము సం.ప్ర.ఏ, 3. ముముక్షవః – ముముక్షుః, ముముక్షూ, **ముముక్షవః** – ఉకారాన్త పుంలింగ 'ముముక్షు' శబ్దము. ప్ర.ఏ 4. భవస్య – **భవస్య,** భవయోః, భవానామ్, – అకారాన్త పుంలింగ 'భవ' శబ్దము. ష.ఏ 5. శాన్తయే – **శాన్తయే,** శాన్తిభ్యామ్, శాన్తిభ్యః, ఇకారాన్త స్త్రీలింగ 'శాన్తి' శబ్దము. చ.ఏ 6. కర్మబన్ధచ్ఛిదమ్ – **ఛ్ఛిదమ్**, ఛ్ఛిదౌ, ఛ్ఛిదాన్, అకారాన్త పుంలింగ 'ఛిద' శబ్దము. ద్వి.ఏ 7. ధర్మమ్ – **ధర్మమ్,** ధర్మౌ, ధర్మాన్, అకారాన్త పుంలింగ ధర్మ శబ్దము, ద్వి.ఏ 8. ఇవ – అవ్యయము 9. తస్య – **తస్య**, తయో, తేషామ్, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ష.ఏ 10. సేనాన్యమ్ – **సేనాన్యమ్,** సేనాన్యే, సేనాన్యః, ఈకారాన్త విశేష పుంలింగ సేనానీ శబ్దము. ద్వి.ఏ 11. స్రష్టుమ్ – అవ్యయము (తుమున్ ప్రత్యయాన్తము) 12. ఇచ్ఛామః – క్రియ ,ఇష్ – ధాతువు ఉత్తమపురుషబహువచనము లట్.

**సమాసాలు:–**

1. కర్మబంధచ్ఛిదమ్ – కర్మ ఏవ బంధః (మయూరవ్యంసకాదికర్మధా)
   కర్మబంధం ఛినత్తీతి (ఉపపదతత్పురుష), కర్మబన్ధచ్ఛిత్, తమ్

**సంధులు:–**

1. ఇచ్ఛామః+ విభో – ఇచ్ఛామో విభో –ఉత్వాదేశసన్ధిః
2. భవస్య+ ఇవ – భవస్యేవ – గుణసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. ధర్మః –** ఎ) ధరతి లోకాన్, ధ్రియతే పుణ్యాత్మభిరితి వా ।

బి) ధృ 'అర్తిస్తుహు(మితి' మన్

సి)శ్లో॥ ఏక ఏవ సుహృద్ధర్మో – నిధనేఽ ప్యనుయాతి యః ।
శరీరేణ సమం నాశం–సర్వమన్యత్తు గచ్ఛతి॥ ఇతి హితోపదేశే 1–59

డి)శ్లో॥ కృత్వా ప్రవర్గ్యం యథావత్ ద్విజసత్తమాః ।
చక్రుస్తే విధివద్రాజంస్తథైవాభిషవం ద్విజాః ॥
ఇతి మహాభారతే 14/99/21

ఇ) తైత్తిరీయోపనిషత్తు 'ధర్మ' శబ్దాన్నిగుఱించి ఇలా చెపుతుంది. 1–11–1

ఎఫ్) "సత్యం వద, ధర్మం చర, ధర్మాన్న ప్రమదితవ్యమ్," స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ । వేదాధ్యయనానంతరము శిష్యుడు

గురుకులమునుండి ఇంటికి తిరిగి వచ్చునపుడు ఆచార్యుడు చేయు ధర్మోపదేశము. 'సత్యమును చెప్పుము, ధర్మమును ఆచరింపుము. అధ్యయన మొనర్చుటను వీడవలదు... ధర్మమునుండి తప్పి నడువవలదు. అధ్యయన, అధ్యాపనములందు ఉదాసీనుడవు కావద్దు...

2) యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః యథా తే తత్ర వర్తేరన్. తథా తత్ర వర్తేథాః,... ఆయా విషయములను చక్కగా విచారించి ఏకాగ్రచిత్తము గల బుద్ధిశాలురగు పెద్దలు దయాశీలురు ధర్మేచ్ఛగల బ్రాహ్మణులు ఆయా సందర్భములయందు ఎలా చరింతురో ఆ ప్రకారమాచరింపుము

ఎఫ్ 1) భగవద్గీత (4.7) చూడండి.

శ్లో॥ యదా యదా హి **ధర్మస్య** గ్లానిర్భవతి భారత ! ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥

" ఓ భారతా ! ఎప్పుడెప్పుడు ధర్మహానియు అధర్మోత్కర్షతయు నగునో అపుడపుడు ఆయా కాలములయందు నన్ను నేను సృజించుకొందును" అటువంటి మహత్వము గలది **'ధర్మము'**

2) భగవద్గీత (4.8) చూడండి.

శ్లో॥ పరిత్రాణామ్ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

'సాధుజనసంరక్షణ, దుష్టజనశిక్షణ, మఱియు ధర్మ సంస్థాపనార్థమై నేను యుగయుగములయందు పుట్టెదను" అటువంటి మహత్వము గలది 'ధర్మము'.

**క్రియాదర్శము:–** 1. **ఇచ్ఛామః** – ఇష (ఇష్) ఇచ్ఛాయామ్) కోరుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్ ఉత్తమపురుషబహువచనము. రూపాలు – ఇచ్ఛామి, – ఇచ్ఛావః, **ఇచ్ఛామః**

**అలంకారములు:–** ఇట 'ఉపమాలంకారమున్నదని చెప్పదగును. అన్వయము – సరళము.

---

**అవతారికా:–** సేనానీసృష్టేః ఫలమాహ – సేనానిని సృష్టించుటవలన కలుగు ఫలమును చెప్పుచున్నాడు.





**శ్లో॥ గోప్తారం సురసైన్యానాం**
**యం పురస్కృత్య గోత్రభిత్ ।**
**ప్రత్యానేష్యతి శత్రుభ్యో**
**బన్దీమివ జయశ్రియమ్ ॥ 52**

**పదవిభాగము:–** గోప్తారమ్, సురసైన్యానామ్, యమ్, పురస్కృత్య, గోత్రభిత్, ప్రత్యానేష్యతి, శత్రుభ్యః, బన్దీమ్, ఇవ, జయశ్రియమ్ ।

**అన్వయక్రమము:–** సురసైన్యానాం గోప్తారం యం పురస్కృత్య గోత్రభిత్ జయశ్రియమ్ ఇవ శత్రుభ్య ప్రత్యానేష్యతి ।

**ప్రతిపదార్థము:–** సురసైన్యానామ్ – దేవతాసేనలయొక్క, గోప్తారమ్ – రక్షకుడగు యమ్ – ఏ సేనానాయకుని, పురస్కృత్య – ముందుంచుకొని, గోత్రభిత్ – ఇంద్రుడు (కొండలను చీల్చువాడైన), జయశ్రియమ్ – జయలక్ష్మిని, బందీమ్+ఇవ – బందీగా చేయబడిన స్త్రీనివలెను, శత్రుభ్యః – వైరులనుండి, ప్రత్యానేష్యతి – తిరిగి తెచ్చునో.

**తాత్పర్యము:–** దేవతాసేనలయొక్క రక్షకుడగు ఏ సేనానాయకుని ముందుంచుకొని ఇంద్రుడు జయలక్ష్మిని బందీగా చేయబడిన స్త్రీని వలెను వైరులనుండి తిరిగి తెచ్చునో.

**విభక్తులు / క్రియలు:–** 1. సురసైన్యానామ్ – సురసైన్యస్య , సురసైన్యయోః, **సురసైన్యానామ్,** అకారాన్త పుంలింగ సురసైన్య శబ్దము. ష.బ 2. గోప్తారమ్ – **గోప్తారమ్,** గోప్తారౌ, గోప్తౄన్, ఋకారాన్త పుంలింగ గోప్తృశబ్దము. ద్వి.ఏ 3. యమ్ – **యమ్,** యౌ, యాన్, దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ద్వి.ఏ 4. పురస్కృత్య – ల్యబన్తము – (పురస్+ కృ + క్త్వా) అవ్యయము 5. గోత్రభిత్ **–గోత్రభిత్,** గోత్రభిదౌ, గోత్రభిదః, దకారాన్త పుంలింగ గోత్రభిద్ శబ్దము. ప్ర.ఏ 6. జయశ్రియమ్– **జయశ్రియమ్,** జయశ్రియౌ, జయశ్రియః, ఈకారాన్త స్త్రీలింగ జయశ్రీ శబ్దము. ద్వి.ఏ 7. బందీమ్ – **బందీమ్,** బంద్యౌ, బందీః, ఈకారాన్త స్త్రీలింగ **బందీ** శబ్దము. ద్వి.ఏ 8. ఇవ – అవ్యయము 9. శత్రుభ్యః – శత్రోః, శత్రుభ్యామ్, **శత్రుభ్యః,** ఉకారాన్త పుంలింగ శత్రుశబ్దము. పంచమీ బహువచనము 10. ప్రత్యానేష్యతి – ప్రతి+ ఆ + నీ+లృట్ ప్రథమపురుషైకవచనమ్

**సంధులు:–** 1. శత్రుభ్యః+ బన్దీమ్ – శత్రుభ్యో బన్దీమ్ – ఉత్వాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి– నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

1. శత్రుః– ఎ) శాతయతి ఇతి, శద్లృశాతనే+ ణిచ్ + 'రు శాతిభ్యామ్ క్రున్ ఇతి క్రున్ ఉణాదిసూత్రమ్ (4–103)

బి)శ్లో॥ అభియాతి రరాతి రమిత్రరిపూ
ప్రతిపక్ష విపక్ష విరోధ్యరయః ।
అహితోఽ సహనశ్చ జిఘాంసురితి
ప్రథితాః పరిపంథి పరా సుహృదః ॥455

శ్లో॥ ప్రత్యర్థీ పర్యవస్థాతా ద్వేషీ వైరీ చ శాత్రవః ।
శత్రుః సపత్నో భ్రాతృవ్యః ప్రత్యనీకో ద్విషన్మతః ॥ 456

సి)శ్లో॥ ఋణకర్తా పితా శత్రుర్మాతా చ వ్యభిచారిణీ ।
భార్యా రూపవతీ శత్రుః పుత్రః శత్రురపండితః ॥ 'సుభాషితమ్'

అప్పులున్న తండ్రి, వ్యభిచారిణియైన తల్లి, రూపవతియైన భార్య, అపండితుడైన పుత్రుడున్ను - శత్రువు. ।

డి) తనకు తానే శత్రువు-తనకు తానే మిత్రుడు అంటుంది భగవద్గీత (6-6)

"శ్లో॥ బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥"

'ఎవడు తన్నుతానే జయించి యున్నాడో అనగా మనస్సుయొక్క చేష్టల ననుసరింపడో అతడు తనకు తానే బంధువు - మిత్రుడు. ఎవడు మనస్సునకు లొంగెనో ఆత్మజ్ఞానవిహీనుడో అతడు తనకు తానే శత్రువువలె నుండి.

2) **బందీమివ** :- It is very common with the Sanskrit poets to describe జయశ్రీ as a woman who is carried off by force - Karmankar.

శ్లో॥ జ్యాఘాతరేఖే సుభుజో భుజాభ్యం
బిభర్తి యశ్చాపభృతాం పురోగః ।
రిపుశ్రియాం సాంజనబాష్పసేకే
బన్దీకృతానామివ పద్ధతీ ద్వే ॥ ర.వం. 6-55

for a similar use of 'ఇవ'

శ్లో॥ ఆవర్జ్య శాఖాః సదయం చ యాసాం
పుష్పాణ్యుపాత్తాని విలాసినీభిః ।
వన్యైః పులిందైరివ వానరైస్తాః
క్లిశ్యన్త ఉద్యానలతా మదీయాః ॥

ఈ పద ప్రయోగాన్నీ వివరిస్తూ - ఈ శ్లోకాన్ని ఉదాహరించినాడు - కాలే మహాశయుడు





**క్రియాదర్శము:-** **ప్రత్యానేష్యతి** - ప్రతి, ఆ - ఉపసర్గలు, ణీ ఞ్ (నీ) ప్రాపణే (తీసికొనివెళ్లుట) భ్వాదిప్రకరణమ్ (1)సకర్మకమ్, అకర్మకమ్ (ఉభయ) పరస్మైపదీ, లృట్ ప్రథమపురుషరూపాలు - **ప్రతి. ఆ. నేష్యతి** ప్రత్యానేష్యతః - ప్రత్యానేష్యన్తి

**అలంకారము:-** ఇట 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును. అన్వయము సరళము.

---

**అవతారికా:-** అథ ప్రజాపతేః ప్రతివచనమాహ ।

**శ్లో॥ వచస్యవసితే తస్మిన్**
**ససర్జ గిరమాత్మభూః ।**
**గర్జితానన్తరాం వృష్టిం**
**సౌభాగ్యేన జిగాయ యా॥ 53**

**పదవిభాగము:-** వచసి, అవసితే, తస్మిన్, ససర్జ, గిరమ్, ఆత్మభూః, గర్జితానన్తరామ్, వృష్టిమ్, సౌభాగ్యేన, జిగాయ, యా ।

**అన్వయక్రమము:-** తస్మిన్ వచసి అవసితే ఆత్మభూః గిరమ్ ససర్జ । సా సౌభాగ్యేన గర్జితానన్తరాం వృష్టిం జిగాయ॥

**ప్రతిపదార్థము:-** తస్మిన్ వచసి - ఆ బృహస్పతి పలుకు(ట), అవసితే (సతి) - పూర్తియైనది కాగా, ఆత్మభూః - బ్రహ్మదేవుడు, గిరమ్ - వాక్కును, ససర్జ - సృజించెను, సా - ఏ వాక్కు, సౌభాగ్యేన - సొంపుచేత, గర్జితానన్తరామ్ - ఉఱుము అనుసరించునదైన, వృష్టిమ్ - వర్షమును, జిగాయ - జయించెనో.

**తాత్పర్యము:-** ఆ బృహస్పతి పలుకు(ట) పూర్తియైనది కాగా, బ్రహ్మదేవుడు వాక్కును సృజించెను. ఏ వాక్కు సొంపుచేత ఉఱుమును అనుసరించునదైన వర్షమును జయించెనో. (దేవతల విన్నపమునకు బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడనుట)

**విభక్తులు /క్రియలు:-** 1. తస్మిన్ - **తస్మిన్,** తయోః, తేషు, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. స.ఏ 2. వచసి - **వచసి,** వచసోః, వచఃసు, సకారాన్త నపుంసకలింగ వచశ్శబ్దము. స.ఏ 3. అవసితే - **అవసితే,** అవసితయోః, అవసితేషు, అకారాన్త నపుంసకలింగ అవసిత శబ్దము. స.ఏ 4. ఆత్మభూః - **ఆత్మభూః,** ఆత్మభువౌ, ఆత్మభువః, ఊకారాన్త పుంలింగ ఆత్మభూశబ్దము. ప్ర.ఏ 5. గిరమ్ - గిరమ్, గిరౌ, గిరః, రేఫాన్త స్త్రీలింగ గీర్శబ్దము. ద్వి.ఏ 6. ససర్జ -క్రియ (సృజ్ + లిట్) - ప్రథమపురుషైక వచనము 7. సా - **సా, తే,** తాః, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 8. సౌభాగ్యేన - **సౌభాగ్యేన,**

సౌభాగ్యాభ్యామ్, సౌభాగ్యైః, అకారాన్త నపుంసకలింగ సౌభాగ్యశబ్దము. తృ.ఏ 9. గర్జితానన్తరామ్ – **గర్జితానన్తరామ్,** గర్జితానన్తరే, గర్జితానన్తరాః, ఆకారాన్త స్త్రీలింగ గర్జితానన్తరాశబ్దము. ద్వి.ఏ 10. వృష్టిమ్ – **వృష్టిమ్** ,వృష్టీ, వృష్టీః, ఇకారాన్త స్త్రీలింగ వృష్టిశబ్దము. ద్వి.ఏ 11. జిగాయ – క్రియ – జి + లిట్, ప్రథమపురుషైకవచనము

**సమాసాలు:–**

1. ఆత్మభూః – ఆత్మనా భవతీతి (ఉపపదతత్పు)
2. గర్జితానన్తరామ్ – గర్జితస్య అనన్తరా (ష.త) గర్జితానన్తరా, తామ్

**సంధులు :–**

1. వచసి+ అవసితే – వచస్యవసితే – యణాదేశసన్ధిః

**పాఠాన్తరాలు:–** 1. తస్మిన్ – తస్య

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. అవసితే –** ఎ) తుల్యభావమున్న ఈ రఘువంశము (11–37) శ్లోకాన్ని చూడండి.

శ్లో॥ యూపవత్యవసితే క్రియావిధౌ
కాలవిత్ కుశికవంశవర్ధనః ।
రామమిష్వసనదర్శనోత్సుకం
మైథిలాయ కథయామ్బభూవ సః ॥

"యూపముగల ఆ జనకుని యాగము **పూర్తికాగానే** సమయము నెఱిగిన ఆ కుశికవంశవర్ధనుడైన విశ్వామిత్రుడు, రాముడు శివధనుస్సును చూడనుత్సహించు చున్నాడను విషయమును జనకునకు చెప్పెను."

**క్రియాదర్శము:–** 1. **ససర్జ** – సృజ (విసర్గే) విడచుట, తుదాది ప్రకరణమ్ (6) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ ప్రథమపురుషైకవచనము. రూపాలు – **ససర్జ,** ససర్జతుః, ససృజుః

2) **జిగాయ** – జి (అభిభవే) ఓడించుట, భ్వాదిప్రకరణమ్ (1) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ ప్రథమపురుషైకవచనము రూపాలు – **జిగాయ,** జిగ్యతుః ,జిగ్యుః

**అలంకారములు:–** ఇట 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.
బ్రహ్మదేవుని పలుకు వర్షజలధ్వనిగ మఱియు బృహస్పతి పలుకు మేఘఘర్జనగ ఔపమ్యము చెప్పబడుటచే నిది ఉపమాలంకారము.

---





**అవతారికా:–** బ్రహ్మణో గిరమ్ ప్రపంచయతి । బ్రహ్మదేవుని మాట చెప్పబడుచున్నది.

**శ్లో॥ సమ్పత్స్యతే వః కామోఽయం**
**కశ్చిత్కాలః ప్రతీక్ష్యతామ్ ।**
**న త్వస్య సిద్ధౌ యాస్యామి**
**సర్గవ్యాపారమాత్మనా ॥ 54**

**పదవిభాగము:–** సమ్పత్స్యతే, వః, కామః, అయమ్, కశ్చిత్, కాలః, ప్రతీక్ష్యతామ్, న, తు, అస్య, సిద్ధౌ, యాస్యామి, సర్గవ్యాపారమ్, ఆత్మనా.

**అన్వయక్రమము:–** (హే దేవాః !) అయం వః కామః సమ్పత్స్యతే కశ్చిత్ కాలః ప్రతీక్ష్యతామ్ । తు అస్య సిద్ధౌ ఆత్మనా సర్గవ్యాపారం న యాస్యామి ।

**ప్రతిపదార్థము:–** (హే దేవాః – ఓ దేవతలారా !), అయమ్ –ఈ, వః – మీ, కామః –కోరిక, సమ్పత్స్యతే – సమకూడును, కశ్చిత్ – కొంత, కాలః – కాలము ప్రతీక్ష్యతామ్ – వేచియుందురుగాక!, తు – ఇంకను, అస్య – ఈ సేనానాయకుని యొక్క సిద్ధౌ – సమకూడు విషయమున, ఆత్మనా – స్వయముగా, సర్గవ్యాపారమ్– సృష్టిచేయుటనుగూర్చి, న యాస్యామి – పూనుకొనను.

**తాత్పర్యము:–** (ఓ దేవతలారా!) ఈ మీ కోరిక నెఱవేరును. కొంతకాలము వేచియుందురుగాక. ఇంకను ఈ సేనానాయకుని యొక్క సమకూడువిషయమున స్వయముగా సృష్టిచేయుటకు పూనుకొనును.

**విభక్తులు / క్రియలు:–** 1. అయమ్ – **అయమ్**, ఇమౌ, ఇమే, మకారాన్త పుంలింగ **ఇదమ్** శబ్దము. ప్ర.ఏ 2. వః – తవ, యువయోః, వః, దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.బ 3. **కామః** , – కామః, కామౌ, కామాః, అకారాన్త పుంలింగ కామశబ్దము. ప్ర.ఏ 4. సంపత్స్యతే – క్రియ – సమ్+ పద్+లృట్ – ప్రథమపురుషైకవచనమ్ 5. కశ్చిత్ – అవ్యయము 6. కాలః – **కాలః**, కాలౌ, కాలాః, అకారాన్త పుంలింగ కాలశబ్దము. ప్ర.ఏ 7. ప్రతీక్ష్యతామ్ – ప్రతి + ఈక్ష్యతామ్ – క్రియ – కర్మణి (ప్రయోగము) లోట్, ప్ర.ఏ 8. తు, ఆత్మనా – అవ్యయాలు 9. అస్య – **అస్య,** అనయోః, ఏషామ్, మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దము. ష.ఏ 10. సిద్ధౌ – **సిద్ధౌ,** సిద్ధ్యోః, సిద్ధిషు, ఇకారాన్త స్త్రీలింగ సిద్ధిశబ్దము. స.ఏ 11. సర్గవ్యాపారమ్ – **సర్గవ్యాపారమ్,** సర్గవ్యాపారౌ, సర్గవ్యాపారాన్, అకారాన్త పుంలింగ సర్గవ్యాపారశబ్దము. ద్వి.ఏ 12, న – అవ్యయము 13. యాస్యామి – క్రియ – యా + లృట్, ఉత్తమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1. సర్గవ్యాపారమ్ – సర్గ ఏవ వ్యాపారః (మయూరవ్యంసకాదికర్మధా) తమ్.

**సంధులు:–**

1. కామః + అయమ్ – కామోఽయమ్ . ఉత్వాదేశ, పూర్వరూపసన్ధిః
2. తు + అస్య – త్వస్య – యణాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ఆత్మనా – అవ్యయకోషః (163) :** ఎ) 'స్వేన' ఇత్యర్థే విభక్తి ప్రతిరూపకామవ్యయమేతత్ ।

బి) 'గోప్యః పునర్జాతమివాత్మనైవ ప్రైక్షన్తసమ్మోదపయోధిమగ్నాః' ॥

(యాదవాభ్యుదయే 8–78) ఇత్యత్రతు

2. 'ఆత్మనేతి ప్రకృత్యాదిత్వాత్ (వా 2–3–18) తృతీయా, సుబన్త ప్రతిరూపకవ్యయమితి కేచిద్ ఆహుః " ఇతి అప్పయ్యదీక్షితాః ।

**క్రియాదర్శమ్:–**

1. **సమ్పత్స్యతే** – సమ్ – ఉపసర్గ, పద (పద్) గతౌ (నడచుట, వెళ్లుట) సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, **లృట్**, ప్రథమపురుషైకవచనమ్ . దివాది ప్రకరణమ్ (4) రూపాలు **సమ్పత్స్యతే** –సమ్పత్స్యేతే – సమ్పత్స్యన్తే

2. **యాస్యామి** – యా (ప్రాపణే) పొందుట, వెళ్లుట – సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్, లృట్, – ఉత్తమపురుషైకవచనమ్.

రూపాలు – **యాస్యామి** –యాస్యావః – యాస్యామః

---

**అవతారికా:–** బ్రహ్మాస్వాంశేనానవతరణే కారణమాహ –

తనవలననే అభివృద్ధిని పొందినాడని బ్రహ్మ చెప్పుచున్నాడు

**శ్లో॥ ఇతస్సదైత్యః ప్రాప్తశ్రీ–**
**ర్నేత ఏవార్హతి క్షయమ్ ।**
**విషవృక్షోఽపి సంవర్ధ్య**
**స్వయం ఛేత్తుమసామ్ప్రతమ్ ॥ 55**

**పదవిభాగము:–** ఇతః, సః, దైత్యః, ప్రాప్తశ్రీః, న, ఇతః, ఏవ, అర్హతి, క్షయమ్, నార్హతి, విషవృక్షోః, అపి, సంవర్ధ్య, స్వయమ్, ఛేత్తుమ్, అసామ్ప్రతమ్ ।

**అన్వయక్రమము:–** ఇతః ప్రాప్తశ్రీః సః దైత్యః ఇతః ఏవ క్షయం నార్హతి విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తుమ్ అసామ్ప్రతమ్ ।



**ప్రతిపదార్థము:–** ఇతః – ఇటనుండియే ( నా వలననే), ప్రాప్తశ్రీః – పొందబడిన అభివృద్ధిగల వాడగు, సః – ఆ, దైత్యః – తారకాసురుడు, ఇతః + ఏవ – ఇటనుండియే (నా వలననే), క్షయమ్ – నాశమును, న + అర్హతి – పొందతగడు విషవృక్షః+అపి – విషపుచెట్టయినను, సంవర్ధ్య – పెంచి, స్వయమ్ – తానే, ఛేత్తుమ్ – నఱుకుటకు, అసామ్ప్రతమ్ – యుక్తముకాదు.

**తాత్పర్యము:–** నావలననే అభివృద్ధిని పొందినవాడగు ఆ తారకాసురుడు, నావలననే నాశమును పొందతగడు. విషపుచెట్టు ఐనను పెంచి తానే నఱుకుట యుక్తముకాదు.

**విభక్తులు / క్రియలు:–** 1. ఇతః ఏవ – అవ్యయాలు 2. ప్రాప్తశ్రీః – ప్రాప్తశ్రీః, ప్రాప్తశ్రియౌ, ప్రాప్తశ్రియః, ఈకారాన్త పుంలింగ ప్రాప్తశ్రీ శబ్దము. ప్ర.ఏ 3. సః – సః, తౌ, తే, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 4. దైత్యః – **దైత్యః,** దైత్యౌ, దైత్యాః, అకారాన్త పుంలింగ దైత్యశబ్దము. ప్ర.ఏ 5. క్షయమ్ – **క్షయమ్,** క్షయౌ, క్షయాన్, అకారాన్త పుంలింగ క్షయశబ్దము. ద్వి.ఏ 6. న – అవ్యయము 7. అర్హతి – క్రియ 8. అపి – అవ్యయము 9. విషవృక్షః – **విషవృక్షః,** విషవృక్షౌ, విషవృక్షాః, అకారాన్త పుంలింగ విషవృక్షశబ్దము. ప్ర.ఏ 10. సంవర్ధ్య– సమ్ + వృధ్+ క్త్వా – ల్యబన్తం– అవ్యయము 11. ఛేత్తుమ్ – అవ్యయము 12. స్వయమ్ – అవ్యయము క్రియార్థమైన క్రియ ఉపపదముగనుండగా, లేనపుడును – ధాతువుపై భవిష్యదర్థమున తుమున్( తుమ్) ణ్వుల్( అక) ప్రత్యయములు చేరును. తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్ (సూ 3–3–10) 14. అసామ్ప్రతమ్ – అవ్యయము

**సమాసాలు:–**

1. ప్రాప్తశ్రీః – ప్రాప్తా శ్రీ యేన (బహువ్రీహి) సః ।
2. విషవృక్షః – విషస్య వృక్షః (ష.త) ।
3. అసామ్ప్రతమ్ – న సామ్ప్రతమ్ – (నఞ్‌తత్పురుష)

**సంధులు:–**

1. ఇతః +సః – ఇతస్సః – విసర్గసన్ధిః
2. సః + దైత్యః – స దైత్యః – సులోపః (స్వాదిసన్ధిః)
3. ప్రాప్తశ్రీః + న – ప్రాప్తశ్రీర్న – విసర్గసన్ధిః
4. ప్రాప్తశ్రీర్న + ఇతః – ప్రాప్తశ్రీర్నేతః – గుణసన్ధిః
5. ఏవ + అర్హతి – ఏవార్హతి – సవర్ణదీర్ఘసన్ధిః
6. విషవృక్షః + అపి – విషవృక్షోఽపి – ఉత్వాదేశ – పూర్వరూపసన్ధిః
7. ఇతః+ ఏవ – ఇత ఏవ – విసర్గలోపసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. వృక్షః –** ఎ) వృశ్చ్ ఛేదనే + 'స్ను వ్రశ్చికృత్యృషిభ్యఃకిత్' ఇతి స, స చ కిత్ ।
**'వృక్షవరణే'** అతోఽ ప్యావృణోతీతి వృక్ష ఇతి **వా** సిద్ధే ప్రపంచార్థం వ్రశ్చిగ్రహణమ్

బి) శ్లో॥ **వృక్షోఽ**ంఘ్రిపః క్షితిరుహః శిఖరీ చ శాఖీ
శాలో వనస్పతిరగో విటపీ కుఠశ్చ।
అద్రిః కుజస్తరురనేకహ ఇత్యభిన్నాః
శబ్దా ద్రువిష్టరనాగద్రుమపాదపాశ్చ ॥

అని 'వృక్ష' శబ్దానికి హలాయుధకోశము '19' నామములను పేర్కొన్నది.

సి) అత్ర ప్రతివస్తూపమామాహ – విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తుమసాంప్రతమితి । విషవృక్షో నామ ప్రాణినాం మరణప్రదో వృక్షవిశేషః । తదుక్తం –

శ్లో॥ యస్య స్పర్శనమాత్రేణ వాయుసంస్పర్శనేన వా।
మ్రియన్తే జంతువః సర్వే విషవృక్షః స కీర్తితః ॥
ఇతి – 'వివరణమ్' వ్యాఖ్యా

శ్లో॥ వృక్షగుల్మలతావల్ల్యస్త్వక్సారాస్తృణజాతయః ।
షడేతే వృక్షజాతీయాస్తాసాం రోపే ఫలం శృణు ॥

శ్లో॥ యః పుమాన్ రోపయేద్ వృక్షాన్ ఛాయాపుష్పఫలోపగాన్ ।
సర్వసత్త్వోపయోగాయ స యాతి పరమాం గతిమ్ ॥ – ఇతి పాద్మే

శ్లో॥ ఉద్భిజ్జాస్థావరాస్సర్వే బీజకాండప్రరోహిణః ।
ఓషధ్యః ఫలపాకాంతా బహుపుష్పఫలోపగాః ॥ 46

శ్లో॥ అపుష్పాః ఫలవంతో యే తే వనస్పతయః స్మృతాః ।
పుష్పిణః ఫలినశ్చైవ వృక్షాస్తూభయతః స్మృతాః ॥

శ్లో॥ గుచ్ఛగుల్మం తు వివిధం తథైవ తృణజాతయః ।
బీజకాండరుహాణ్యేవ ప్రతానావల్ల్య ఏవ చ ॥
– మనుస్మృతి 1–46,47,48

వృక్షములు '2' విధములు. కొన్ని బీజాలవల్ల అంకురించి పెరుగగా, మరికొన్ని ఆ చెట్టు కొమ్మనే భూమిలో నాటినందువల్ల చెట్లై పెరుగుతున్నాయి. కొన్ని చెట్లు ఫలమునిచ్చే వరకు ఉండగా, మరికొన్ని ఫలపుష్పాదులతో చాలాకాలమువరకు బ్రతుకుతున్నాయి. పువ్వులు లేక ఫలించు వానిని **వనస్పతు**లందురు. తక్కినవి





పూవులు పూచిన తరువాత ఫలిస్తాయి. ఇంకను తీగచెట్లు కొన్ని, పొదగా ఉండుచెట్లు కొన్ని కన్పిస్తున్నాయి. అట్లే తృణజాతులు కూడా కన్పిస్తున్నాయి.

**క్రియాదర్శము:– అర్హతి** – అర్హ (అర్హ్) పూజాయామ్ (పూజించుట) భ్వాది (1) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్ ప్రథమపురుషైకవచనము. రూపాలు – **అర్హతి**, అర్హతః, అర్హన్తి

**అలంకారములు:–** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. ఇట సామాన్యముచే విశేషణము సమర్థింపబడినది. అనగా ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడినది.

లక్షణమ్ – 'సామాన్యం వా విశేషేణ విశేషస్తేన వా యది ॥ 61
కార్యం చ కారణేనేదం కార్యేణ చ సమర్థ్యతే ।
సాధర్మ్యేణేతరేణార్థాంతరన్యాసోఽష్టధాతతః ॥ 62
– ఇతి సాహిత్యదర్పణే దశమః పరిచ్ఛేదః

---

**అవతారికా:–** కుతః ఇత్యాశంక్యాహ । 'ఎందువలన చంపరాదు' అను దానికి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వృతం తేనేదమేవ ప్రా –**
**జ్మయా చాస్మై ప్రతిశ్రుతమ్ ।**
**వరేణ శమితం లోకా –**
**నలం దగ్ధుం హి తత్తపః ॥ 56**

**పదవిభాగము:–** వృతమ్, తేన, ఇదమ్, ఏవ, ప్రాక్, మయా, చ, అస్మై, ప్రతిశ్రుతమ్, వరేణ, శమితమ్, లోకాన్, అలమ్, దగ్ధుమ్, హి, తత్తపః ।

**అన్వయక్రమము:–** ప్రాక్ తేన ఇదమ్ ఏవ వృత్తం మయా చ అస్మై ప్రతిశ్రుతం హి లోకాన్ దగ్ధుమ్ అలమ్ తత్తపః వరేణ శమితమ్ ।

**ప్రతిపదార్థము:–** ప్రాక్ – పూర్వము, తేన – ఆ తారకాసురునిచేత, ఇదమేవ – ఇదియే (దేవతలచే చావకుండుటయే), వృతమ్ – కోరబడెను, మయా చ – నా చేతను, అస్మై– ఇతనికొఱకై, ప్రతిశ్రుతమ్ – ప్రతిజ్ఞ చేయబడినది, హి – ఏలయన లోకాన్ – లోకములను, దగ్ధుమ్ – దహించుటకు, అలమ్ –తగినట్టి, తత్తపః –

వాని తపస్సు, వరేణ – వరముచేత, శమితమ్ – శమింపబడినది.

**తాత్పర్యము:–** పూర్వము తారకాసురునిచేత ఇదియే (దేవతలచే చావకుండుటయే) కోరబడెను. నా చేతను ఇతనికొఱకై ప్రతిజ్ఞ చేయబడినది. ఏలయన లోకములను దహించుటకు తగినట్టి వాని తపస్సు వరముచేత శమింపబడినది.

**విభక్తులు / క్రియలు:–** 1. ప్రాక్ – అవ్యయము 2. తేన – **తేన**, తాభ్యామ్, తేభ్యః, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 3. ఇదమ్ – **ఇదమ్**, ఇమే, ఇమాని, మకారాన్త నపుంసకలింగ ఇదమ్ శబ్దము . ప్ర.ఏ 4. ఏవ – అవ్యయము 5. వృతమ్ – వృతమ్, వృతే, వృతాని, అకారాన్త నపుంసకలింగ వృతశబ్దము. ప్ర.ఏ 6. మయా – **మయా**, ఆవాభ్యామ్, అస్మాభిః, దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. తృ.ఏ 7. ఆస్మై – **అస్మై**, ఆభ్యామ్, ఏభ్యః, మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దము. చ.ఏ 8. ప్రతిశ్రుతమ్ – **ప్రతిశ్రుతమ్** , ప్రతిశ్రుతే, ప్రతిశ్రుతాని, అకారన్త నపుంసకలింగ ప్రతిశ్రుతశబ్దము. ప్ర.ఏ 9. హి, చ– అవ్యయాలు 10. లోకాన్ – లోకమ్, లోకౌ, **లోకాన్**, అకారాన్త పుంలింగ లోకశబ్దము. ద్వి.బ 11. దగ్ధుమ్ – ముమున్నంతతు –అవ్యయము 12. అలమ్ – అవ్యయము 13. తత్తపః – **తత్తపః** తత్తపసీ, తత్తపాంసి, సకారాన్త నపుంసకలింగ తపస్ శబ్దము. ద్వి.ఏ 14. వరేణ – **వరేణ,** వరాభ్యామ్, వరైః, అకారాన్త పుంలింగ వరశబ్దము. తృ.ఏ 15. శమితమ్ – శమితమ్, శమితే, శమితాని, అకారాన్త నపుంసకలింగ శమితశబ్దము. ప్ర.ఏ

**సమాసాలు:–**

1. తత్తపః – తస్య తపః (ష.త)

**సంధులు:–**

1. తేన + ఇదమ్ – తేనేదమ్ – గుణసన్ధిః
2. ప్రాక్ + మయా – ప్రాఙ్మయా – అనునాసికసన్ధిః
3. చ + అస్మై – చాస్మై – సవర్ణదీర్ఘసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. వరః – వరమ్ – వరేణ –** ఎ) పుంలింగము, వృ+ అప్

బి) 'తపోభిరిష్యతే యస్తు దేవేభ్యః స వరో మతః ।' – ఇతి భరతః

సి) శ్లో॥ భక్త్యా గురౌ మయ్యనుకమ్పయా చ
ప్రీతాస్మి తే పుత్త్ర ! **వరం** వృణీష్వ ।
న కేవలానాం పయసాం ప్రసూతి –
మవేహి మాం కామదుఘాం ప్రసన్నామ్ ॥ ర.వం. 2–63

"…..నీకు కావలసిన వరమును కోరుము…."

డి) వరమ్ – అవ్యయకోషః (701) స్వరాదుల్లో అవ్యయంగాను చెప్పబడుతుంది.





'ఈషత్ ప్రియమిత్యర్థే కేచిదముం స్వరాదిషు పఠన్తి' ।

1. 'వరం విరోధోఽపి సమం మహాత్మభిః ।' కిరాతార్జునీయే 1–8

2. మేదినీ కారాదిమతే తు క్లీబన్తత్వమేవ తదుక్తమ్ ।

'మనాగిష్టే **వరం క్లీబమ్,** కేచిత్ ఆహుస్తద్ అవ్యయమ్' । ఇతి।

ఏ తత్తు ప్రారమ్భే యత్ర ప్రయుజ్యతే, తత్రైవ వాక్య ఉత్తరత్ర ప్రాయేణ 'నచ' 'నతు' 'నపున' 'న' ఇతి ప్రయుజ్యేత । యథా – 'వరం మౌనం కార్యం న చ వచనముక్తం యదనృతమ్ … వరం భిక్షాశిత్వం న చ పరధనాస్వాదనసుఖమ్' (హితోపదేశే)

3) 'యాఞ్చా మేఘా **వరమ**ధిగుణే, నాధమే లబ్ధకామా' మేఘదూతమ్ 6–1–6

**2)** యది తదా తదభ్యర్థితం వరం నాదాస్యం, తర్హి తస్య మూర్ధానం నిర్భిద్య నిర్గతస్తపోమయే వహ్నిః సర్వానపి లోకాన్ భస్మసాదకరిష్యత్ । యథోక్తం శ్రీ భాగవతే హిరణ్యకశిపోస్తపః – ప్రసఙ్గే –

శ్లో॥ తస్య మూర్ధ్నః సముద్భూతః సధూమోఽగ్నిస్తపోమయః ।
తిర్యగూర్ధ్వమధోలోకానతపద్ విష్వగీరితః ॥ ఇతి స్కంధః 7–3–4

**అలంకారము:–** ఇందు 'కావ్యలింగాలంకార'మున్నదని చెప్పదగును.

లక్షణమ్ – 'కావ్యలింగం హేతోర్వాక్యపదార్థతా' – కావ్యప్రకాశే దశమోల్లాసే

ఏదైనా ఒక విషయం చెప్పి దానికి హేతువు చెప్పడం కావ్యలింగాలంకారము. బ్రహ్మదేవుడు తారకాసురుడికి 'దేవతలచే చావు లేకుండుట' అనే వరము ప్రసాదించాడు. హేతువు ఏమిటంటే 'లోకాలను దహించునట్టి వాని తపస్సు వరముచేత శమింపజేయబడినది' అని చెప్పటమే.

---

**అవతారికా:–** అథాపత్ప్రతీకారోపాయం దర్శయితుమారభతే ।

**శ్లో॥ సంయుగే సాంయుగీనం త –
ముద్యన్తం ప్రసహేత కః ।
అంశాదృతే నిషిక్తస్య
నీలలోహితరేతసః ॥ 57**

**పదవిభాగము:–** సంయుగే, సాంయుగీనమ్, తమ్, ఉద్యన్తమ్, ప్రసహేత, కః,

అంశాత్, ఋతే, నిషిక్తస్య, నీలలోహితరేతసః .

**అన్వయక్రమము:–** సంయుగే ఉద్యన్తం సాంయుగీనం తం నిషిక్తస్య నీలలోహితరేతసః అంశాత్ ఋతే కః ప్రసహేత ।

**ప్రతిపదార్థము:–** సంయుగే – యుద్ధమునందు, ఉద్యన్తమ్ – పూనిక దాల్చినట్టియు సాంయుగీనమ్ – రణకుశలుడు అగు, తమ్ – ఆ తారకాసురుని, నిషిక్తస్య – (ఒకానొక క్షేత్రమున) నిషేకింపబడిన, నీలలోహితరేతసః – శివుని రేతస్సుయొక్క అంశాత్ – భాగమువలన, ఋతే – తప్ప, కః – ఎవడు, ప్రసహేత – ఓడించును

**తాత్పర్యము:–** యుద్ధమునందు పూనిక దాల్చినట్టియు, రణకుశలుడగు ఆ తారకాసురుని నిషేకింపబడిన శివుని రేతస్సుయొక్క భాగమువలన తప్ప ఎవడు ఓడించును.

**విభక్తులు / క్రియలు:–** 1. సంయుగే – **సంయుగే,** సంయుగయోః, సంయుగేషు, అకారాన్త పుంలింగ సంయుగశబ్దము. స.ఏ 2. ఉద్యన్తమ్ – **ఉద్యన్తమ్,** ఉద్యన్తౌ, ఉద్యన్తాన్, అకారాన్త పుంలింగ ఉద్యన్త శబ్దము. ద్వి.ఏ 3. సాంయుగీనమ్ –**సాంయుగీనమ్,** సాంయుగీనౌ, సాంయుగీనాన్, అకారాన్త పుంలింగ సాంయుగీన శబ్దము. ద్వి.ఏ 4. తమ్ – **తమ్,** తౌ, తాన్, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 5. నిషిక్తస్య– నిషిక్తస్య, నిషిక్తయోః, నిషిక్తానామ్, అకారాన్త పుంలింగ నిషిక్త శబ్దము. ష.ఏ 6. నీలలోహితరేతసః – **నీలలోహితరేతసః,** రేతసోః, రేతసామ్, సకారాన్త పుంలింగ ... రేతస్ శబ్దము. ష.ఏ 7. అంశాత్ – **అంశాత్,** అంశాభ్యామ్, అంశేభ్యః, అకారాన్త పుంలింగ అంశశబ్దము. పం.ఏ 8. ఋతే – అవ్యయము 9. కః – కః, కౌ, కే, మకారాన్త పుంలింగ **కిమ్** శబ్దము. ప్ర.ఏ 10. ప్రసహేత – క్రియ – ప్ర+సహ్, విధిలిఙ్ ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1. నీలలోహితరేతసః– నీలః చాసౌ లోహితః చేతి నీలలోహితః (కర్మధా) నీలలోహితస్య రేతాః (ష.త) తస్య ।

**సంధులు:–**

1. అంశాత్ + ఋతే – అంశాదృతే – జశ్త్వసన్ధిః, ఝలాం జశోఽన్తే

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. నీలలోహితః** ఎ) నీలశ్చాసౌ లోహితశ్చేతి । 'వర్ణో వర్ణేన' ఇతి సమాసః । నీలః కణ్ఠే లోహితశ్చ కేశేష్వితి వా ।

బి) శ్లో॥ ఈశానః శశిశేఖరః పశుపతిః శూలీ శివః శంకరః ।.....
గంగాధరో మహాదేవో మృడః స్యాన్నీ**లలోహితః** ॥ 13



అని 'నీలలోహిత' శబ్దానికి హలాయుధకోశము '45' నామములను అందించినది.

సి) శ్లో॥ చైత్రే శివోత్సవం కుర్యాన్నృత్యగీతమహోత్సవైః ।
స్నాత్వా త్రిసంధ్యం రాత్రౌ చ హవిష్యాశీ జితేంద్రియః ॥
శ్లో॥ కిమలభ్యం భగవతి ప్రసన్నే **నీలలోహితే ।**
ఉపోష్య హుత్వా సంక్రాన్త్యాం వ్రతమేతత్ సమర్పయేత్ ॥"
– ఇతి బృహద్ధర్మపురాణే

డి) శ్లో॥ ప్రవర్తతాం ప్రకృతి హితాయ పార్థివః
సరస్వతీ శ్రుతిమహసాం మహీయసామ్ ।
మమాపి చ క్షపయతు **నీలలోహితః**
పునర్భవం పరిగతశక్తిరాత్మభూః ॥ అభిజ్ఞాన శాకున్తలమ్ 7–35

ఇది అభిజ్ఞానశాకున్తల నాటక సప్తమాంకాంతమున చెప్పబడిన శ్లోకము. "..సర్వశక్తులతో ఒప్పెడు ఉమాపతియగు నీలలోహితుడు–సదాశివుడు జన్మాంతరమును పోగొట్టి శాశ్వతస్థానమగు మోక్షమును అందఱికి అనుగ్రహించుగాక.

**క్రియాదర్శము:–** **ప్రసహేత** – ప్ర – ఉపసర్గ, షహ (మర్షణే) భరించుట. భ్వాదిప్రకరణమ్ (1) ఆత్మనేపదీ, సకర్మకమ్, సేట్, విధిలిఙ్. ప్రథమపురుషైక వచనమ్. రూపాలు – **ప్రసహేత** – ప్రసహేయాతామ్ – ప్రసహేరన్.

**అలంకారము:–** ఇట కాకువక్రోక్త్యలంకార' మున్నదని చెప్పదగును. కః ప్రసహేత అంటే అన్యుడెవ్వడు ఓడించును? శివాంశ సంభూతుడు తప్ప. అని చెప్పబడుటచే నిది 'కాకువక్రోక్త్యలంకారము' లక్షణమ్–**'భిన్న కంఠ ధ్వనిర్ధీరైః కాకురిత్యభిధీయతే'.** కిరాతార్జునీయమునందు 2–23 వ శ్లోకములోని ఈ పదప్రయోగమును చూడండి.

శ్లో॥ ద్విరదానివ దిగ్విభావితాం –
శ్చతురస్తోయనిధీనివాయతః ॥
**ప్రసహేత** రణే తవానుజాన్
ద్విషతాం కః శతమన్యుతేజసః ॥

.... దేవేంద్ర సమప్రతాపులగు నీ నల్వురు తమ్ములను శత్రువులలో నెవ్వడు యుద్ధమున నోర్వగలడు" ।

---

**అవతారికా:-** కథమసావీదృక్ శక్తిరిత్యాహ - ఆ శివుని కిట్టి శక్తి ఎట్లు వచ్చినదను దానినిగూర్చి చెప్పుచున్నాడు.

**శ్లో॥ స హి దేవః పరంజ్యోతి -**
**స్తమఃపారే వ్యవస్థితామ్ ।**
**పరిచ్ఛిన్నప్రభావర్ధి -**
**ర్న మయా న చ విష్ణునా ॥ 58**

**పదవిభాగము:-** సః, హి, దేవః పరంజ్యోతిః, తమఃపారే, వ్యవస్థితామ్, పరిచ్ఛిన్న ప్రభావర్ధిః, న, మయా, న, చ, విష్ణునా.

**అన్వయక్రమము:-** సః దేవః తమఃపారే వ్యవస్థితామ్ పరంజ్యోతిః హి । మయా విష్ణునా పరిచ్ఛిన్నప్రభావర్ధిః న।

**ప్రతిపదార్థము:-** సః దేవః - ఆ దేవదేవుడు, తమఃపారే - పెంజీకటి కవ్వల, వ్యవస్థితమ్ - నెలకొనియున్న, పరంజ్యోతిః హి - పరమాత్మ గదా !, మయా చ - నా చేతను, విష్ణునా చ - విష్ణుదేవునిచేతను, పరిచ్ఛిన్నప్రభావర్ధిః - పొందదగిన ప్రభావాతిశయము గలవాడు, న - కాడు.

**తాత్పర్యము:-** ఆ దేవదేవుడు పెంజీకటి కవ్వల నెలకొనియున్న పరమాత్మ గదా! నాచేతను, విష్ణుదేవునిచేతను పొందదగిన ప్రభావాతిశయముగలవాడు కాడు.

**విభక్తులు / క్రియలు:-** 1. సః - **సః,** తౌ, తే, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2. దేవః - **దేవః**, దేవౌ, దేవాః, అకారాన్త పుంలింగ దేవశబ్దము. ప్ర.ఏ 3. తమఃపారే - **తమఃపారే,** తమః పారయోః, తమఃపారేషు, అకారాన్త నపుంసకలింగ తమఃపారశబ్దము. స.ఏ 4. వ్యవస్థితమ్- **వ్యవస్థితమ్,** వ్యవస్థితే, వ్యవస్థితాని, అకారాన్త నపుంసకలింగ వ్యవస్థితశబ్దము. ప్ర.ఏ 5.పరంజ్యోతిః - పరంజ్యోతిః పరంజ్యోతిషీ, పరంజ్యోతీంషి, సకారాన్త నపుంసకలింగ పరంజ్యోతిస్ శబ్దము. ప్ర.ఏ 6. హి- అవ్యయము 7. న, చ-అవ్యయాలు 8. మయా - **మయా,** ఆవాభ్యామ్, అస్మాభిః, దకారాన్త పుంలింగ అస్మద్శబ్దము. తృ.ఏ 9. విష్ణునా - విష్ణునా, విష్ణుభ్యామ్, విష్ణుభిః, ఉకారాన్త పుంలింగ విష్ణుశబ్దము. తృ.ఏ 10. పరి.. వర్ధిః - వర్ధిః, ..వర్ధీ, వర్ధయః, ఇకారాన్త పుంలింగ పరి...వర్ధిశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:-**

1. తమఃపారే - తమసః పారమ్ (ష.త) తస్మిన్ ।
2. వ్యవస్థితమ్ - విశేషేణ అవస్థితమ్ (ప్రాదితత్పు) ।
3. పరిచ్ఛిన్నప్రభావర్ధిః - ప్రభావస్య ఋద్ధిః (ష.త) ప్రభావర్ధిః, పరిచ్ఛిన్నా ప్రభావర్ధిః యస్య (ష.త) సః ।





**సంధులు:-**

1. ప్రభావర్ధిః + న - ప్రభావర్ధిర్న - విసర్గసన్ధిః
2. పరంజ్యోతిః+ తమఃపారే - పరంజ్యోతిస్తమఃపారే - విసర్గసన్ధిః
3. ప్రభావ + ఋద్ధిః - ప్రభావర్ధిః - ఆద్గుణః (సూ. 6-1-84)గుణసన్ధిః **ఆద్గుణః** (సూ 6-1-84) అవర్ణమునకు (అ,ఆలకు) హ్రస్వదీర్ఘములైన ఇ,ఉ,ఋ, వర్ణములు పరముగా నున్నపుడు పూర్వపరముల స్థానములలో గుణము ఏకాదేశమగును. ఇచట గుణములు క్రమముగా **ఏ,ఓ,అర్, అల్** అనునవి ఆదేశమగునని తాత్పర్యము.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. తమఃపారే పరంజ్యోతిః-** ఎ) శ్రీమదాంధ్రమహాభాగవత అష్టమస్కంధమునందు ఈ భావమున్న పోతనామాత్యుని పద్యమును పరిశీలించుడు.

కం॥ లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగిన తుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వఁడు
నేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. భాగవత - అష్టమ. 75

బి) ఇట మహాయోగి శ్రీ అరవిందుడు రచించిన గ్రంథప్రథమ వాక్యమును అనుసంధానము చేసికొనదగును. It was the hour before the gods awake.

సి) ఎ, బిలందలి భావజాలపులోతుల్ని ఎవరికివారే అందుకొనవలసి ఉంటుంది. అస్తు

**అలంకారము:-** ఇట 'ఉదాత్తాలంకార' మున్నదని చెప్పదగును. లక్షణమ్ - **'ఉదాత్తం వస్తునః సంపత్' కావ్యప్రకాశే. దశమోల్లాసే** వస్తువుయొక్క సమృద్ధితో సంబంధము -ఉదాత్తాలంకారము. వస్తువులయొక్క అత్యధిక సమృద్ధిని వర్ణించడం - ఉదాత్తాలంకారము. శివభగవానుని మహిమ వర్ణించడం 'పరిచ్ఛిన్నప్రభావర్ధిర్న' - అని చెప్పుటయే 'ఉదాత్తాలంకారము'

---

**అవతారికా:-** సంప్రతి తదంశోత్పత్తావుపాయం దర్శయతి - ఇప్పుడాయన యంశోత్పత్తినిగూర్చి యుపాయము చెప్పుచున్నాడు

శ్లో॥ ఉమారూపేణ తే యూయం
సంయమస్తిమితం మనః ।
శమ్భోర్యతధ్వమాక్రష్టు -
మయస్కాన్తేన లోహవత్ ॥ 59

**పదవిభాగము:**–ఉమారూపేణ, తే, యూయమ్, సంయమస్తిమితమ్, మనః, శమ్భోః యతధ్వమ్, ఆక్రష్టుమ్, అయస్కాన్తేన, లోహవత్ ।

**అన్వయక్రమము:**– తే యూయం సంయమస్తిమితం శమ్భోః మనః ఉమారూపేణ అయస్కాన్తేన లోహవత్ ఆక్రష్టుం యతధ్వమ్.

**ప్రతిపదార్థము:**– తే యూయమ్– ఆ కార్యార్థులగు మీరు, సంయమస్తిమితమ్ – సమాధియందు నిశ్చలమైయున్న, శమ్భోః – శివునియొక్క, మనః – మనస్సును, ఉమారూపేణ – పార్వతీదేవి సౌందర్యముచేత, అయస్కాన్తేన – సూదంటుఱాతిచే, లోహవత్ – ఇనుమును వలె, ఆక్రష్టుమ్ – ఆకర్షించుటకు (లాగుటకు), యతధ్వమ్ – యత్నింపుడు.

**తాత్పర్యము:**– ఆ కార్యార్థులగు మీరు (ఓ దేవతలారా!) సమాధియందు నిశ్చలమైయున్న శివునియొక్క మనస్సును పార్వతీదేవి సౌందర్యముచేత, సూదంటుఱాతిచే ఇనుమును వలె, ఆకర్షించుటకు యత్నింపుడు.

**విభక్తులు / క్రియలు:**– 1. తే – సః, తౌ, **తే,** దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.బ 2. యూయమ్ – త్వమ్, యువామ్, యూయమ్, దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ప్ర.బ 3. సం..తమ్ – **స్తిమితమ్,** స్తిమితే, స్తిమితాని, అకారాన్త నపుంసకలింగ స్తిమిత శబ్దము. ద్వి.ఏ 4. శమ్భోః – శమ్భోః, శమ్భ్వోః, శంభూనామ్, ఉకారాన్త పుంలింగ శంభుశబ్దము. ష.ఏ 5. మనః – మనః, మనసీ, మనాంసి, సకారాన్త నపుంసకలింగ మనస్ శబ్దము. ద్వి.ఏ 6. ఉమారూపేణ– **ఉమారూపేణ,** ఉమారూపాభ్యామ్, ఉమారూపేభ్యః, అకారాన్త నపుంసకలింగ ఉమారూప శబ్దము. తృ.ఏ 7. అయస్కాన్తేన – **అయస్కాన్తేన,** అయస్కాంతాభ్యామ్, అయస్కాంతేభ్యః, అకారాన్త పుంలింగ అయస్కాంత శబ్దము. తృ.ఏ 8. లోహవత్ – అవ్యయము 'వత్' తద్ధితప్రత్యయము 9. ఆక్రష్టుమ్ – అవ్యయము 'తుమున్ ప్రత్యయాన్తము (కృత్) 10. యతధ్వమ్ – క్రియ – లోట్.

**సమాసాలు:**–

1. సంయమస్తిమితమ్ – సంయమేన స్తిమితమ్ (తృ.త) ।
2. ఉమారూపేణ – ఉమాయాః రూపమ్ (ష.త) తేన ।

73



**సంధులు:**–

1. శమ్భోః + యతధ్వమ్ – శమ్భోర్యతధ్వమ్ – విసర్గసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**–

**1. అయస్కాంతః** – ఎ) పుం. అయస్సు కాన్తః రమణీయః ।

బి) హలాయుధకోశ వ్యాఖ్య – ఈ పదాన్ని వివరిస్తూ ఈ శ్లోకాన్నే ఉదహరించింది

సి) శ్లో॥ సర్పస్యేవ శిరోరత్నం నాస్య శక్తిత్రయం పరః ।
స చకర్ష పరస్మాత్త**దయస్కాన్త** ఇవాయసమ్ ॥ ర.వం. 17-63

"సర్పముయొక్క తలపైనున్న మణిని ఎవ్వరూ తాకలేనట్లు 'అతిథి'వద్ద నున్న శక్తిత్రయమును శత్రురాజులెవ్వరును లాగికొనలేకపోయిరి. కాని ఆ అతిథి మాత్రము శత్రువుల వద్దనుండి శక్తిత్రయమును **ఇనుపముక్కను అయస్కాంతము లాగివేయునట్లు** ఆకర్షించెను.

డి) 'అయస్కాంతమయః సంక్రామతి' – మహాభాష్యము (పా. 3-1-7)

ఇ) శ్లో॥ మహిమ్నామేతస్మిన్వినయశిశుతా మౌగ్ధ్యమసృణో
విదగ్ధైర్నిర్గ్రాహ్యో న పునరవిదగ్ధైరతిశయః ।
మనో మేఽ సమ్మోహస్థిరమపి హరత్యేష బలవా -
**నయోధాతుం** యద్వత్పరిలఘుర**యస్కాన్తశకలః** ॥
ఉత్తరరామచరితమ్ 4-19

"... నా మనస్సును మోహములేనిదియు, చలింపనిదియు ఐన దానిని సయితము, ఈతడు బలముగలవాడై, ఇనుపలోహమును మిగులచిన్నదియగు సూదంటుఱాతి తునక ఎట్లో, అట్లు హరించుచున్నాడు".

ఎఫ్) మాలతీమాధవము।లోని ఈ ప్రయోగమును చూడండి. **అయస్కాంత మణి** శలాకేవ **లోహ**ధాతుమన్తఃకరణ**మాకృష్ట**వతీ...

**2) ఉమారూపేణ – ఉమాసౌందర్యేణ**

శ్లో॥ రూపం స్వభావే సౌన్దర్యే నాణకే పశుశబ్దయోః ।
గ్రన్థావృత్తౌ నాటకాదావాకారశ్లోకయోరపి॥ ఇతి విశ్వః

రూపము (న) స్వభావము, సౌందర్యము, వెండిబంగారు నాణెములు, చతుష్పాజ్జంతువు, సంస్కృతాది శబ్దము, పలుమార్లు గ్రంథపఠనము చేయుట, నాటకము, ఆకారము, శ్లోకము – అను అర్థములో వాడబడును.

**క్రియాదర్శము:–** 1. **యతధ్వమ్** – యతీ (యత్) ప్రయత్నే – ప్రయత్నము చేయుట, భ్వాదిప్రకరణమ్ (1) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ. లోట్ – మధ్యమపురుష బహువచనము. రూపాలు – యతస్వ – యతేథామ్ – **యతధ్వమ్ .**

**అలంకారము:–** ఇందు 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును. లక్షణము – **విరుద్ధేనోపమానేన దేశకాలక్రియాదిభిః । ఉపమేయస్య యత్సామ్యం గుణలేశేన సోపమా ॥** కావ్యాంలకారః 2–30

'అయస్కాంతము ఇనుపముక్కను ఎట్లు ఆకర్షించునో అట్లే పార్వతీదేవి సౌందర్యముచే శివభగవానుని ఆకర్షించునట్లు యత్నింపుడు' అని వర్ణింపబడుటచే నిది 'ఉపమాలంకార'మని చెప్పదగును.

---

**అవతారికా:–** న చ గత్యన్తరమస్తీత్యాహ – ఇంతకంటె వేఱేగతి లేదని చెప్పుచున్నాడు

**శ్లో॥ ఉభే ఏవ క్షమే వోఢు –**
**ముభయోర్బీజమాహితమ్ ।**
**సా వా శంభో స్తదీయా వా**
**మూర్తిర్జలమయీ మమ ॥ 60**

**పదవిభాగము:–** ఉభే, ఏవ, క్షమే, వోఢుమ్, ఉభయోః, బీజమ్, ఆహితమ్, సా, వా, శంభోః, తదీయా, వా, మూర్తిః, జలమయీ, మమ ।

**అన్వయక్రమము:–** ఉభయోః ఆహితం బీజం వోఢుం సా శంభోః తదీయా జలమయీ మూర్తిః వా మమ ఉభే ఏవ క్షమే ।

**ప్రతిపదార్థము:–** ఉభయోః – మా యిరువురియొక్క (బ్రహ్మరుద్రులమగు), ఆహితమ్ – ఉంచబడిన, బీజమ్ – తేజస్సును, వోఢుమ్ – తాల్చుటకును, ఉభే ఏవ – ఇరువురే, క్షమే – సమర్థులు, సా – ఆ పార్వతీదేవి, శంభోః – శివుని వీర్యమును దాల్చుటకును, తదీయే – ఆయనదైన, జలమయీ – నీటిరూపమున నున్న, మూర్తిర్వా – మూర్తి, మమ – నా వీర్యమును భరించుటకు.

**తాత్పర్యము:–** బ్రహ్మరుద్రులమగు మా ఇరువురి వీర్యమును ధరించుటకు ఇరువురే సమర్థులు. 1. రుద్రవీర్యమును దాల్చుటకు ఆ పార్వతీదేవి, 2. నా వీర్యమును భరించుటకు ఆయనదైన నీటిరూపమున నున్న మూర్తి.





**విభక్తులు / క్రియలు:–** 1. ఉభయోః – అకారాన్త పుంలింగము .నిత్యం ద్వివచనాన్త ఉభశబ్దము. ఉభౌ, ఉభౌ, ఉభాభ్యామ్, **ఉభయోః**, ఉభయోః. ష.ఏ 2. ఉభే – అకారాన్త నపుంసకలింగము, నిత్యం ద్వివచనాంతము. ఉభశబ్దము. **ఉభే,** ఉభాభ్యామ్, ఉభాభ్యామ్, ఉభయోః, ఉభయోః । ప్ర.ద్వి 3. ఆహితమ్ – **ఆహితమ్ ,** ఆహితే, ఆహితాని, అకారాన్త నపుంసకలింగ ఆహితశబ్దము. ద్వి.ఏ 4. బీజమ్ – **బీజమ్,** బీజే, బీజాని, అకారాన్త నపుంసకలింగ బీజశబ్దము. ద్వి.ఏ 5. వోఢుమ్ – అవ్యయము, 'తుమున్' కృత్ ప్రత్యయాన్తము. 6. సా – **సా,** తే, తాః, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 7. శంభోః – **శంభోః,** శంభ్వోః, శంభూనామ్, ఉకారాన్త పుంలింగ శమ్భుశబ్దము. ష.ఏ 8. తదీయా – **తదీయా,** తదీయే, తదీయాః, ఆకారాన్త స్త్రీలింగ **తదీయా** శబ్దము. ప్ర.ఏ 9. జలమయీ – **జలమయీ,** జలమయ్యౌ, జలమయ్యః, ఈకారాన్త స్త్రీలింగ జలమయీ శబ్దము. ప్ర.ఏ 10. మూర్తిః – **మూర్తిః**, మూర్తీ, మూర్తయః, ఇకారాన్త స్త్రీలింగమూర్తిశబ్దము. ప్ర.ఏ 11. వా, ఏవ – అవ్యయాలు 12. మమ – **మమ,** ఆవయోః, అస్మాకమ్, దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ష.ఏ 13. క్షమే – క్షమమ్, **క్షమే,** క్షమాని, అకారాన్త నపుంసకలింగ క్షమశబ్దము. ప్ర.ద్వి.

**సంధులు:–**

1. ఉభయోః + బీజమ్ – ఉభయోర్బీజమ్ – విసర్గసన్ధిః
2. శంభోః + తదీయా – శంభోస్తదీయా – విసర్గసన్ధిః
3. మూర్తిః + జలమయీ – మూర్తిర్జలమయీ – విసర్గసన్ధిః

**పదవ్యుత్పత్తి –నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. ఉభే –** ఎ) అకారాన్తో నపుంసకలింగో నిత్యం ద్వివచనాన్తః ఉభ శబ్దః, ప్రథమా ద్వివచనే

బి) స్త్రీలింగే నపుంసకే చ 'ఉభ' శబ్దస్య సమానాని రూపాణి భవన్త్యపి కార్యే కించిద్విశేషః, తచ్చ 'విశ్వ' శబ్దస్య ద్వివచనవద్ బోధ్యమ్ ।
– బృహత్‌శబ్దకుసుమాకరః ।

సి) శ్లో॥ జనాయ శుద్ధాంతచరాయ శంసతే
కుమారజన్మామృతసమ్మితాక్షరమ్ ।
అదేయమాసీత్త్రయమేవ భూపతే –
శ్శశిప్రభం ఛత్ర**ముభే** చ చామరే ॥ ర.వం. 3–16

ఇచట 'ఉభే' – ద్వితీయావిభక్తి ద్వివచనాంతమని గ్రహింతురు.

**అలంకారము:–** ఇట 'దీపకాలంకార'మున్నదని చెప్పదగును.

మూ – జాతి క్రియాగుణద్రవ్యవాచినైకత్ర వర్తినా ॥
సర్వవాక్యోపకారశ్చేత్ తమాహుర్దీపకం యథా ॥
కావ్యాదర్శే, ద్వితీయపరిచ్ఛేదే –97

ఒక వాక్యములోనున్న జాతి గుణక్రియాద్రవ్యములలో ఏదో ఒకదానిని బోధించు పదముచే అన్ని వాక్యములకును ఉపకారమైనచో దానిని దీపకాలంకారముగ చెప్పుచున్నారు. – బాలానందిని. కాని ప్రకృతాప్రకృతములకు ఒక ధర్మముతో సంబంధమున్నట్లు వర్ణించినచో అది దీపకమని కావ్యప్రకాశాదుల లక్షణము.

"సకృద్వృత్తిస్తు ధర్మస్య ప్రకృతాప్రకృతాత్మనామ్" ।

ఇట ప్రకృతము – శివపార్వతులు – ఉపమేయము. అప్రకృతము – బ్రహ్మ – జలమూర్తులు – ఉపమానము. 'వోఢుమ్' – అనునది ఇట చెప్పబడుటచే నిది 'దీపకాలంకార'మని చెప్పదగును.

---

**అవతారికా:–** ఏవం కృతే సతి యుష్మాకం కార్యసిద్ధిరవశ్యం భవిష్యతీత్యాహ – అవశ్యం కార్యసిద్ధి జరుగునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ తస్యాత్మా శితికణ్ఠస్య**
**సైనాపత్యముపేత్య వః ।**
**మోక్ష్యతే సురబన్దీనాం**
**వేణీర్వీర్యవిభూతిభిః ॥ 61**

**పదవిభాగము:–** తస్య, ఆత్మా, శితికణ్ఠస్య, సైనాపత్యమ్, ఉపేత్య, వః, మోక్ష్యతే, సురబన్దీనాం, వేణీః, వీర్యవిభూతిభిః.

**అన్వయక్రమము:–** తస్య శితికణ్ఠస్య ఆత్మా వః సేనాపత్యమ్ ఉపేత్య వీర్యవిభూతిభిః సురబన్దీనామ్ వేణీః మోక్ష్యతే ।

**ప్రతిపదార్థము:–** తస్య – ఆ, శితికణ్ఠస్య – శివునియొక్క, ఆత్మా – పుత్త్రుడు, వః – మీకు, సైనాపత్యమ్ – సైన్యాధిపత్యమును, ఉపేత్య – వహించి, వీర్యవిభూతిభిః – శౌర్యసంపదలచే, సురబన్దీనామ్ – చెఱపెట్టబడిన దేవతాస్త్రీలయొక్క, వేణీః – కురులను, మోక్ష్యతే – విప్పగలడు.

**తాత్పర్యము:–** ఆ శివపుత్త్రుడు మీకు సైన్యాధిపత్యమును వహించి శౌర్యసంపదలచే చెఱపెట్టబడిన దేవతా స్త్రీలకురులను విప్పగలడు.

**విభక్తులు / క్రియలు:–** 1. తస్య – **తస్య,** తయోః, తేషామ్, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ష.ఏ 2. శితికణ్ఠస్య – **శితికణ్ఠస్య,** శితికణ్ఠయోః, శితికణ్ఠానామ్, అకారాన్త పుంలింగ శితికణ్ఠశబ్దము. ష.ఏ 3. ఆత్మా – **ఆత్మా,** ఆత్మానౌ, ఆత్మానః, నకారాన్త పుంలింగ **ఆత్మన్** శబ్దము. ప్ర.ఏ 4. వః – 





తవ / తే, యువయోః / వామ్, యుష్మాకమ్ / వః, దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.బ 5. సైనాపత్యమ్ – **సైనాపత్యమ్,** సైనాపత్యే, సైనాపత్యాని, అకారాన్త నపుంసకలింగ సైనాపత్య శబ్దము. ద్వి.ఏ 6, ఉపేత్య– ఉప + ఇ + క్త్వా – ల్యబన్తము – అవ్యయము. 7. వీర్యవిభూతిభిః – వీర్యవిభూత్యా, వీర్యవిభూతిభ్యామ్, **వీర్యవిభూతిభిః** ఇకారాన్త స్త్రీలింగ వీర్యవిభూతిశబ్దము. తృ.బ. 8. సురబన్దీనామ్ – సురబంద్యాః సురబంద్యోః, **సురబన్దీనామ్,** ఈకారాన్త స్త్రీలింగ సురబన్దీశబ్దము. ష.బ 9. వేణీః – వేణీమ్, వేణ్యౌ, వేణీః, ఈకారాన్త స్త్రీలింగ వేణీశబ్దము. ద్వి.బ.

**సమాసాలు:–**

1. శితికణ్ఠస్య – శితిః కణ్ఠః యస్య (బహువ్రీహి) సః, తస్య ।
2. సైనాపత్యమ్ – సేనాయాః పతిః (ష.త) సేనాపతిః తస్య భావః సైనాపత్యమ్, తత్।
3. వీర్యవిభూతిభిః – వీర్యస్య విభూతయః (ష.త) వీర్యవిభూతయః, తాభిః ।
4. సురబన్దీనామ్ – సురాణాం బన్ద్యః (ష.త) సురబన్ద్యః తాసామ్ ।

**సంధులు:–**

1. తస్య + ఆత్మా – తస్యాత్మా – సవర్ణదీర్ఘసన్ధిః
2. వేణీః + వీర్యవిభూతిభిః – వేణీర్వీర్యవిభూతిభిః – విసర్గసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**ఎ) వేణీ / వేణీః**

ఎ) వేణిః – స్త్రీ – వీ + 'వీజ్యార్వరిభ్యో నిః' ఇతి ని ।
పుషోదరాదిత్వాత్ణత్వమ్ వేణీ – స్త్రీ – వేణి + వా జీష్ ।

బి) శ్లో॥ కేశాః శిరసిజ మూర్ధజకచ చికుర శిరోరుహాః స్మృతా వాలాః ॥
తద్బన్ధవిశేషాః స్యుర్**వేణీ** ధమ్మిల్లకున్తలకవర్యః ॥
అని 'హలాయుధకోశము'. కేశబంధవిశేషము.

సి) శ్లో॥ ప్రాసాద కాలాగురు ధూమరాజి
తస్యాః పురో వాయువశేన భిన్నా ।
వనాన్నివృత్తేన రఘూత్తమేన
ముక్తా స్వయం వేణిరివావభాసే ॥ ర.వం. 14–12

"... అయోధ్యాపురి అను స్త్రీ, తన పతియగు రాముడు ప్రవాసమున్న కాలమునందు పాతివ్రత్యధర్మమునననుసరించి విడువక ముడుచుకొనిన జడను, ఆతడు అరణ్యమునుండి వచ్చి విప్పినట్లుండెను.". వియోగకాలమున జటాబంధము

చేయుట, మరల సంగమకాలమునందు జటామోక్షమును చేయుట అనుదానికి ప్రమాణవాక్యము - ఈ దిగువ నీయబడినది - **"న ప్రోషితే తు సంస్కుర్యాన్న వేణీం చ ప్రమోచయేత్ '.** ఇతి హారీతః

డి) "అబలా వేణి మోక్షోత్సుకాని" - అని 'మేఘదూతమ్ ' 101
తరంగిణీ వేణిరివాయతా భువః " అని శిశుపాలవధ 12-75

ఇ) శ్లో॥ **మోక్ష్యధ్వే స్వర్గబన్దీనాం వేణీ** బన్ధానదూషితాన్ ।
శాపయన్త్రితపౌలస్త్యబలాత్కారకచగ్రహైః ॥ ర.వం. 10-47

"... దేవతా స్త్రీలు, ఇక నుండి కేశబంధనములను విడిచి చక్కగా కేశములను సంస్కరించుకొందురుగాక."

ఎఫ్) శ్లో॥ వసనే పరిధూసరే వసానా నియమక్షామతనుర్ధృతైకవేణిః।
అపి నిష్కరుణస్య శుద్ధశీలా మమ దీర్ఘం విరహవ్రతం వహన్తీ ॥
అ.శా. 7

"దుమ్ము కొట్టుకొనబడిన వస్త్రములు ధరించినదై వ్రతములను నియమములను ఆచరించుటచేత కృశాంగియై **జడలుకట్టిన కేశములు** కలిగి శుద్ధశీలయగు శకున్తల అతికఠోర హృదయముగలిగిన నా కారణమున వియోగినీ వ్రతమును ధరించు చున్నది."

జి) శ్లో॥ పరిపాణ్డుదుర్బలకపోలసున్దరం దధతీ విలోలకబరీకమాననమ్ ।
కరుణస్యమూర్తిరథవా శరీరిణా విరహవ్యథేవ వనమేతి జానకీ ॥
ఉత్తరరామచరితమ్ - 3 విష్కంభః -4

"అంతట పాలి స్రుక్కియున్న చెక్కిళ్లచే సొబగారుచున్నదియు, చెదరిన తుఱుము గలదియు నగు మొగమును దాల్చినదై. జానకీదేవి వనమునకు అరుగుదెంచుచున్నది

2) ఆత్మా - ఎ) 'ఆత్మా వై పుత్ర ఉత్పన్న ఇతి వేదానుశాసనమ్' స్కందపురాణమ్

బి) శ్లో॥ అంగాదంగాత్ సంభవసి హృదయాదధిజాయసే ।
ఆత్మ వై పుత్ర నామాసి స జీవ శరదః శతమ్ ॥

**క్రియాదర్శము:-** 1. **మోక్ష్యతే** -ముచ్ల (ముచ్) మోచనే (విడుచుట) తుదాది (6) సకర్మకమ్, అనిట్, (ఉభయ) ఆత్మనేపదీ, ల్యట్ ప్రథమపురుషైకవచనము. రూపాలు - **మోక్ష్యతే,** మోక్ష్యేతే, మోక్ష్యన్తే

**అలంకారములు:-** ఇట 'పర్యాయోక్తాలంకార'మున్నదని చెప్పదగును.

---





**శ్లో॥ ఇతి వ్యాహృత్య విబుధా -**
**న్విశ్వయోనిస్తిరోదధే ।**
**మనస్యాహితకర్తవ్యాః**
**తేఽపి దేవా దివం యయుః ॥ 62**

**పదవిభాగము:-** ఇతి, వ్యాహృత్య, విబుధాన్, విశ్వయోనిః, తిరోదధే, మనసి, ఆహితకర్తవ్యాః, తే, అపి, దేవాః, దివమ్, యయుః ।

**అన్వయక్రమము:-** విశ్వయోనిః విబుధాన్ ఇతి వ్యాహృత్య తిరోదధే । దేవాః అపి మనసి ఆహితకర్తవ్యాః (సన్తః) దివం యయుః ।

**ప్రతిపదార్థము:-** విశ్వయోనిః - బ్రహ్మదేవుడు, విబుధాన్ - దేవతలనుగూర్చి, ఇతి - ఇట్లు, వ్యాహృత్య - పలికి, తిరోదధే - అంతర్ధానము చెందెను, తే దేవా : - ఆ దేవతలు, అపి - కూడ, మనసి - మనస్సునందు, ఆహితకర్తవ్యాః - చేయవలసిన పనులుగలవారై, దివమ్ - స్వర్గమునుగూర్చి, యయుః - పోయిరి.

**తాత్పర్యము:-** బ్రహ్మదేవుడు దేవతలనుగూర్చి ఇట్లు పలికి అంతర్ధానము చెందెను. ఆ దేవతలు కూడా మనస్సునందు చేయవలసిన పనులు గలవారై స్వర్గమును గూర్చి పోయిరి.

**విభక్తులు / క్రియలు:-** 1.విశ్వయోనిః - **విశ్వయోనిః,** విశ్వయోనీ, విశ్వయోనయః, ఇకారాన్త పుంలింగ విశ్వయోని శబ్దము. ప్ర.ఏ 2.విబుధాన్ - విబుధమ్, విబుధౌ, **విబుధాన్,** అకారాన్త పుంలింగ విబుధశబ్దము. ద్వి.బ 3. ఇతి, అపి - అవ్యయాలు 4. వ్యాహృత్య - అవ్యయము వి + ఆ +హృ + క్త్వా - ల్యబన్తము 5. తిరోదధే - క్రియ - తిరస్+ ధా+ లిట్ ప్రథమపురుషైకవచనము 6. తే - సః, తౌ, **తే,** దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్రథమావిభక్తిబహువచనము 7. దేవాః, దేవః, దేవౌ, **దేవాః,** - అకారాన్త పుంలింగ దేవశబ్దము. ప్రథమావిభక్తి బహువచనము 8. మనసి - **మనసి,**మనసోః, మనఃసు, సకారాన్త నపుంసకలింగ **మనస్** శబ్దము. స.ఏ 9. ఆహితకర్తవ్యాః - ఆహితకర్తవ్యః, ఆహితకర్తవ్యౌ, **ఆహితకర్తవ్యాః,** అకారాన్త పుంలింగ ఆహితకర్తవ్య శబ్దము. ప్ర.బ 10. దివమ్ - **దివమ్,** దివే, దివాన్, అకారాన్త నపుంసకలింగ దివశబ్దము. ద్వి.ఏ 11. యయుః - యా + లిట్, ప్రథమపురుషబహువచనము

**సంధులు:-**

1. విశ్వయోనిః + తిరోదధే - విశ్వయోనిస్తిరోదధే - విసర్గసన్ధిః
2. మనసి+ ఆహిత - మనస్యాహిత - యణాదేశసన్ధిః
3. తే + అపి - తేఽపి - పూర్వరూపసన్ధిః **పూర్వరూపసన్ధిః** - ఏఙః పదాన్తాదతి

(సూ 6-1-105) - పదాంత మందున్న ఏ ఓలకు హ్రస్వ అకారము పరముగా నున్నపుడు, పూర్వపరముల స్థానమున పూర్వరూపము ఏకాదేశమగును.

**సమాసాలు:-**

1. విశ్వయోనిః- విశ్వస్య యోనిః(ష.త.)।
2. విబుధాన్ - విశేషేణ బుధ్యన్తే (ప్రాదితత్పు) ఇతి విబుధాః, తాన్ ।
3. ఆహితకర్తవ్యాః - ఆహితం కర్తవ్యం యైః (బహువ్రీహి) తే ।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

**1. విబుధః**

ఎ) విశేషేణ బుధ్యతే ఇతి। వి+బుధ్+క ।

బి) శ్లో॥ ఆదిత్యాస్త్రిదశాః సుమనసః స్వర్గౌకసో దేవతా
గీర్వాణా ఋభవోఽ మరాశ్చ మరుతో బృందారకా నిర్జరాః ।
అస్వప్నా విబుధా స్త్రివిష్టపసదో లేఖాః సుపర్వాణ ఇ -
త్యాఖ్యాతా అమృతాశనా అనిమిషా దేవాస్తథా దైవతమ్॥

అని హలాయుధకోశము 'విబుధ' శబ్దానికి 21నామములను అందించినది.

సి) శ్లో॥ గంధర్వా గుహ్యకా యక్షా విబుధానుచరాశ్చ యే
తథైవాప్సర స స్సర్వా రాజసీషూత్తమా గతిః॥ మనుస్మృతి 12-47

"గంధర్వులు - గుహ్యకులు, యక్షులు, దేవతలకు అనుచరులగు విద్యాధరులు, అప్సరసలు - వీరు రాజసులలో ఉత్తములు".

డి) శ్లో॥ గోప్తారం న నిధీనాం మహయన్తి మహేశ్వరం విబుధాః..
-సుభాషితము

**క్రియాదర్శము:- 1. యయుః-** యా(ప్రాపణే) పొందుట, వెళ్లుట, అదాది ప్రకరణమ్ (2) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్. ప్రథమపురుషరూపాలు : యయౌ - యయతుః - **యయుః**

---

**అవతారికా:-** ఇన్ద్రేణ హరచిత్తాకర్షణార్థం స్మరసంస్మరణమాహ। - హరుని చిత్తాకర్షణమునకై ఇంద్రుడు మన్మథుని స్మరించుట చెప్పుచున్నాడు.





**శ్లో॥ తత్ర నిశ్చిత్య కన్దర్ప**
**మగమత్పాకశాసనః ।**
**మనసా కార్యసంసిద్ధౌ**
**త్వరాద్విగుణరంహసా ॥ 63**

**పదవిభాగము:-** తత్ర, నిశ్చిత్య, కన్దర్పమ్, అగమత్, పాకశాసనః, మనసా, కార్యసంసిద్ధౌ, త్వరాద్విగుణరంహసా.

**అన్వయక్రమము:-** పాకశాసనః తత్ర నిశ్చిత్య కార్యసంసిద్ధౌ త్వరాద్విగుణరంహసా మనసా కందర్పమ్ అగమత్ ।

**ప్రతిపదార్థము:-** పాకశాసనః - పాకుడను అసురునియొక్క శత్రువగు ఇంద్రుడు తత్ర - స్వర్గమునందు, నిశ్చిత్య - నిశ్చయించుకొని, కార్యసంసిద్ధౌ - కార్యసఫలతలో, త్వరాద్విగుణరంహసా - తొందరచే రెట్టింపయిన వడిగల, మనసా - మనస్సుతో కందర్పమ్ - మన్మథునిగూర్చి, అగమత్ - పోయెను (తలంచెను).

**తాత్పర్యము:-** పాకుడను అసురుని యొక్క శత్రువగు ఇంద్రుడు స్వర్గమునందు నిశ్చయించుకొని కార్యసఫలతలో తొందరచే రెట్టింపయిన వడిగల మనస్సుతో మన్మథునిగూర్చి తలంచెను.

**విభక్తులు / క్రియలు:-** 1. పాకశాసనః - పాకశాసనః, పాకశాసనౌ, పాకశాసనాః, అకారాన్త పుంలింగ పాకశాసన శబ్దము. ప్ర.ఏ 2. తత్ర - అవ్యయము 3. నిశ్చిత్య - నిస్ + చి + క్త్వా - ల్యబన్తము 4. కార్యసంసిద్ధౌ - కార్యసంసిద్ధౌ, కార్యసంసిద్ధ్యోః, కార్యసంసిద్ధిషు, ఇకారాన్త స్త్రీలింగ కార్యసంసిద్ధిశబ్దము. స.ఏ 5. త్వరాద్విగుణరంహసా - త్వ...రంహసా, రంహోభ్యామ్, రంహోభిః, సకారాన్త నపుంసకలింగ త్వరాద్విగుణరంహస్ శబ్దము. తృ.ఏ 6. మనసా - మనసా, మనోభ్యామ్, మనోభిః, సకారాన్త నపుంసకలింగ మనస్ శబ్దము. తృ.ఏ 7. కందర్పమ్ - కందర్పమ్, కందర్పౌ, కందర్పాన్, అకారాన్త పుంలింగ కందర్ప శబ్దము. ద్వి.ఏ 8. అగమత్ - క్రియ, గమ్+ లుఙ్, ప్రథమపురుషైకవచనమ్.

**సమాసాలు:-**

1. పాకశాసనః - పాకం శాసయతీతి (ఉపపదతత్పు) సః।
2. కార్యసంసిద్ధౌ - కార్యస్య సంసిద్ధిః (ష.త) తస్యామ్ ।
3. త్వరాద్విగుణరంహసా - త్వరయా ద్విగుణం రంహః యస్య (బహువ్రీహి) తత్, తేన।

4. కందర్పమ్ – కుత్సితః దర్పః యస్య (బహుభ్రీహి) సః, కందర్పః, తమ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. కందర్పః –** ఎ) కమిత్యవ్యయం కుత్సాయాం, కం కుత్సితో దర్పః యస్మాత్ । యద్వా, కం సుఖం తేన తత్ర వా దృప్యతి । కమ్ +దృప్ + అచ్ । కం బ్రహ్మాణం ప్రతి దర్పితవాన్ వా ।

బి) శ్లో॥ ప్రద్యుమ్నో మకరధ్వజో మనసిజః సంకల్పజన్మాంగజః
పంచేషుః కుసుమాయుధశ్చ మదనో మారః స్మరో మన్మథః ।
కందర్పో ఝషకేతనో రతిపతిః శ్రీనందనో హృచ్ఛయః
కామః శంబరసూదనో మధుసఖః శృంగారయోనిః స్మృతః ॥32

శ్లో॥ దర్పకః శూర్పకారాతిరనఙ్గో విషమాయుధః ।
ఆత్మభూర్మనసిశయః పుష్పధన్వా మనోభవః ॥33

శ్లో॥ మాపత్యమిరజశ్చైవ.... అని హలాయుధకోశము '30' నామములను 'కందర్ప' శబ్దానికి పేర్కొన్నది.

సి) శ్లో॥ కం దర్పయామీతి మదాజ్ఞాతమాత్రో జగాద చ ।
తేన కందర్పనామానం తం చకార చతుర్ముఖః ॥
అని 'కందర్ప' శబ్ద నిర్వచనము

డి) శ్లో॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ భ. 10–28

"...ప్రజోత్పాదనము చేయువారియందు కాముడు నేను.." అని భగవద్గీతయందు భగవానుడు చెప్పియున్నాడు.

**క్రియాదర్శము:– అగమత్,** గమ, (గమ్) గతౌ (వెళ్లుట) భ్వాదిప్రకరణమ్ (1), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లుఙ్. ప్రథమపురుషైకవచనము (సూత్రము 7–3–77 – ఇషు గమి యమాం ఛః అను దానిచే 'మకారము'నకు ఛకారాదేశము. గమ+అ+తి – గఛ్+అ+తి . తుగాగమము. శ్చుత్వములచే గచ్ఛతి అను రూపము. లట్ ప్రథమపురుషైకరూపము). లుఙ్‌రూపాలు – **అగమత్** – అగమతామ్ – అగమన్

శ్లో॥ మురళామారుతోద్ధూతమగమత్కైతకం రజః ।
తద్యోధవారవాణానామయత్న పటవాసతామ్ ॥ ర.వం. 4–55

---





**సర్గాంతశ్లోకము:–** మాలినీవృత్తము

**శ్లో॥ అథ స లలితయోషిద్భ్రూలతాచారుశృఙ్గం**
**రతివలయపదాఙ్కే చాపమాసజ్య కణ్ఠే ।**
**సహచరమధుహస్తన్యస్తచూతాఙ్కురాస్త్రః**
**శతమఖముపతస్థే ప్రాంజలి ఃపుష్పధన్వా ॥ 64**

**పదవిభాగము:–** అథ, సః, లలితయో....శృఙ్గమ్, రతివలయపదాఙ్కే, చాపమ్, ఆసజ్య, కణ్ఠే, సహచర, ...రాస్త్రః, శతమఖమ్, ఉపతస్థే, ప్రాంజలిః, పుష్పధన్వా.

**అన్వయక్రమము:–** అథ సః పుష్పధన్వా లలితయోషి ద్భ్రూలతాచారుశృఙ్గం, చాపం రతివలయపదాఙ్కే కణ్ఠే ఆసజ్య సహచరమధుహస్తన్యస్తచూతాఙ్కురాస్త్రః ప్రాఞ్జలిః శతమఖమ్ ఉపతస్థే.

**ప్రతిపదార్థము:–** అథ – పిమ్మట (ఇంద్రుడు స్మరించిన వెంటనే), సః – ఆ, పుష్పధన్వా – పూవిల్తుడు (మన్మథుడు), లలిత – యోషిత్ –భ్రూలతా – చారు – శృఙ్గమ్ = అందగత్తె ఐన – చెలువయొక్క – కనుబొమతీగవలె – అందమైన – కొప్పులుగలిగినట్టి, చాపమ్ – వింటిని, రతివలయపద + అఙ్కే – రతీదేవియొక్క గాజుల తావులు – గురుతుగా గలదైన,కణ్ఠే – మెడమీద, ఆసజ్య – తగిలించి, సహచర – మధుహస్త –న్యస్త – చూతాంకుర – అస్త్రః = చెలికాడైన – వసంతుని యొక్క – చేతియందు – ఉంచబడిన – మావిమొగ్గయనెడు – బాణముకలవాడై ప్రాంజలిః – అంజలి ఘటించిన వాడై, శతమఖమ్– నూఱుజన్నములవానిని (అనగా దేవేంద్రుని), ఉపతస్థే – కలసికొనెను.

**తాత్పర్యము:–** పిమ్మట ఆ పూవిల్తుడు, అందగత్తె ఐన చెలువయొక్క కనుబొమల తీగవలె అందమైన కొప్పులు కలిగినట్టి వింటిని, రతీదేవియొక్క గాజుల తావులు గుఱుతుగా గలదైన మెడమీద తగిలించి, చెలికాడైన వసంతునియొక్క చేతియందు ఉంచబడిన మావిమొగ్గయనెడు బాణము కలవాడై, అంజలి ఘటించిన వాడై ఇంద్రుని కలసికొనెను.

**విభక్తులు / క్రియలు:–** 1. అథ – అవ్యయము 2. సః – సః, తౌ, తే, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 3. పుష్పధన్వా –పుష్పధన్వా, పుష్పధన్వానౌ, పుష్పధన్వానః, నకారాన్త పుంలింగ పుష్పధన్వన్ శబ్దము. ప్ర.ఏ 4. లలిత..శృఙ్గమ్, శృఙ్గమ్,...శృఙ్గే,...శృఙ్గాణి, అకారాన్త నపుంసకలింగ ...శృఙ్గశబ్దము. ద్వి.ఏ 5. చాపమ్ – చాపమ్, చాపే, చాపాని, అకారాన్త నపుంసకలింగ చాపశబ్దము.

ద్వి.ఏ 6. రతి....అఙ్కే..అఙ్కే, అఙ్కయోః, అఙ్కేషు, అకారాన్త పుంలింగ –అఙ్కశబ్దము. స.ఏ 7. కణ్ఠే – కణ్ఠే, కణ్ఠయోః, కణ్ఠేషు, అకారాన్త పుంలింగ కణ్ఠశబ్దము. స.ఏ 8. ఆసజ్య – ఆ + సంజ్+ క్త్వా–ల్యబన్తము – అవ్యయము 9. సహ... అస్త్రః... అస్త్రః,...అస్త్రౌ,...అస్త్రాః, అకారాన్త పుంలింగ.... అస్త్రః శబ్దము. ప్ర.ఏ 10. ప్రాంజలిః – ప్రాంజలిః, ప్రాంజలీ, ప్రాంజలయః, ఇకారాన్త పుంలింగ ప్రాంజలిశబ్దము. ప్ర.ఏ 11. శతమఖమ్ – శతమఖమ్, శతమఖౌ, శతమఖాన్, అకారాన్త పుంలింగ శతమఖ శబ్దము. ద్వి.ఏ 12. ఉపతస్థే – క్రియ – ఉప+స్థా (ఆత్మనేపద) + లిట్, ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1. పుష్పధన్వా – పుష్పం ధనుః యస్య (బహువ్రీహి), సః ।
2. లలితయోషిద్భ్రూలతాచారుశృఙ్గమ్ – లలితా చాసౌ యోషిత్ (కర్మధా) లలితయోషిత్, లలితయోషితః భ్రూలతే (ష.త), భ్రువౌ ఏవ లతే (కర్మధా) భ్రూలతే, లలితయోషిద్భ్రూలతే ఇవ చారుణీ (కర్మధా) శృఙ్గే యస్య (బహువ్రీహి) తత్.
3. రతివలయపదాఙ్కే – రతేః వలయః (ష.త) రతివలయః, తస్య పదమ్ (ష.త) తస్య అంకః (ష.త) తస్మిన్.
4. సహచరమధుహస్తన్యస్తచూతాంకురాస్త్రః – సహచరతీతి (ఉపపదతత్పు) సహచరః, సహచరః చాసౌ మధుః (కర్మధా) సహచరమధుః, సహచరమధోః హస్తః (ష.త) సహచరమధుహస్తః, తస్మిన్ న్యస్తం (స.త) చూతస్య అంకురః (ష.త) చూతాంకుర ఏవ అస్త్రమ్ (కర్మధా) సహచరమధుహస్తన్యస్తం చూతాంకురాస్త్రం యస్య (బహువ్రీహి) సః ।
4. ప్రాంజలిః – ప్రకృష్టః అంజలిః యస్య (బహువ్రీహి) సః।
5. శతమఖమ్ – శతం మఖాః యస్య (బహువ్రీహి) సః, తమ్।

**సంధులు:–**

ప్రాంజలిః+పుష్పధన్వా – ప్రాంజలి ꣵపుష్పధన్వా

జిహ్వామూలీయోపధ్మానీయాదేశః (అర్ధవిసర్గాదేశము)

కుప్వోః ꣵక ꣵపౌచ (సూ 8–3–37) క,ఖ, ప,ఫలు పరముగా నున్నపుడు విసర్గమునకు అర్ధవిసర్గము ఆదేశమగును. ఏకపదము, ధాతూపసర్గములందు, సమాసమునందును ఈ ఆదేశము నిత్యము. వాక్యమునందు ఇది వైకల్పికము.

ఉదా –

ఎ) దుః+ ఖమ్ –దుఃఖమ్ (ఏకపదము)





బి) అన్తః+ కరణమ్ – అన్తఃకరణమ్ )ఉపసర్గ – ధాతువు)

సి) మనః+ ఫలమ్ (మనఃఫలమ్) సమాసము

డి) చంచలం హి మనఃకృష్ణ ! (వాక్యము)

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు –కావ్యప్రయోగాలు:**

**1) శతమఖః**

ఎ) శతం మఖాః యజ్ఞాః యస్య ।

బి)శ్లో॥ ఇంద్రో దుశ్చ్యవనో హరిః సురపతిః సంక్రన్దనో వాసవో
వృత్రారిర్బలసూదనః శతమఖో ...........
..............................................
దివస్పతిర్ద్విడౌజాశ్చ మరుత్వాన్మేఘవాహనః ॥ 54

అని హలాయుధకోశము 'శతమఖ' పదానికి '39' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ ద్విరదానివ దిగ్విభావితాం
శ్చతురస్తోయనిధీనివాయతః ।
ప్రసహేత రణే తవానుజాన్
ద్విషతాం కశ్శతమన్యు తేజసః । కిరాతార్జునీయమ్ 2–23

"దిక్కులందు ప్రసిద్ధములైన నాలుగు ఏనుగులవలె, దిక్ప్రసిద్ధములైన నాలుగు సముద్రములవలె వచ్చుచున్న దేవేంద్ర సమప్రతాపులగు నీ నల్వురు తమ్ములను శత్రువులలో నెవ్వడు యుద్ధమున నోర్వగలడు?

డి) శ్లో॥ చరణయోర్నఖరాగసమృద్ధిభిః
ముకుటరత్నమరీచిభిరస్పృశన్ ।
నృపతయః శతశో మరుతో యథా
శతమఖం తమఖణ్డితపౌరుషమ్ ॥ ర.వం. 9–13

"మొక్కవోని పరాక్రమముగల ఆ దశరథుని, దేవతలు ఇంద్రునివలె, కాలిగోళ్ల కాంతిని పెంపొందింపచేయు తమ కిరీటములయందలి రత్నముల కాంతులతో, దశరథుని చరణములను వందలకొలది రాజులు స్పృశించిరి."

ఇ) శ్లో॥ జాతః కులే తస్య కిలోరు కీర్తిః
కులప్రదీపో నృపతిర్దిలీపః ।
అతిష్ఠదేకోనశతక్రతుత్వే
శక్రాభ్యసూయా వినివృత్తయే యః ॥ ర.వం. 6–74

"...దేవేంద్రుని అసూయను తొలగించుటకే ఒకటి తక్కువగ నూఱు యాగములను ఆ దిలీపుడు నిర్వర్తించెను".

**క్రియాదర్శము:-** ఉపతస్థే, ఉపపూర్వక 'ష్ఠా గతినివృత్తౌ' ఇత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి భూతే లిట్ ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాంతః ఉపతస్థే - ఉపతస్థాతే - ఉపతస్థిరే. రఘువంశము (4-6) నందుగల ఈ పదప్రయోగమును చూడండి.

శ్లో॥ పరికల్పితసాన్నిధ్యా కాలే కాలే చ వందిషు ।
స్తుత్యం స్తుతిభిరర్థ్యాభిరుపతస్థే సరస్వతీ ॥

**ఛందస్సు:-** ఈ సర్గాంతశ్లోకము మాలినీ వృత్తమున నిబంధింపబడినది.

**లక్షణము:-** 'ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః ।'

**అలంకారములు:-**

1) ఇట 'స్వభావోక్త్యలంకార' మున్నదని చెప్పదగును. **'స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తువర్ణనమ్'** ఇతి. ఒక వస్తువుయొక్క యథార్థ స్వరూపస్వభావములు - ఉన్నదున్నట్లు వర్ణించుట స్వభావోక్తి. ఇట 'పూవిల్తుని' - 'వర్ణన సహజముగ వర్ణింపబడినది.

2) 'అలంకారశేఖర'ము 'విపర్యోపమాలంకార'ము నకు ఉదాహరణగా ఈ శ్లోకమునే పేర్కొనుట గమనింపదగినది.

మహాకవి శ్రీకాళిదాస విరచిత కుమారసంభవమహాకావ్యమున 'బ్రహ్మసాక్షాత్కార' నామ ద్వితీయసర్గకు నాచే వ్రాయబడిన మృణాళినీ వ్యాఖ్య - ది.22-5-2010 ఉదయం గం. 7-43 ని॥లకు ప్రారంభింపబడి నిజవైశాఖ బహుళ త్రయోదశి సాయంసమయమున అనగా ది. 10-6-2010న సాయంత్రము గం.4-29 ని.లకు పూర్తిచేయబడినది.

'అస్తు'ః

---



**అనుబంధం-1**

श्रीः

# कुमारसम्भवमहाकाव्यम्

## (अनन्ददेवायनिवल्लभदेवविरचितया पंजिकया सहितम्)

## द्वितीयः सर्गः

१. तस्मिन्नित्यादि ॥ यदा गिरिजा गिरिशं उपचचार तस्मिन् एव (काले) अवसरे तारकेण वज्रांग तनयेनासुरेण विप्रकृताः उपद्रुताः सन्तः दिवौकसः देवाः तुरासाहं इन्द्रं पुरोधाय अग्रेकृत्य स्वायंभुवं धाम ब्रह्मलोकं ययुः जग्मुः । दिवशब्दोऽकारान्तोऽपि यथा - 'दिशो बाहू दिवं शिरः। (म.भा. ६-६१-५४) स्वयंभूर्ब्रह्मा तस्येदं स्वायंभुवम् । संज्ञापूर्वको विधिरनित्यः (द्र.काशिका ६-४-१४६) इति गुणाभावः । सर्गेस्मिन् पथ्यावक्त्रादिकं वृत्तम् ॥

२. तेषामित्यादि ॥ तारकविप्रकारात् (पारिम्लानमुखश्रियाम्) नष्टवक्त्र - कान्तीनां तेषां देवानां ब्रह्मा विरञ्चिः आविरभूत् प्रत्यक्षीभूतो न तु तद्दर्शने विघ्नमुदपादि । (इव) यथा (सुप्तपद्मानां) सङ्कुचितारविन्दानां (सरसां) तोयाशयानां (प्रातर्दीधितिमान्) प्रभाते रविराविर्भवति। रवेरुपमानेन शोकविनाशोन्मुखः प्रसादः सूचितः ॥

३. अथ सर्वस्येत्यादि ॥ ततः सर्वे अखिला एव सुराः वागीशं ब्रह्माणं प्रणिपत्य प्रह्वीभूय वाग्भिः अर्थ्याभिः सत्याभिर्गीर्भि उपतस्थिरे तुष्टुविरे । कीदृशम् । सर्वस्य धातारं विश्वस्य धातारं स्रष्टारं सर्वतोमुखं चतुर्मुखमित्यर्थः। यदि वा बहुद्वारमखिलागमस्तुत्यत्वात् । (वागीशं) वाचां वेदशास्त्रमयीनामीशं पतिं प्रभवम्। तदुक्तम् —

**योगो ज्ञानं तथा सांख्यं विद्याः शिल्पानि कर्म च ।**
**वेदाः शास्त्राणि विज्ञानमेतत्सर्वं चतुर्मुखात् ॥** (महा.१३.१३५.१३९)

(मोक्ष्यते) उन्मोक्ष्यति । बद्धाया हि नार्याः स्वामिनैवोन्मोच्यः कबरीमोक्षः कार्य इत्याचारः। कालकूटपानवशाच्छिवस्यनीलगलत्वम् ॥

६२. इति व्याहृत्येत्यादि ॥ (विबुधान्) देवान् (इति) इत्थं (व्याहृत्य) उक्त्वा (विश्वयोनिः) वेधाः तिरोदधे अन्तर्हितः । (ते) देवाः अपि (मनसि) चेतसि (आहितकर्तव्याः) कृतकार्याः (दिवं) सुरभुवनं प्रति (ययुः) जग्मुः ॥

६३. तत्रेत्यादि ॥ ततः तत्र देवनाथः कथं हरगौरीसमागमः कार्य इति मन्त्रिभिः सह निश्चित्य (पाकशासनः) शक्रः (मनसा) चेतसि (सा?) तदा (कंदर्पं) स्मरम् अगमत्, कामं सस्मारेत्यर्थः। कीदृशेन मनसा । (कार्यसंसिद्धित्वराद्विगुणरहंसा) कार्यस्य हरगौरिसमागमलक्षणस्य या संसिद्धिर्निष्पत्तिः, तत्र या त्वरा शीघ्रता तया द्विगुणरहंसा महास्कन्देन । अगमदिति लुङि ऌदित्वादङादेशः । पाको नामासुरस्तस्य वधादिन्द्रः पाकशासनः ॥

६४. अथ सललितेत्यादि ॥ अथ अनुस्मृतः (पुष्पधन्वा) कामः (प्राञ्जलिः) अञ्जलिं विधाय (शतमखम्) इन्द्रम् उपतस्थे डुढोके । संगतकरणे लिट् । किं कृत्वा । प्राञ्जलित्वात् कण्ठे (चापं) धनुः (आसज्य) निधाय । कीदृशम् (सललितयोषिद्भ्रूलताचारुशृङ्गम्) सललिता विलासान्विता या योषितोऽङ्गना - स्तासां भ्रूलतावत् चारुशृङ्गं रम्याटनिकौटिल्यं चक्रीकरणाच्च । कीदृशे कण्ठे (रतिवलयपदङ्के) रतिरस्य भार्या तस्या वलयपदानि कटकमुद्रा (एव) अङ्कश्चिह्नं यस्य तदाश्लेषवशात् । कीदृशः कुसुमध्वजः । (सहचरमधुहस्तन्यस्तचूताङ्कुरास्त्रः) वयस्यः योऽसौ मधुर्वसन्तस्तस्य हस्ते न्यस्तोऽर्पितश्चूताङ्कुर एवास्त्रं शरो येन स तथोक्तः। मालिनीवृत्तमिति भद्रम् ।

**आनन्ददेवायनिवल्लभविरचितायां कुमारसंभवपञ्चिकायां कामागमो (नाम) द्वितीयः सर्गः ॥**

*****





**అనుబంధం-2**

శ్రీః

# కుమారసంభవమహాకావ్యము

## ద్వితీయసర్గలోని లోకోక్తులు

*1.* *శామ్యే త్ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః॥* ***2-40***

*2.* *విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్॥* ***2-55***

*****



